# దాశరథి రంగాచార్య

## రచనలు



# చిల్లర దేవుళ్ళు

డా॥ దాశరథి రంగాచార్య
రచనలు

మొదటి సంపుటం

# చిల్లర దేవుళ్ళు

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్–500 001.

CHILLARA DEVULLU *By Dr. Dasarathi Rangacharya*

ప్రచురణ నెం. : 2256

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మార్చి, 1987

ద్వితీయ ముద్రణ : జనవరి, 1992

తృతీయ ముద్రణ : అక్టోబరు, 1996

చతుర్థ ముద్రణ : మే, 2001



టైటిల్ డిజైన్ : చంద్ర

వెల: రూ. 50-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు-500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాదు, (సుల్తాన్‌బజార్, అబిడ్స్),
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్-29. ఫోన్: 3229831

# అంకితం



నిజాం నిరంకుశ పాలనలో ఊరూ పేరూ మాసిన
ఆంధ్రజాతికి ఒకతీరూ, తెన్నూ కల్పించిన
పద్మభూషణ, ఆంధ్రపితామహ
శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు
గారికి

ప్రథమ ముద్రణకు

# తొలిపలుకు

ప్రపంచ భాషలలో ఏ సాహిత్యము నవలోకించినను అందులో ఈనాడు కథానికతోపాటు నవలకు ప్రముఖస్థానము కనిపించుచున్నది. తెలుగు భాషలో ప్రస్తుతము ప్రకటితమగుచున్న పుస్తకాలను, పత్రికలను పరిశీలించినచో ఈ సత్యము వెల్లడికాగలదు. నవలలకు, కథానికలకు ఉన్నంత మంది పాఠకులు మరియే సారస్వత ప్రక్రియకు లేరని నిస్సందేహంగా చెప్పవచ్చును. నవలలు, కథానికలు బహుళముగా సమకాలిక సమాజానికి ప్రతిబింబాలై, సాహిత్యము మానవ విమర్శనమను సూక్తికి ఉదాహరణలుగా నున్నట్లు నేడు వివిధభాషలలో వెలువడుచున్న రచనలు రుజావు చేయుచున్నవి.

కథానికా రచన, నవలా రచన దేశభాషలయందు ఈ శతాబ్దిలో ప్రారంభమై వ్యాప్తి పొందుచున్నవి. తెలుగుభాషలో నవలా వాఙ్మయానికి డెబ్బది అయిదు సంవత్సరాలకన్నా వయస్సు యెక్కువ ఉన్నది. ఈ కాలములో ప్రకటితమైన నవలలు అసంఖ్యాకములు. వీనిలో చారిత్రక, అపరాధ పరిశోధక, సాంఘిక నవలలతోపాటు ఒకటిరెండు పౌరాణిక నవలలు కూడా కనుపించుచున్నవి. బెంగాలీ, హిందీ, మరాఠీ, గుజరాతీ భాషలలో ప్రశస్తమైన నవలలు కొన్ని తెలుగులో పరివర్తనను పొంది, ఆంధ్రపాఠకలోకపు అభిమానానికి పాత్రమైనవి. నేటి తెలుగు నవలలు చాలామట్టుకు సమకాలీన సమాజానికి ప్రతిబింబాలు, మరియు వ్యాఖ్యానాలై వున్నవి. రాజశేఖరచరిత్ర, మాలపల్లి, వేయి పడగలు, నారాయణరావు, కీలుబొమ్మలు, మెఱుపుల మరకలు, అల్పజీవి, చివరకు మిగిలేది, బలిపీఠం, కొల్లాయి గట్టితేనేమి - మొదలైనవి ఈ శ్రేణికి చెందిన నవలలు. ఈ వరుసలోనే తెలంగాణాలోని ప్రజల జీవితమును చిత్రించునవలలు కొన్ని అవతరించినవి. వీనిలో తెలంగాణా నుడికారము చక్కగా నుపయోగించబడినది. ప్రజల మనిషి, వెల్లువలో పూచికపుల్ల యిటువంటి నవలలో పేర్కొనదగినవి. భారతదేశానికి స్వాతంత్ర్యము రాకముందు, హైదరాబాదులో పోలీసు చర్య జరుగకముందు, అప్పటి నిజాము రాష్ట్రమున అంతర్భాగమైన తెలంగాణాలో కొన్ని ప్రత్యేక పరిస్థితులు నెలకొని వుండెను. అంతేగాక, అప్పటి తెలంగాణా భాషలో ఒకవిధమైన ప్రత్యేకత గూడా గోచరించుచున్నది. ఆనాటి తెలంగాణా రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్తితులను ఈ "చిల్లరదేవుళ్ళు" చక్కగా చిత్రించినది. ఇందులో నుడికారము పాత్రోచితముగా నున్నది.

ఈ నవల రచించిన శ్రీ దాశరథి రంగాచార్యులు వరంగల్లు జిల్లాలోని ఒక విద్వత్కుటుంబానికి చెందిన యువకులు. వీరి జనకులు దిట్టమైన షండితులుగా, కవులుగా యీ ప్రాంతమున ప్రఖ్యాతిగాంచినారు. సకలాంధ్రకవి ప్రపంచమున ప్రథమశ్రేణి నలంకరించుచున్న మహాకవి శ్రీ దాశరథి వీరికి అగ్రసోదరులు. ఇటువంటి ఉత్తమ సాహితీ సంప్రదాయానికి వారసులైన శ్రీ రంగాచార్యులవారు కవులుగా వాఙ్మయ రంగములో ప్రవేశించి నవలా రచయితగా ప్రశస్తిగాంచినారు. సంస్కృతాంధ్రములతోపాటు ఉర్దూ, హిందీ, ఇంగ్లీషుభాషలలో కూడా మంచి ప్రవేశము కలిగిన వీరు 'ఉమరావ్ జాన్ అదా' అను ఉత్తమ ఉర్దూ నవలను ప్రతిభావంతంగా ఆంధ్రీకరించిన సత్యము ఈ సందర్భమున పేర్కొనవలసి ఉన్నది.

పోలీసు చర్యకు పూర్వము తెలంగాణా ప్రాంతములో చిల్లర దేవుళ్ళు అధికార రూపములో

వెలసినారు. ఈ అధికారుల సుఖసంతోషాలకు, భోగవిలాసాలకు ఉపకరించుట మాత్రమే నిరుపేదల బ్రతుకు ఫలము. ఈ పతనము కేవలము ఒక్క రాజకీయ జీవితమునందేకాక సాంఘిక, ఆర్థిక, నైతిక జీవితములందు కూడా ప్రవేశించినది. ఒకవంక ప్రచండ మారుతమువలె నిరంకుశ ప్రభుత్వముతోపాటు మతవిద్వేషశక్తులు విజృంభించి పల్లె పల్లె, మూల మూల వ్యాపించి, తెలుగుజాతి స్వరూపమును రూపుమాపు స్థితిలో నుండగా ఆనాటి పాలకుల కనుసన్నల నర్తించిన అధికారులైన తెలుగువారి స్వార్థము పూర్తిగా మానవత్వమును మరపించుస్థితికి దిగజారినది. ఇట్టి దీనస్థితిని మన కన్నులకు కట్టినట్టు 'చిల్లర దేవుళ్ళు' అను ఈ నవలలో శ్రీ దాశరథి రంగాచార్యులవారు చిత్రీకరించారు.

శ్రీ దాశరథి రంగాచార్యులవారు కొందరు వ్యక్తుల జీవితాలనుకాక అప్పటి సమాజానికి ప్రతిబింబమైన సంపూర్ణ గ్రామజీవితమునే కథావస్తువుగా స్వీకరించుటచే వీరికి రచనా ప్రాంగణము విస్తృతమై, సమగ్రమైన విషయ నివేదక కుపకరించింది. ఉదాహరణకు ఒక గ్రామానికి రెడ్డి, కరణం, రైతు, కోమటి, చాకలి, మంగలి, మాల మాదిగలు ముఖ్యులు. గ్రామజీవితానికి సప్తాంగముల వంటివారు. వీరు ఆలంబనగా నడచు గ్రామవ్యవస్థను ప్రదర్శించుచు శ్రీ రంగాచార్యులు యీ వ్యవస్థకు పడికట్టురాళ్ళవలె వున్న కొన్ని అమానుషములైన ఆచారాలను, దారుణములైన అధికార లాంఛనాలను మిక్కిలి మెలుకువతో ప్రదర్శింపగలిగినారు. ఉదాహరణకు వెట్టి, బేగారి మొదలైన కట్టుబాట్లే కాక ఆడబాపను కూడా ప్రవేశపెట్టి క్రూరమైన ఆ దాస్యమును ప్రదర్శించినారు. ఎంతటి ఉద్రేకపూరితమైన విషయమైనను సరే, దాని భయంకర స్వరూపమును చిత్రించుటలో వీరు మంచి నేర్పును చూపినారు.

ఇట్లే పుల్లి భర్త హత్య, పీరిగాని మృతి, కరణం భార్య పిచ్చి, వనజ తల్లి పతనము, నారయ్యాకు, లంబాడీలకు జరిగిన మోసము, తురకదొరల జల్సాఖుషీల యేర్పాటు, నిలువెల్ల విషము కలిగిన కరణము వెంకట్రావ్ నిత్య జీవితము, రామారెడ్డిగారి అహంకారము మొదలైన విషయాలే కాక నాటి ఖిలాఫత్ ఉద్యమము, ఆంధ్ర మహాసభా ప్రారంభము, తురకలైన తెలుగువారిని తిరిగి హైందవులుగా చేసిన ఆర్య సమాజ నాయకుని ప్రయత్నము మున్నగు సంఘటనలన్నింటినీ సమయ సందర్భాల ననుసరించి వివరించారు.

శ్రీ రంగాచార్యులు అతి దారుణములైన విషయాలన్నిటిని, అతిసహజముగా చూపినారే కాని, ఎవరికోబాధ కలిగించు దృష్టితో వ్రాసినట్లు గోచరించదు. మీదు మిక్కిలి రచయితగా బాధ్యతను తామే వహించి ఎక్కడ ఏ పాత్రను విమర్శింపలేదు. ఏ అత్యాచారమును వర్ణించినను, గర్హించినను, ఆయా పాత్రల సంభాషణ ద్వారానే ఆ తిరస్కారమును కనబరచినారు. ఈ విధానానికి తెలంగాణా మాండలికము చాల ఉపకరించినది. పండితుడుగా పాఠకులకు పరిచితుడైన సారంగపాణి తప్ప పాత్రలందరు తెలంగాణా మాండలిక భాషనే మాట్లాడినారు. ఈ మాండలికమును ఆయా పాత్రలకు ఉపయోగించుటచేత నవలకు సహజత్వము చేకూరి, తెలంగాణా మాండలికముపై వీరికున్న అధికారము, ఆసక్తి వెల్లడియగుచున్నది. విషయ నివేదన పాత్రల సంభాసణలతో జరిగి, అచ్చటచ్చట పాత్రలుపయోగించిన సామెతలు నిశితములయ్యు నుడికారపు సొంపును గుమ్మరించుచు ఔచిత్య శోభితములై పాఠకునికి విసువును కలిగింపక ఆసక్తిని పెంచినవి.

పాత్ర పోషణములో శ్రీ రంగాచార్యులవారు యెంతో నేర్పును ప్రదర్శించినారు. సాధారణముగా చదివినప్పుడు గ్రామ పెద్దలందరూ స్వార్థపరులు, అధికారదాహము కలవారుగానే కనిపించుదురు. కాని, వారందరు ఒక మూసలో పోసిన అచ్చులు మాత్రముకారు. ఉదాహరణకు రామారెడ్డి తన ఆజ్ఞ ముందు

పారే పాము నిలువవలె నన్నంత అహంకారము కలవాడేకాని కొంత మెత్తని మనస్సు, ఔదార్యము కలవాడు. ఈ విషయము సారంగపాణిచేత అనేకసార్లు "ఈ కరణముకన్న రెడ్డిగారే నయం" అని పలికించి ఇద్దరి తారతమ్యము వివక్షించినారు. ఇక కరణం వ్యక్తి కాడు - దౌష్ట్యము, మోసము కలిసి రూపము దాల్చిన పరిణామము. ఇతరుల ధన, మాన, ప్రాణాలు నిలువునతీసి నిండుకుండవలె నిలకడగా వుండే నేర్పు కలవాడు. అతని బుద్ధి కత్తికన్న పదును. ఆ కత్తికి ఎరగాని వ్యక్తి లేడు. పాపము పరిపక్వమై రెడ్డిగారు దారుణవ్యాధితో ఉండి తన పాపాలను మననము చేసుకొని పశ్చాత్తాపముతో మరణించితే, రణముగారు ఆ కొద్ది పుణ్యానికి కూడా నోచుకోక లంబాడీలచేత హత్య గావింపబడినాడు.

ఈ నవలలో కేవలము అమానుషమైన ప్రవర్తన, కక్షలు, హత్యలు, పంచనలే కాక హృదయాహ్లాదకరమైన విషయాలు కూడా ఎన్నో ఉన్నవి. ఉదాహరణకు - సారంగపాణి, రాళ్లు కరిగించే అతని గానము, అతని సౌందర్యారాధన, సహృదయతలు, రామారెడ్డిగారి భవంతి, ఆ ఇంటి సొగసు, గృహాలంకరణ, తెలంగాణాలో మొక్కజొన్న కంకులను కాల్చి, వెన్న, మీగడ, మిరియాలతో కలిపి తినిన రుచి, దసరా ఉత్సవాలు, బతకమ్మను పేర్చుటకు తెచ్చిన పూలరాసులు, ఆ పూవులు దొంతరలుగా పేర్చుటలో స్త్రీలు ప్రదర్శించిన నేర్పు, స్త్రీల సత్సంప్రదాయ ప్రీతి మొదలైనవానిని చక్కగా వెల్లడించి పాఠకుని మనస్సునకు హాయిని కూర్చినారు.

ఈ నవలలో శృంగారము కూడ ప్రధాన స్థానాన్ని ఆక్రమించినను అతి సుకుమారముగా, ఉదాత్తరీతిలో వర్ణింపబడినదే కాని, ఎక్కడను అనౌచిత్యాన్ని ప్రదర్శించి పరిధులను మించలేదు. రామారెడ్డిగారి కూతురు మంజరి. ఈమె శరీరపుష్టి ఎంత మనోహరమో, హృదయము అంతటి సుందరము. తాను పాణిని ప్రేమించి లోలోన తపించి కృశించినదే కాని ఒక్క పలుకైనా పలుకలేదు. ఆమె చూపులు, అందలి భాషా సారంగపాణికి సర్వేంద్రియ తర్పణము గావించింది.

వ్యభిచారము, దాస్యము రెండును తప్పని భావించిన వనజ, పాణిని ప్రేమించినను అతని చేతిలో తానొక విలాసవస్తువు, పశువుకాక, అతడు సొగసు, మనసు కలిగిన వ్యక్తి అని గ్రహించి, అతనిపై ప్రేమను సోదర ప్రేమగా మార్చుకొని పాఠకులను ఆనందింపజేసినది.

సారంగపాణిచేత నిరాకరింపబడిన తాయారు వాంఛ - ఆమె బుద్ధిననుసరించి, స్త్రీ లౌల్యము - గలిగిన వైష్ణవాచార్యులచేత పూరింపబడినది. ఈ వనితలందరును ఒక ఎత్తు, దాదాపు దేశ దిమ్మరిగా పరిగణింపబడిన భీక్యా భార్య, చక్కని చుక్క లంబాడీ లక్ష్మి తన శీల పరిరక్షణ కావించుకొనిన విధానము ఒక ఎత్తుగా రచించి తమ విశాల హృదయమును ప్రకటించినారు శ్రీ రంగాచార్యులు.

ఈ విధముగా నవలను అన్ని దృక్పథాలనుండి పరిశీలింపగా, ఒక మంజరి, సారంగపాణులు తప్ప తక్కిన పాత్రలన్నియును కవికల్పనా చిత్రములుకాక నిజములట్లు భాసించును. 1947వ సంవత్సరానికి ముందు తెలంగాణా పరిస్థితులు తెలిసినవారికి ఈ నవల కేవలము కల్పనాకథ గాక యథార్థ చిత్రమని కూడా స్పష్టము కాగలదు.

నిన్నటి యథార్థము నేటి చరిత్ర. ఈ చరిత్రను యిందులో శ్రీ రంగాచార్యులవారు రసవంతముగా చెప్పినారు. నాకు తెలిసినంతవరకు ఇది వారి తొలి నవల. ఈ తొలినవల గుణమును బట్టి ఈ రంగమున వీరికి ఉజ్జ్వల భవిష్యత్తును సూచించుచున్నది. ముందు ముందు వారు యింకను అనేక ఉత్తమ నవలలను రచించి, ఆంధ్రభారతిని అలంకరించగలరని విశ్వసించుచు వారిని హృదయ పూర్వకముగా అభినందించుచున్నాను.

**దేవులపల్లి రామానుజరావు**

**(ఆం.ప్ర. సాహిత్య అకాడమీ కార్యదర్శి)**

# నవలా వృత్తాంతము

తెలుగు నవలకు "కళాపూర్ణోదయం" శ్రీకారం చుట్టిందనీ తొలి భారతీయనవల "కాదంబరి" అనీ మనవాళ్లు ముచ్చటపడుతుంటారు. గద్యప్రబంధమే నవల అనే అపోహతో యీ నిర్ణయాలకు వచ్చారు. అన్నట్లు ఈనాడు నవలలుగా చలామణి అవుతున్న అనేక పుస్తకాలు నిజానికి గద్యప్రబంధాలే. కాని నవల అనే ప్రక్రియ ఖచ్చితంగా పాశ్చాత్యుల నుంచి సంక్రమించింది. పారిశ్రామిక శకం సంఘాన్ని వ్యవస్థనూ తన అదుపులోకి తెచ్చుకుంటున్నప్పుడు, మధ్యతరగతి వర్గం అనే కొద్దిపాటి తీరుబడివున్న వర్గం సృష్టించబడినప్పుడు - నవల పుట్టుక అవసరం అయ్యింది. ప్రబంధాలలో వున్న కుహనాబాధలుగాని సంభాషణాచాతుర్యంగాని నవలకు ముఖ్యాంశాలు కావు. నవలలో ఒక సమగ్ర సమాజ పరిశీలన, వర్ణన వుండి తీరాలి. చార్లెస్ డికెన్స్, టాల్‌స్టాయ్, బాల్‌జాక్ మొదలయినవారి నవలలు చదివితే కథాగమనం, పాత్రలు మాత్రమేగాక ఆనాటి చారిత్రక వాతావరణం యావత్తూ మనముందు ప్రత్యక్షమవుతుంది. ఈ డాక్యుమెంటరీ లక్షణం నవలకు ప్రాణం లాంటిది.

చారిత్రక, భౌతిక, ఆర్థిక వ్యవస్థలకు అతీతంగా ఎవరి కథా జరగదనే వాస్తవాన్ని నవల విశ్లేషించి వర్ణిస్తుంది. ఈ నిడివి మరేపనికీ, కళకూ సాధ్యం కాదు. దీన్లో కొంతభాగం మాత్రమే నాటకంలో చూపగలం.

తెలుగునవల పుట్టి నూరేళ్ళుదాటింది. తెలుగునవలకు నూరేళ్ళూ నిండిపోయినవా అనే అనుమానం వొచ్చేటంత ఘోరమైన పుస్తకాలు ఇటీవల తామరతంపరగా వస్తున్నాయి. కాని "రాజా-మహిషి", "చిల్లర దేవుళ్ళు", 'హేంగ్ మి క్విక్' మొదలైన నవలలు తెలుగునవలకు కొన్ని ప్రాణాలను తిరిగి తీసుకువచ్చాయి.

ఏదేమైనా తెలుగునవల అభివృద్ధి నిరాశాజనకంగానే వుంది.

ఈనాటికీ మంచి తెలుగు నవలలు ఎన్నాలంటే చేతివేళ్ళు సరిపోతాయి. "మాలపల్లి" లాగా ఒక సమాజ పరిణామం తాలూకు సంగ్రహవర్ణన తెలుగు నవలల్లో మృగ్యం. తెలుగుకవిత, కథానిక ప్రపంచస్థాయినందుకున్నాయి. కొండొకచో ఆ స్థాయిని మించిపోయాయికూడా. అదేమాట తెలుగు నాటకం విషయంలోగాని, నవల విషయంలోగాని అనలేం.

నవలాపరిణామాలను గురించి అనేక సిద్ధాంతాలున్నాయి. వాటిలో మహానగర సంజనిత సద్ధాంతం అని ఒకటుంది. .... ఆ సిద్ధాంతాన్ని అన్వయిస్తే తెలుగువాడికొక నగరం లేదు. కనక తెలుగువాడికొక నవలలేదు అని నిర్ణయానికి రావచ్చు. సిద్ధాంతాల సంగతి ఎలావున్నా మన నవలాకారులకు నిజాయితీ లోపించిందన్న విషయం మనకు మంచినవలలు రాకపోవడానికి ముఖ్యకారణం. కళలల్లోనూ, సాహిత్యంలోనూ మనం ప్రస్తుతం అతిక్షీణదశలోనే వున్నాం. ఈ సమాజంలో ఈ దశను చేరుకొనడం రాజకీయ, ఆర్థిక కారణాలవల్లనే జరిగింది.

తెలుగు నవల తొలిదశలో పూర్తిగా కాల్పనిక సాహిత్యంగానే వుండిపోయింది. ఇటు బెంగాలీనవలలో, అటు వాల్టర్‌స్కాట్ రాసిన చారిత్రక కాల్పనిక నవలలో తెలుగునవలా రచయితలకు

ఆదర్శాలు.

భోగరాజు నారాయణమూర్తి రాసిన "ఆంధ్రరాష్ట్రం" మొదలైన నవలల్లో ఈ కాల్పనికత విశృంఖలంగా రాజ్యం చేసింది. మళ్ళీ చిలకమర్తి రాసిన నవలలన్నింటిలోనూ కథానిర్మాణము మెలోడ్రామా ముఖ్యాంగాలు. అచ్చమైన తెలుగునవలగా పేర్కొనదగ్గవాటిలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి "వడ్లగింజలు", వేలూరి శివరామశాస్త్రిగారి "ఓబయ్య" ముఖ్యమైనవి. ముఖ్యంగా "వడ్లగింజలు" చిన్నకథను జాగ్రత్తగా చదివిచూస్తే నవలా లక్షణాలు కొట్టొచ్చినట్లు కనబడతాయి. "ఓబయ్య" నవల 1930 నాటి రాజకీయ, సాంఘిక వాతావరణం స్పష్టంగా వర్ణించింది.

1922లో వెలువడిన "మాలపల్లి"కి దీటైన నవల మళ్ళీ వెలువడలేదనే చెప్పాలి. మాలపల్లిలో సమాజవాతావరణమేకాక సిద్ధాంత సంఘర్షణను కూడా చాలా నిజాయితీతో చిత్రించారు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు. దానిని ఎపిక్ నవలగా మనం ఎంచుకోవచ్చు.

నవల ముఖ్యంగా వాస్తవికతాబద్ధమైనది. కాని ప్రతి రచయితకూ అంతో యింతో కాల్పనికత మీద మోజు వుంటుంది. తెలుగు నవలా రచయితలో ఈ మోజే అధికారాన్ని చెలాయిస్తున్నది. అందుచేత బాపిరాజుగారు ఎంత జాతీయవాదులైనా ఆయన నవలలన్నింటా కాల్పనిక వాతావరణం కనబడుతుందిగాని వాస్తవిక వాతావరణం కనబడదు. ఇక విశ్వనాథ సత్యనారాయణ సంగతి సరేసరి. ఆయన కథావిధానం పౌరాణికం, భాష భాష్యపద్ధతి. గుడిపాటి వెంకటచలంగారి నవలలు సమాజాతీతమైనవి. ఆయన భావాలకు ప్రతీకలుగా పాత్రలను సృష్టించి కథ నడిపించారేగాని సమాజంలో ఒక భాగంగా ఆ కథలెప్పుడూ నడవలేదు. కొడవటిగంటి కుటుంబరావుగారు చిన్నకథల్లో కొద్దికాలంపాటు చలం ప్రవాహంలోనే కొట్టుకుపోయారు. కాని మార్క్సిస్టు పరిజ్ఞానం ఆయన్ని సంఘజీవిగా చేసింది. ఆయన "చదువు" ఆర్థిక మాంద్యంవొచ్చిన నాటి ఆంధ్రదేశ మధ్యతరగతి జీవితానికి దర్పణం.

గోపిచంద్ నవలలన్నిటా సమాజమున్నమాట వాస్తవం. కాని ఆయన పాత్రలన్నీ సమాజం నుంచి వొచ్చినవికావు. సమాజంలో వుంటూనే సమాజానికతీతంగా వ్యవహరించడానికి ప్రయత్నించాయాయన పాత్రలు. ఆ కారణంవల్లనే ఆయన చివరి నవలల్లో ముఖ్యమైన పాత్రలు కొన్ని "హరిద్వార్"కి వెళ్ళి సమాజానికి దూరమైపోయాయి.

జివి. కృష్ణారావు రాసిన "కీలుబొమ్మలు" చాలా ముఖ్యమైన నవల. ఇందులో పతనమవబోతున్న గ్రామ వాతావరణాన్ని నిజాయితీతో చిత్రీకరించారు. కాని కృష్ణారావుగారికి ఈ వ్యవస్థ అంటే కోపంకంటే అసహనం ఎక్కువ.

బుచ్చిబాబు అనేక కథలు వ్రాశాడు. ఒక ముఖ్యమైన నవలకూడా రాశాడు. కాని అన్నింటా ఆయన చెప్పింది ఒకటే కథ. తెలుగు దేశంలో జరిగే పాశ్చాత్యకథ.

మహీధర రామమోహనరావు రాసిన "రథచక్రాలు" వస్తురీత్యా శిల్పరీత్యా చాలా ముఖ్యమైన నవల. సమాజం ప్రభావంవల్ల వ్యక్తిగత దృక్పథం నుంచి సామాజిక దృష్టికి పరిణమించడం ఇందులోని వస్తువు. కాని ఆయన ఆ తర్వాత రాసిన నవలలన్నింటిలోనూ నిజాయితీ లోపించింది.

తెలంగాణా, ఆంధ్రమహాసభ ఆవిర్భావం వరకు అంధకారమయమైన భూస్వామ్య వ్యవస్థలో వున్నది. అందుచేత ఆకాలంలో తెలంగాణా నుంచి నవలలు రావడానికి అవకాశం లేదు. తెలంగాణా జీవితాన్ని నవలలో చిత్రీకరించడానికి ప్రయత్నించినవాడు బొల్లిముంత శివరామకృష్ణ. ఆయన

తెలంగాణావాడు కాకపోవడంలో ఆశ్చర్యం లేదు. ఆయన రాసిన మృత్యుంజయులు నిజాయితీకి, ఆవేశానికీ చక్కని ఉదాహరణ. కాని తెలంగాణా వాస్తవిక వాతావరణం అందులో వుందనలేం. తెలంగాణా ఉద్యమాల్లో మునిగితేలిన వట్టికోట ఆళ్వార్‌స్వామి తన ప్రజలమనిషి గంగులతో ఆ లోటును భర్తీ చేశారు.

దాశరథి రంగాచార్య రాసిన "చిల్లరదేవుళ్ళు" నవల 1937, 1938 నాటి తెలంగాణా గ్రామజీవితాన్ని అతిశయోక్తులతోసహా స్పష్టంగా వర్ణించింది.

"చిల్లరదేవుళ్ళు" నవల భూస్వామ్య వ్యవస్థను సూక్ష్మాతిసూక్ష్మంగా పరిశీలించింది. పాలకులు దైవాంశ సంభూతులనే సిద్ధాంతాన్ని పాలకులేగాక పాలితులుగూడా త్రికరణశుద్ధిగా నమ్మడం చిత్రీకరించబడింది.

యూరప్‌లో మధ్యయుగాలనాడు నగ్ననృత్యం చేసిన అమానుష లక్షణాలన్నీ ఈ నవలలో చూడవచ్చు.

చార్లెస్ డికెన్స్ రాసిన రెండు మహానగరాలు నవలలోనూ "చిల్లరదేవుళ్ళు" నవలలోనూ రాజ్యం చేసింది భూస్వామ్య వ్యవస్థే. అందుచేతనే రెండింటిలోనూ దమనకాండ ఒకే పద్ధతిలో జరగడం మనం చూడవచ్చు. తరతమ భేదాలుండవచ్చుగానీ ఆ వ్యవస్థ తాలూకు దట్టమైన నీడలింకా ఈ దేశాన్ని వదలిపెట్టలేదు. "కంచికచర్ల కోటేశు" హత్యగానీ తంజావూరులో జరిగిన సామూహిక హరిజన సజీవదహనకాండగానీ ఆ విషయాన్ని మనకు గుర్తుచేస్తుంటాయి. మనలోవున్న మానవత్వం సిగ్గుతో కుంచించుకుపోతుంది.

"చిల్లరదేవుళ్ళు"లో ఆడబాప "వనజ" పాత్ర చాలా ముఖ్యమైనది. వనజ పుట్టుక నుంచి బహుశా చచ్చిపోయేవరకు అడుగడుగునా భూస్వామ్య వ్యవస్థ చేసిన గాయాలతోనూ, మచ్చలతోనూ గడిపింది. కొందరు కళా విమర్శకులు కళలూ, సారస్వతం భూస్వామ్య వ్యవస్థలోనే పుష్పించి వికసించినవని చెబుతూ లొట్టలు వేస్తుంటారు. కాని ఆ కళల వైనం, సారస్వతం వెనక జరిగిన మానవతాహత్యను, దమనకాండను గుర్తిస్తే ఆ సారస్వతం మీద జుగుప్స కలుగుతుందేమో!

ఈ నవలలోని దొరకు సంగీతమంటే యిష్టం. కొద్దిగా కళాప్రియుడుకూడా. నిసర్గమైన సంగీతానికి అతడు ముగ్ధుడైనా మనుషులను మాత్రం నిర్జీవ వస్తువులుగా పరిగణించాడు. బహుశా అతనికున్న కళాభిమానాన్ని ఆసరాగా చేసుకునే రచయిత అతనికి స్వచ్ఛంద మరణాన్ని ప్రసాదించాడు.

మరో "చిల్లర దేవుడు" కరణం. ఇతని మరణం లంబాడీల చేతుల్లో సంభవించడం యాదృచ్ఛికంకాదు. లంబాడీలు గ్రామవ్యవస్థకు దగ్గరలోనే వున్న మరో మినీ వ్యవస్థకు చెందినవారు. అందుచేతనే వారికి కక్ష సాధించాలనే భావం, ఆ భావాన్ని ఆచరణలో పెట్టడానికి కావలసిన తెగింపూ వుంటాయి. ఈ సూక్ష్మమైన తేడాని ఆసరాగా చేసుకుని కరణాన్ని లంబాడీల చేతుల్లో "ఖతం" చేయించాడు రచయిత.

"చిల్లరదేవుళ్ళు" నవలలో చిత్రమైనపాత్ర "పాణి"ది. మంజరిని ప్రేమించడం అనే విషయంలో తప్ప మిగతా అన్ని సందర్భాల్లోనూ అతడు ప్రేక్షకుడు మాత్రమే. "పుట్టుమచ్చ వృత్తాంతం" వొచ్చేసరికి జానపద కథల్లోంచి పొరపాటున ఈ నవల్లోకి రాలిపడిన వ్యక్తిగా మారతాడు. మంజరిపాత్ర సరేసరి, చక్కని అభూతకల్పన. మిగతా పాత్రలూ, అంశాలూ సజీవంగా నవలలోకి నడిచివొచ్చినట్లు అనిపిస్తాయి.

నిర్మాణరీత్యా "చిల్లరదేవుళ్ళు" చాలా బలహీనమైన నవల. కాని దాన్లో చిత్రీకరించబడ్డ జీవితం, వాతావరణం మొదలైన అంశాలవల్ల అది ఒక గొప్ప నవలగా నిలిచిపోతుంది.

రచయితకు వాస్తవికతపైన ఎంత అభిమానం వున్నా కాల్పనికతపై మోజుకూడా తక్కువలేదు. "వనజ" పాణిని అన్నయ్యగా అనువదించుకొన్న సందర్భమూ, మంజరి మేల్కొనే పాణిని గురించి కలగన్న సందర్భమూ, పాణి దొరవారికి తేలిగ్గా సంగీతమహిను గురించి ఉపన్యాసమిచ్చిన తీరు - ఇన్నిచోట్లా రచయితకున్న 'అతిచిత్రణ' లక్షణం అనిపిస్తుంది. పుట్టుమచ్చ సహాయంతో పాణి దొరవారి మేనల్లుడై పోవడం బొత్తిగా తెలుగుసినిమా ఫక్కీ. జీవితంలో విషాదముంటుంది. కామెడీ వుంటుంది. డ్రామా వుంటుంది. కరుణ వుంటుంది. కాని మెలో డ్రామా వుండదు. వాస్తవికతకు కట్టుబడినవాడు రోమాంటిసిజాన్ని, మెలోడ్రామానీ నిరోధించాలి. లేకపోతే వాస్తవికత చెట్టెక్కిపోతుంది. ఈ విషయాన్ని చాలామంది అభ్యుదయ రచయితలనుకునేవారు గుర్తించరు. గాజుబిందెల గొడవ, చింతకాయల చోరీ మొదలైన సంఘటనల్లోనేగాక లంబాడీలపై పోలీసుల ఘాతుక చర్యలలాంటి ఘట్టాల్లోకూడా రచయిత సూక్ష్మాతిసూక్ష్మమైన అంశాలను వివరించాడు. మతపరివర్తన, పునఃపరివర్తన మాడపాటి హనుమంతరావుగారితో పాణిగోష్ఠి నవలకు చారిత్రక అధికారాన్ని సంపాదించిపెట్టాయి.

ఈ నవలలో వాడిన భాష తెలంగాణా మాండలికం. మాండలికం వల్లనే ఈ నవలకు ప్రశస్తి ఏర్పడిందనేవారితో మనం ఏకీభవించం.

మరో రచయిత తెలంగాణా మాండలికంలోనే ఒక నవల రాశాడు. దానికి ఇంత ప్రశస్తి రాలేదు. అంటే నవలకు భాష మాత్రమే కాని ఇంకా చాలా విషయాలు అవసరమని బోధపడుతుంది.

పైన చెప్పినట్లు నవలకు వాస్తవికత పట్టుగొమ్మ.

" రహి "

# మెరుపులు

మరుపు - మరచిపోవడం మానవ సహజం - మానవ స్వభావం. మనిషి జీవించడానికి మరుపు అవసరం కూడానేమో! మరుపు లేకుంటే ఒక్కోసారి మానవజీవితం దుర్భరం అయిపోతుంది. అయితే అన్నీ మరిచిపోవడం మనిషికీ, వైయక్తిక జీవితానికి కూడా అంతమంచిది కాదు. వ్యక్తి మరిచేది - మరవగలిగేది గతాన్ని మాత్రమే. అయితే గతం నుంచి గుణపాఠం నేర్చుకోలేని వ్యక్తి ముందడుగు వేయడం కష్టం. చేసిన తప్పుల నుంచి గుణపాఠం నేర్చుకోలేనివాడూ - అవే తప్పులను తిరిగి తిరిగి చేసేవాడూ - సాధారణంగా జీవితంలో విజయం సాధించలేడు.

మరుపు - మరచిపోవడం వ్యక్తికివలెనే సమాజంలో కనిపిస్తూంది. సమాజం సైతం గతాన్ని మరిచి ముందుకుసాగిపోతుందేమో అనిపిస్తుంది. సమాజం నిత్యనూతనం అవుతుంటుంది. అయితే అది గతాన్ని మరచి గతంలోని అనుభవాలను విడిచి ముందుకు దూసుకుపోవడం అసంభవం కాకున్నా అసాధ్యం.

మరుపు-మరచిపోవడం-వ్యక్తులకు, వ్యక్తుల సమాచారానికి చెల్లవచ్చును. కాని సమాజానికి చెల్లదు. సమాజంలో గతాన్ని రికార్డు చేసే చరిత్రకారులూ- కళారూపాన్ని కల్పించే రచయితలూ ఉంటారు. గతాన్ని వచ్చే తరాలవారికోసం దాచి పెడ్తారు.

చరిత్ర - అందునా రాజకీయ చరిత్ర ఏనాడు పక్షపాత రహితం అయింది కాదు. గెలిచినవాళ్ల తమకు అనుకూలంగా మలచుకోవడానికి పనికివచ్చే మైనం ముద్ద రాజకీయ చరిత్ర అనిపిస్తుంది నాకు. చరిత్రను తమకు అనుకూలంగా వాడుకోకుండా వదిలిన విజేతలు మనకు లభించినంతవరకు దొరికే చరిత్రలో మచ్చుకయినా కనిపించరు.

సమకాలీన సామాజిక పరిస్థితులకు ప్రతిస్పందించి, వాటికి కళారూపాలిచ్చి నవలలుగా రచించిన రచయితలు సాధారణంగా, సాధ్యమయినంతవరకు వాస్తవాలను రికార్డు చేయడానికి యత్నిస్తారు.

మనకు సుదీర్ఘం అయిన స్వాతంత్ర్య సమర చరిత్ర ఉన్నది. అది 1857వ సంవత్సరంలో ఆరంభం అయి సుమారు శతాబ్ది కాలం నడిచింది. ఈ పోరాటం ఏ ఒక్క రాజకీయ పార్టీ మాత్రం నిర్వహించింది కాదు. ఇంత సుదీర్ఘం అయినా పోరాట చరిత్ర జరిగినపుడు రచయితలో రావలసినంత ప్రతిస్పందన రాలేదేమో అనిపిస్తుంది. ఎందుకనగా మనకు అన్ని నవలలు కనిపించడం లేదు. అవి మరీ తక్కువగా ఉన్నట్లు కనిపిస్తుంది.

1947కు పూర్వం జరిగిన స్వాతంత్ర్య సమరం సొంతం ఇంగ్లీషు వాళ్ళు పాలించిన బ్రిటిషిండియాలోనే జరిగినట్లు భ్రమ కలిగించే చరిత్ర మనకు లభిస్తూంది. అయితే అనాటికి మన స్వంత ప్రభువులు పాలించిన 500పైగా గల సంస్థానాల్లోని పరిస్థితులు బ్రిటిషిండియాలో కంటే నికృష్టంగా ఉండినాయి. అక్కడ ప్రజా పోరాటాలు జరగలేదని చెప్పలేం. అయితే వాటిని గురించి ఇవ్వాళ మనం

తెలుసుకోలేకపోతున్నాం.

విచిత్రం ఏమంటే ఈ 500 పైగా ఉండిన సంస్థానాల్లో ఒకటి అయిన హైదరాబాద్ సంస్థానంలోని ఒక భాగం అయిన తెలుగువారుండే తెలంగాణా ప్రాంత ప్రజలు జరిపిన వీరోచిత పోరాటం భారతదేశంలోనే కాక ఆనాడు ప్రపంచ ప్రజలను కదిలించింది.

బ్రిటిషిండియాలో జరిగిన పోరాటానికీ, తెలంగాణాలో జరిగిన పోరాటానికీ చాల భేదాలు -తేడాలు కనిపిస్తాయి.

1857 నుంచి స్వాతంత్ర్యం వచ్చే వరకూ జరిగిన పోరాటాలన్నీ భావావేశంతో జరిగినవే. ఇంగ్లీషువాడు మనదేశం విడిచి వెళ్ళిపోవాలి - అది నాటి ప్రధాన ఉద్దేశం. ఆ తరువాత సామాన్యునికి జరిగే ప్రయోజనాన్ని గురించి ఆలోచించడం గానీ, వివరించడం గానీ, చెప్పడం గానీ జరగలేదు. జరిగిన పోరాటాలన్నీ ఆవేదనా భరితాలు తప్ప వాటికి ఆర్థిక కారణాలు లేవు.

ఈ దశాబ్దపు నాలుగవ దశకంలో తెలంగాణాలో పెల్లుబికిన విప్లవ దావానలం ఆవేశాలకూ, ఉద్రేకాలకు లోనయింది మాత్రం కాదు. నైజాం సర్కారోణ్ణి గద్దెదింపడం, గోలకొండ ఖిల్లా కింద గోరీకట్టడం ఈ పోరాటంలోని ప్రధాన ఉద్దేశ్యాల్లో ఒకటి మాత్రం. అది బడా భూస్వాములు, దేశ్‌ముఖులు, దేశపాండ్యాలు, పటేల్ పట్వారీలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం. ఈ పోరాటం ప్రధానంగా భూస్వామ్య వ్యతిరేక పోరాటం. ఇది భూమి కోసం, భుక్తి కోసం జరిగిన పోరాటం. భారతదేశంలో జరిగిన పోరాటాలన్నింటిలో భూమి కోసం, భుక్తికోసం జరిగిన పోరాటం "తెలంగాణా సాయుధ సమరం" మాత్రమేననేది మనకు చరిత్ర చెప్పిన సత్యం. ఇతర పోరాటాల్లో పాల్గొన్న వారికి భావావేశం తప్ప ఎందుకు పోరాడుతున్నది తెలియదు. తెలంగాణ సాయుధ సమరయోధుడు అలాంటివాడుకాదు. ఒకనికి వేల ఎకరాలుండగా లక్షల మంది కట్టుబానిసలుగా, పుట్టుబానిసలుగా బతుకుతున్నారని అతనికి స్పష్టంగా తెలుసు. బడా భూస్వాముల నుండి భూములు లాక్కోవాలి. బానిసలను రైతులను చేయాలి. వారికి పొలాలు ఇవ్వాలి. మన స్వాతంత్ర్య సమర చరిత్రలో ఇంత స్పష్టం అయిన అవగాహన ఉన్న పోరాటం మరొకటి లేదంటే అభిమానంతోగాని, అతిశయోక్తి కోసం గాని చెప్పిన మాట కాదని చరిత్ర తెలిసినవారు గ్రహించగలరు.

రైతులు, కూలీలు, మహిళలు, బాలురు, బాలికలు, 'వడిశెల' నుంచి 'బందూకు' వరకు అందిన ఆయుధాన్ని అందుకొని అపరరుద్రులు అపరరుద్రమ్మలు అయి మూడువేల గ్రామాలను దోపిడీదారుల నుండి విముక్తం చేశారు. పదిలక్షల ఎకరాల భూమిని భూమిలేని పేదలకు పంచారు. "గ్రామరాజ్య కమిటీలు" ఏర్పరచుకున్నారు. గ్రామ స్వరాజ్యాలు నెలకొల్పుకున్నారు.

ఇంతటి విశాల ఉద్యమం, ఇంతటి మహత్తర పోరాటం, ఇంతటి మహోన్నత సమరం మహా మహా మేధావులను కదిలించింది. కళాకారులు కదన రంగంలోకి దూకి కోకొల్లలుగా పాటలు, అనేక నాటకాలు రచియించారు. పాబ్లోనెరోడా ఈ ప్రజా పోరాటానికి స్పందించి పాటలు రాశారని అంటారు. కిషన్ చందర్ ఉర్దూలో " జబ్ ఖేత్ జాగే" అనే గొప్ప నవల రాశారు.

ఈ పోరాటంలో వచ్చినంత సాహిత్యం మరే పోరాటంలో రాలేదని వాస్తవ సత్యం.

పోరాటం జరుగుతున్నపుడు నవలలు రావడం కష్టం. అందువల్ల సామాజిక స్థితిగతులు స్థిరపడిం తర్వాతనే తెలంగాణా సాయుధ పోరాట విషయకంగా నవలలు రావడం ప్రారంభం అయినాయి. వట్టికోట ఆళ్వార్‌స్వామివారు ఆత్మబంధువు, సాహిత్య బంధువు. వారు ప్రజల మనిషి, అనే నెపంతో ప్రారంభించి

యావత్తు పోరాటాన్ని కొన్నినవలలుగా రచించడానికి ఒక ప్రణాళిక సిద్ధం చేసుకున్నాడు. అయితే "గంగు" నవల రాస్తూ అది అసంపూర్ణంగా వదలి, 1961 ఫిబ్రవరి 5న వారు పరమపదించారు. వారు ప్రారంభించిన నవలా రచన ఉద్యమాన్ని ఎవరయినా కొనసాగిస్తారనీ, మహోజ్వలం అయిన పోరాట గాధను భావి తరాల వారికి అందిస్తారనీ ఆశించాను, ఎదురు చూచాను. ఎవరూ ముందుకు వచ్చినట్లు కనిపించలేదు. వచ్చే జాడలు కూడా స్ఫురించలేదు.

అలాంటి తరుణంలో నేను నవలారచనను ఉద్యమంగా కొనసాగించడానికి సంకల్పించుకున్నాను. 1963నుంచి నవలారచనను గురించి అధ్యయనం ప్రారంభించాను. తెలంగాణాలో నేను చూచినవి, విన్నవి, పాల్గొన్న పోరాటాల్ని స్మరణకు తెచ్చుకున్నాను. 13-10-1964న " చిల్లర దేవుళ్లు" రచన ప్రారంభించి 10-11-1964నాడు ముగించాను. నవలలోని అంశాలను గురించి అనేక మందితో చర్చించాను. మాడపాటి వారితో వారి సంభాషణలను హనుమంతరావుగారికి వినిపించి సవరణలు చేశాను. మతాంతీకరణను గురించి ఆర్యసమాజ నాయకులు శ్రీ నరేంద్రజీతో చర్చించి వారు వెలిబుచ్చిన అభిప్రాయాలను, అనుభవాలను చేర్చాను. దేవులపల్లి రామానుజరావు గారికి రాతప్రతి చూపి అందులోని విషయాలకు వారి ఆమోదం పొందాను. అప్పటివరకు నవలకు పేరు పెట్టలేదు. రాతప్రతి చదివి, దానిని ఉత్తమ నవలగా గుర్తించి దానికి భాయ్‌జాన్ నార్ల చిరంజీవి " చిల్లరదేవుళ్లు" అని నామకరణం చేశారు. ఈ నవల "ప్రగతి" వారపత్రికలో 21-3-1969 నుంచి 13-12-1969 వరకు సీరియల్‌గా ప్రకటించినప్పుడే పాఠకులు " చిల్లరదేవుళ్ళు " విషయంలో అనంతరం అయిన ఆదరాభిమానాలు ప్రదర్శించారు. ఎమెస్కోవారు తమ పాకెట్ బుక్స్‌లో దీన్ని డిసెంబర్ 1969లో ప్రచురించారు. 1971లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు " చిల్లరదేవుళ్లు"కు బహుమానం ప్రకటించారు. ఆకాశవాణి హైదరాబాదు వారు 1971లో " చిల్లరదేవుళ్లు" రేడియో నాటకం ప్రసారం చేశారు. మిత్రులు భీమ్‌సేన్ నిర్మల్ "చిల్లర దేవుళ్లు" హిందీలో అనువదించగా "లోక్‌రాజ్" హిందీ పక్షపత్రిక "ఘాట్ కే దేవతా"ను ధారావాహికంగా ప్రచురించింది. 1974లో "చిల్లర దేవుళ్లు"ను కాకతీయ పిక్చర్స్ వారు చలన చిత్రంగా నిర్మించారు. ఆకాశవాణి హైదరాబాదు వారు నవలా స్రవంతి కార్యక్రమంలో చిల్లర దేవుళ్లను ధారావాహికంగా ప్రసారం చేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలోనూ, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలోనూ "చిల్లర దేవుళ్లు" M.phil కోసం అధ్యయనం చేయడం జరిగింది.

కాకతీయ విశ్వవిద్యాలయం వారు "చిల్లర దేవుళ్లు" M.Aలో అధ్యయనం కోసం నియమించారు.

"చిల్లరదేవుళ్లు" నవలలో 1938కి పూర్వపు తెలంగాణ ప్రజాజీవితాన్ని చిత్రించడానికి ప్రయత్నించాను. ఆ కాలాన్ని ఎన్నుకోవడానికి కారణం అప్పటికి హైదరాబాద్ సంస్థానంలో రాజకీయ పార్టీ లేదు. 1923 నుంచి 1928 వరకు హైదరాబాద్ రాజకీయ సభలు కాకినాడ, బొంబాయి, పూనా, అకోలాలో జరిగాయి. 1938లో తొలిసారిగా తాత్కాలిక స్టేట్ కాంగ్రెస్ స్థాపించడానికి ప్రయత్నం జరిగింది. సమావేశపు తేదీకి ఒక రోజు ముందుగానే నైజాం నవాబు దస్తూరుల్ అమల్ తహాఫుజ్ అమన్‌వ ఆమాన్ పేర ఒక ఫర్మానా జారీ చేసి, ఏర్పడనున్న స్టేట్ కాంగ్రెస్‌ను నిషేధించాడు.

ఆ తరువాత ప్రజా జీవన చిత్రణ "మోదుగుపూలు" నవలలో చేశాను. మోదుగుపూలు నవలా కధ సుమారు 1942-1948 కాలం, పత్రిక తెచ్చినందుకు దెబ్బలు కొట్టిన దౌర్జన్యంతో మొదలవుతుంది. నవల ప్రజలు తుపాకులు అందుకొని ప్రభుత్వాన్ని కూలదోయడంతో అంతం అవుతుంది. ఆకాశవాణి హైదరాబాదు వారు "మోదుగుపూలు" రేడియో నాటకాన్ని తొలిసారి 19-7-84న ప్రసారం చేశారు.

ఆకాశవాణి మద్రాసు కేంద్రం కూడా దీనిని పునఃప్రసరం చేసింది. ఒక చలనచిత్ర సంస్థ వారు "మోదుగుపూలు" హక్కులు తీసుకున్నారు. "మోదుగుపూలు" చలనచిత్రంగా వచ్చే అవకాశం లేకపోలేదు.

"జనపదం" నవలలో పోలీసు చర్యనుంచి రెండు దశాబ్దాల సుదీర్ఘ చరిత్రను చిత్రీకరించడానికి ప్రయత్నించాను. "జనపదం" తొలి ముద్రణ ఒక దశాబ్దం క్రితం 1976లోజరిగింది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి డాక్టర్ ప్రేమావతి గారు "జనపదం" మీద థీసిస్ సమర్పించి 1985వ సంవత్సరంలో డాక్టరేట్ పొందారు.

"రానున్నది ఏది నిజం" అనే నవలలో భారతదేశ భవిష్యత్తును గురించి మనం కంటున్న కలలను చిత్రించాను. సోషలిజం వచ్చిన భారతదేశాన్ని గురించి మన ఆశలను ఆశయాలను చిత్రించాను.

ఈవిధంగా నవలా రచనను నేను ఒక ఉద్యమంగా నిర్వహించాను. తెలుగు ప్రజలు నా ఉద్యమాన్ని హర్షించారు. ప్రోత్సహించారు. ఆమోదించారు. ఆశీర్వదించారు.

ఇవికాక "మాయ జలతారు" "మానవత" "శరతల్పం" "పావని" అనే నవలలు కూడా రాశాను.

ఇది " చిల్లరదేవుళ్లు" అయిదవ ముద్రణకు మెరుపు. " చిల్లర దేవుళ్లు" రెండు, మూడు, నాలుగు, ముద్రణలను దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారు ప్రచురించారు.

అయిదవ ముద్రణ విశాలాంధ్ర ప్రచురణాలయం వారు ప్రచురిస్తున్నారు. ఆంధ్ర ప్రజానీకం ముఖ్యంగా యువత మన గత చరిత్రను అర్థం చేసుకోవడానికి నా నవలలు ఉపకరిస్తాయని ఆశిస్తున్న,

సికింద్రాబాదు — మీ

27-12-86 — **దాశరథి రంగాచార్య**

# చిల్లర దేవుళ్లు

గడీ[1] గేట్లో అడుగుపెట్టిన సారంగపాణికి బంకుల్లో[2] బల్లపీట మీద కూర్చున్న రామారెడ్డిగారు కనిపించారు. బట్టతల, కోలముఖం, పెద్ద కళ్లు, పొడవైన ముక్కు, చూడ్డానికి నలభై లోపలివారుగా కనిపించినా, దబ్బపండు లాంటి ఛాయగల ఆయనకి వాస్తవంగా యాభై దాటేయి. శరీరం దృఢమైంది కావడం మూలాన ఒక పదేళ్లు తక్కువగా కనిపిస్తారు. ఆయనే ఆ గ్రామ ప్రభువు - దేశ్‌ముఖ్.

రెడ్డిగారు కూర్చున్న బల్లపీట కెదురుగా మరో బల్లపీటుంది. దానిమీద కూర్చుని ఉన్నారు నలుగురు - గ్రామ ముఖ్యులు.

సారంగపాణి వయొలిన్ కేసుతో మెట్లదగ్గరికి వెళ్ళి నమస్కరించాడు రెడ్డి గారికి. గమనించలేదు రెడ్డిగారు. నించున్నా డక్కడే వాళ్ళ సంభాషణ వింటూ.

"వాండ్లే దరఖాస్తు లిచ్చి(న)టట కాదుండి?" నారయ్య ప్రశ్నించాడు

"నాటక మాడ్తున్నరుగానీ మాల మాదుగులకు దరఖాస్తులియ్యొస్తే ఊళ్ల మేమెందుకు? గడ్డపు తురుకోడు ఊళ్ళకొచ్చినాడే అనుకున్న ఊరికి శనిపట్టిందని. వాడే అంగుష్ట్‌నిషా[3]న్లేయించుకు పోయుంటడు." వివరించాడు కరణం వెంకట్రావు రెడ్డిగారివైపు చూస్తూ ఆయన వ్యాఖ్యానం ఆశిస్తున్నట్లుగా.

"మాదిగ మాల లం-కొడుకులు తురకల్ల కలుస్తే నిలుస్తారు భూమ్మీద! ఇగ బేగారేం[4] చేస్తరు? రాజ్యాలేల్తరేమో రాజ్యాలు!" అని తుపుక్కున ఊశాడు రెడ్డిగారు.

"సర్కార్ వాండ్లది. మున్సఫ్‌సబ్, ఆమీన్‌సాబ్ తాసిల్దార్ వస్తున్నరట వాండ్లకు ఖిలాఫ్[5] చెప్తుతే ప్రజల్బేతులుంటారా?" సందేహం వ్యక్తపరచాడు కరణం వెంకట్రావు.

నారయ్య యేదో చెప్పబోయి కరణం వైపూ, రెడ్డిగారి వైపూ చూచి మాట మింగేశాడు.

"హు - వీండ్లెమో తురకల్ల కలుస్తరు. వాండ్లేమో తురకల్ల కలుపుతరు. ఇంతేజాము[6] లేమొ మనం చెయ్యాలే! మన ముందర్నే జుట్లు మొల్తాళ్ళు కోస్తరేమో!" నిస్సహాయత వెలిబుచ్చాడు రెడ్డిగారు.

"పట్నం నుంచి కూడా ఎవరో వస్తా(న)టట కాదుం(డి)?" ప్రశ్నించాడు నారయ్య.

"బహద్దూర్ యార్‌జంగ్, వాడే ఇత్తేహాదు ల్ముసల్మీన్ శురు[7] చేసింది. ఈ తురకల్ల కలపటం కూడా వాని పనే. శానమందిని తురకల్ల కలిపినందుకు ఖితాబిచ్చిండట హుజూర్ బహద్దూర్ ఖా పొయ్యి బహద్దుర్ యార్ జంగయ్యిండు." కరణం తన సర్వజ్ఞతను వెల్లడించాడు.

"అయితే ఇంతజాములు మెడకు పడ్డట్లే నంటవు." బహద్దుర్ యార్ జంగ్ పేరు విని లొంగారు రెడ్డిగారు.

"వారు ప్రభువులు, మనం ప్రజలం, ఇసం తినమన్నా తినాలే" నారయ్య అన్నాడు.

మౌనమే రాజ్యం చేసింది కొన్ని క్షణాలు.

సారంగపాణి మెట్లెక్కాడు. స్తంభం దగ్గర నుంచొని మళ్ళీ నమస్కరించాడు. రెడ్డిగారు గమనించలేదు. మిగతావారు చూచి చూడనట్లు ఊరుకున్నారు. వయొలిన్ కేసు క్రింద పెట్టి, కండువా సర్దుకొని, స్తంభానికి అనుకొని నుంచున్నాడు పాణి, రెడ్డిగారు తనవైపు చూచినప్పుడు వారి దృష్టిలో పడాలనే సంకల్పంతో, రెండుసార్లు వినయమంతా ముఖంలో కేంద్రీకరింపజేసి నమస్కరించాడు. చూచినా చూడనట్లు నటించారు రెడ్డిగారు.

"చింతల్తోపుల దింపుదమా?" మౌనాన్ని భంగం చేస్తూ ప్రశ్నించాడు కరణం రెడ్డిగారి ముఖంలోని ఉద్రేకం తగ్గిపోవడాన్ని గమనించి.

"అట్లనే బాగుంటది. ఊళ్ళ కెందుకింక? ఊరిబైటనుంచి వెళ్ళగొడ్తేసరి" అన్నారు రెడ్డిగారు ఆమోదం వ్యక్తం చేస్తూ.

మాల మాదుగుల్ను ఎట్టి పట్టొద్ద ... "కోమటి కిష్టయ్య మాట పూర్తికాకుండానే ఉరిమారు రెడ్డిగారు.

"హు - ఎట్టి పట్టొద్దు ఎట్టి. నెత్తి కెక్కించుకుంటం. ఎట్టి కొటురి లం- కొడుకుల్ను. ఊళ్లుంటరో ఊరిడిచి పోతరో చూస్త. తురకల్ల కలుస్తరట తురకల్ల!" రెడ్డిగారి కళ్ళెర్రపడ్డాయి.

"ఎట్టి కొట్టకుంటే ఎళ్ళుతాడుండి?" వంత పాడాడు కోమటి ఎంకయ్య.

"పందిళ్ళేయించొద్దు మరి?" అడగ్గూడదనుకుంటూనే అడిగాడు కరణం.

"బండ్లు ఎట్టిపట్టి మాదిగోండ్లం తోళురి అడవికి, వాసం తెప్పిచ్చురి. గౌండ్లోండ్లను తాటాకు కొట్టియ్యమనురి. సుత్లిగిట్ట[10] కోమటోండ్లకు కట్టురి" అని కోమట్ల వైపు చూచారు, రెడ్డిగారు.

"ఇస్తంలేరి" అన్నారిద్దరూ, ఒకరు మొఖాలు ఒకరు చూచుకొని ఇది తప్పేది కాదన్నట్టుగా.

అడగాల్సిన వాటిని గురించి కరణం ఆలోచించసాగడంతో మౌనం వెలిసింది కొన్ని క్షణాలు.

పాణి అలసి ఉన్నాడు. ఆదరణ కోసం తపిస్తున్నాడు. మరొకసారి నమస్కరించాడు. రెడ్డిగారు చూడలేదు. ఒక్కింత చిరాకుపడ్డాడు పాణి. ఇన్నిసార్లు నమస్కరించినా గమనించడేం రెడ్డి? దుఃఖంతో, ఆవేశంతో గొంతు పూడుకొనిపోయింది. ఎంతో దూరం నుంచి వచ్చిన శ్రమ వృధా అవుతుందా? ఈ రెడ్డికి ఇంత గర్వమేం? వయొలిన్ కూడా పట్టుకొని సాక్షాత్తు సంగీతరూపంలో తాను అవతరిస్తే కనీసం పలుకరించడే! తనను చూచికాకున్నా ఫిడేల్ను చూచి పలుకరించవచ్చునే! అంతకంటే అవమానం ఏం జరగాలి? మెట్లు దిగి వెళ్ళిపోదామనుకున్నాడు. అందువల్ల ప్రయోజనం లేదనుకున్నాడు. వాస్తవంగానే తనను చూడలేదేమో! కావచ్చు. గంభీరమైన విషయాలు మాట్లాడ్తున్నారు. రామారెడ్డి రసికుడనీ ఉదారుడనీ కదా తాను వచ్చింది? ఓపిక పట్టడం మంచిదనుకున్నాడు. కండువాతో ముఖం తుడుచుకొని, చేతులు కట్టుకొని నుంచున్నాడు.

"స్టేషనుకు బండ్లు పంపాలే ఊళ్ళున్న బండ్లన్నీ ఎట్టి పట్టాలే బస్తీగ్గిట్ట పోకుండ చూడుండి." ఆదేశించారు రెడ్డిగారు.

"అట్లనే" అన్నాడు కరణం పరధ్యానంగానే.

"గొల్లోండ్లను పట్టి గొర్లు తెప్పించాలే. ఎన్ని కావాల్నో? ఎంత మందొస్తరో?" లెక్క వేసుకోసాగారు రెడ్డిగారు.

"అన్నట్లు యాదమరచిన[11], ఆవును తెప్పించాల్నట కొయ్యటాన్కి" అమాంతంగా స్ఫురించినట్లనేశాడు కరణం.

"హు ఆవును సుత[12] మనతోనే తెప్పిస్తడ్రులే చూడబోతే మనతోనే కోపిచ్చేటట్లున్నరు." ఉద్రేకంలో గొంతుపూడింది. క్షణం తరువాత "నిజామొద్దీనుకు కట్టండి ఎట్లన్న ఏడుస్తడు" అన్నారు.

"మంచిమాట చెప్పి(ను దొరవారు." కోమటి ఎంకయ్య నవ్వి "ఎవని చేతులు వాని నెత్తిమీదనే పెట్టాలే" అన్నాడు.

రెడ్డిగారు పొంగిపోయారు. మీసం సైతం మెలేశారు.

కరణం చిన్నబుచ్చుకుని "అయితే వస్తమరి" అని లేచాడు. అతనితో మిగతావారు లేచారు.

"అచ్చా! జ(ర[13] ఇంతే జాములు మంచిగ చూడు(ని, పొద్దస్తే ఆ కొడుకుల్తోనే పనిబడ్తది" అంటూ లేచారు రెడ్డిగారు.

"సరే" అన్నాడు కరణం ఆ పురమాయింపు నచ్చనట్లు.

అందరూ నమస్కరించారు.

సాగనంపడానికి రెండు మెట్లు దిగారు రెడ్డిగారు. సాణి పక్కనుంచే వెళ్ళారాయన. ఆయన సారంగపాణి నమస్కారాన్ని గమనించనూ లేదు, ప్రతినమస్కారం చేయనూ లేదు. గేటు దగ్గర రెండు చేతులు కట్టుకొని నుంచున్న మనిషి కనిపించాడు రెడ్డిగారికి: తలగుడ్డ, మోకాలి వరకు పంచె, వంటిమీద గుడ్డలేదు. నల్లని ముడతలు పడిన శరీరం. ఎంతో సేపట్నుంచి రెడ్డికోసం ఎదురుచూస్తున్నట్లు అతని కండ్లు చెపుతున్నాయి. రెడ్డిగారిని చూచి వంగి, రెండు చేతులూ నేల కంటించి, ముఖానికి తాకించుకొని నమస్కరించాడతను. రెడ్డిగారు నమస్కారం చేయలేదు కాని-

"ఏ(మ పుల్లిగ ఏడ్కో వచ్చినవు?" అని అడిగారు.

"నీ కాల్మొక్త బాంచెను[14] ! బిడ్డకు లగ్గం కుదిరిందుండి"

"ఏం చెయ్యమంటవ్?"

"రెండు కుండల గింజలు, ఇరవై రూపాయలిస్తే మాట దక్కుతదుండి." నసిగాడు.

"పోయినేడాది పెండ్లన్నవు. గింజల్తీస్కపోయినవు. తాగినవు. మీ కులమే అట్లరా. ఒక్క గింజ ఇయ్యన్పో. తురకల్ల కలుస్తరేమో కదరా, పోయి వాండ్లనే అడుక్కో(ని."

"అట్లంటే మే మెట్ల బతుకతముండి? పోయి నేడాది లగ్గానికిచ్చిన గింజలు లచ్చి చావుకైనయిండి. తాగి చచ్చినాముండి, నీ గులాపోణ్ణి[15]." కండ్లు చెమ్మగిల్లాయి. చేతుల్తో కండ్లు తుడుచుకొని "మేం కలుస్తమన్నాము(ని? గడ్డపు తురుకోడొచ్చిండు, బావుల్తవ్విస్తనన్నడు. భూములిప్పిస్తనన్నడు. ఆశకాదుండి నీ కాల్మొక్త, తురకోల్లమైతేం, మాదిగోల్లమైతేం, మీ కాళ్ళకాడ పడుండేటోండ్లమే కాదుండి?" అన్నాడు మరొక సారి వంగి దండంపెట్టి.

"చావన్న, పేండ్లన్న తాగుడే కాదుర మీకు. అప్పుడది చచ్చిందని తాగి(ను, ఇప్పుడు దీని లగ్గమని తాగుతరు. ఏమైన తగలబడు(ని, గింజలు కొలిపిస్త పైకాని కెల్లుండి రా!'

"నీ బాంచను దరమ దొరలు" అని, నేలకు చేతులానించి మొక్కాడు మూడుసార్లు.

"ఎంకటిగా! పుల్లిగానికి రెండు కుండల గింజలు కొల్వు" అని కేకవేసి వాడు విన్నదీ లేనిదీకూడా గమనించక వెనక్కు తిరిగి మెట్లెక్కారు రెడ్డిగారు.

స్తంభం దగ్గరికి రాగానే దండం పెట్టాడు పాణి.

బల్లమీద కూర్చుంటూ అడిగారు రెడ్డిగారు "ఎవరు నువ్వు" అని.

"నా పేరు సారంగపాణండీ"

"సారంగపాణి. యాణ్ణో ఇన్ననేపేరు ....."

" సంగీతం -"

"వెంకటేశ్వర్ల జాతర్లో పాటకచేరి చేసినవులే"

"చిత్తం."

"బాగానే పాడినవు."

"నే" అనేది విని పాణి మనసు చివుక్కుమంది. కాని, ఆ భావం ముఖంలో వ్యక్తం కానివ్వకుండా " ఏదో మీ దయ" అన్నాడు.

" ఏమేమి వాయిస్తవు?"

"వీణ, మృదంగం, డోలు, ఫిడేలు."

"నీ తాన[16] ఏమున్నదిప్పుడు?"

"ఫిడేలుందండీ."

"ఒక్క పాట పాడు" పరీక్షించడానికా అన్నట్లు అడిగారు.

పాణి గుండెలో రాయి పడింది. ఎంత దూరం నుంచి వస్తున్నావు ? అలసి ఉన్నావా? తిండి ఉందా? లేదా? అని అడక్క అమాంతంగా పాట పాడమంటున్నాడు అనుకున్నాడు. కాని ఏం చేస్తాడు? వచ్చింది ఆశ్రయించడానికి. వయొలిన్ పెట్టె తీసుకొని ఎదురుగా ఉన్న బల్లమీద కూర్చున్నాడు. పెట్టె విప్పి ఫిడేలు తీశాడు. ఈలోగా లోపల్నుంచి ఒక దాసీది గుండిచెంబుతో నీళ్ళూ సబ్బూ తువ్వాలూ తెచ్చి అక్కడ పెట్టి వెళ్ళిపోయింది.

రెప్ప వేయకుండా చూశాడు దాసీదాన్ని.

"మొఖం కడుక్కో పంతులూ!" రెడ్డిగారి మాట విని భూలోకంలో పడ్డాడు పాణి. కండువా తీసి బల్లమీద పెట్టి, లాల్చీ మోచేతులవరకు జరిపి అరుగు చివర్న కూర్చొని ముఖం కడుక్కొని చూస్తే ఆశాలత నిరాశా తాపానికి వాడిపోయింది. పాట పాడమని మళ్ళీ లోపలికి వెళ్ళాడు ముసలాడు అని విసుక్కున్నాడు. కాళ్ళు తుడుచుకొని బల్లమీద కూర్చునేవరకు వెండి పళ్ళెంలో ఫలహారం తెచ్చి బల్లమీద పెట్టి, దాని పక్కనే మంచినీళ్ళ వెండి గ్లాసుంచి మెరుపులా మాయమైంది దాసి.

ఫలహారం ముగించి నీళ్ళు తాగడం కాగానే పాలగ్లాసు బల్లమీద పెట్టి ఖాళీ పళ్ళెమూ, గ్లాసూ తీసుకొని వెళ్ళిపోయింది. పాల గ్లాసు కూడా తీసికెళ్ళడానికి వస్తుందని నిరీక్షిస్తూ కూర్చున్నాడు పాణి.

తువ్వాలుతో మూతి తుడుచుకుంటూ రెడ్డిగారు ప్రవేశించి "పాట శురుచేయి" అని ఆదేశించారు. అక్కడే ఉన్న పాలగ్లాసు చూచి " అరె ఎంకటిగా, ఎంగిలిగ్లాసు తీస్కపో " అని అరిచారు.

సారంగపాణి గాలిమేడ కూలిపోయింది. ఫిడేలు తీసి శ్రుతి పెట్టసాగాడు. తాంబూలపు తప్తరీ[17] తెచ్చి ముందుంచి మాయమైంది దాసీది.

పాట ప్రారంభించాడు పాణి-

బాల! కనకమయచేల! సుజన పరిపాల!

శ్రీరమాలోల! విధృత శరజాల!

శుభద! కరుణాలవాల! ఘనలీల!

నవ్యవనమాలికా భరణ!

ఏలా నీ దయ రాదురా!

పరాకు చేసేవేల! సమయముకాదురా! ॥బాల॥
రారా దేవాది దేవ! రారా మహానుభావ!
రారా రాజీవ నేత్ర! రఘువరపుత్రా!
సారతర సుధాపూర! దనుజసంహార దశరథ కుమార !
బుధజన విహార సకల శ్రుతి సార !
ఏలా నాపై దయరాదుర॥

చేతులు వెనక్కు బల్లపై ఉంచి, తల పైకెత్తి, తన్మయుడై విన్నాడు రెడ్డిగారు. కోకిల పాడుతుందా? గండు తుమ్మెదలు గానం చేస్తున్నాయా? అన్నట్లుగా పాడాడు పాణి. గాయకునికి అంత దగ్గరగా ఉండి గానం విన్నది అదే మొదటిసారి రెడ్డిగారి జీవితంలో. హృదయాన్ని సంగీతం ఎలా కరిగించి ప్రవహింప చేస్తుందో తెలుసుకున్నదీ అనాడే రెడ్డిగారు. పాట నిలిచిపోతే అమాంతంగా గంధర్వలోకం నుంచి పడిపోయినట్లయింది రెడ్డిగారికి.

"బాగా పాడినవు పంతులూ" అన్నాడు బల్లకానించి వుంచిన చేతులు తీసి దులుపుకుంటూ రెడ్డిగారు, "ఎంకా!" అని పిలిచారు. ఎంకడు రాగా " పంతుల్ను బంగ్లమీద ముందరి అర్రల[18] దించు. భోజనం గిట్ట అడనే ఇంతజామ్ చెయ్యి" అని పురమాయించి పాణివైపు తిరిగి " పంతులూ జర పాలంకాడికి పొయ్యొస్త" అని జవాబుకై నిరీక్షించకుండానే లేచి నుంచున్నారు రెడ్డిగారు. పాణి ఫిడేలు బల్లమీద పెట్టి లేచి నుంచొని "చిత్తం" అన్నాడు. మెట్లు దిగి వెళ్ళిపోయారు రెడ్డిగారు.

"పదుండ్రి అర్రలకి" అని ఫిడేలు పెట్టె పట్టుకొని ముందుకు నడిచాడు ఎంకటి. బైటినుండి ఉన్న మెట్లెక్కి గదిలో ప్రవేశించాడు పాణి. అది పెద్ద గది. రెండు పెద్ద పెద్ద కిటికీ లున్నాయి. బజారు వైపు కిటికీలోంచి చూస్తే ఊరంతా స్పష్టంగా కనిపిస్తుంది. గదిలో ఒక పెద్ద మంచం, కావిడి పెట్టె, రెండు కుర్చీలూ ఉన్నాయి.

ఎంకటి వయొలిన్ కేసు కావిడి పెట్టెమీద పెట్టి, "ఎంత మంచిగ పాడిన వుండి, దొరసాన్లు గూడ మెచ్చుకున్నరు" అన్నాడు.

"ఏ దొరసాన్లు?"

"ఏ దొరసాన్లేదుండి? ఇద్దరట్లనే మెచ్చుకున్నరు" అని కాస్త ధ్వనితగ్గించి " చిందొరసాని కరిగిపోయిందనుకోరి" అన్నాడు.

"చిన్నదొరసాని అంటే!"

"ఆమెనుండి, దొరోరి బిడ్డ, మల్ల పాడ్తావ్రని" అడిగాడు ఔత్సుక్యంతో.

"ఎందుకు పాడనూ?"

"నువ్వు ఈడనే వుండి పొండ్రి, పాడుకుంట-"

"సరేలే" అని చొక్కా విప్పి చిలక్కొయ్యకు తగిలించాడు. పాణి.

"ఏదన్న కావలిస్తే పిలువ్రని, నీ బాంచను" అని వెళ్ళిపోయాడు ఎంకటి.

× × ×

కళ్ళు మూసుకొని ఏదో ఆలోచిస్తూ మంచం మీద పడుకొని ఉన్న పాణి కావిడి పెట్టె మీద పళ్ళెం చప్పుడు విని కళ్ళు తెరిచి చూచాడు. దాసీది భోజనపు పళ్ళెం కావిడి పెట్టెమీద పెట్టి వెళ్ళిపోతూంది. దిగ్గున లేచి కూర్చొని 'ఇదిగో' అని పిలిచాడు.

గడప కవతల పడిన అడుగు వెనక్కి వేసి ముఖం తిప్పి, " ఏమిటి"? అన్నట్లు చూసింది దాసీది

'నీ పేరు?'

'వనజ'

'వనజ ...' చక్కని పేరన్నట్లు ఉచ్చరించాడు పాణి.

వనజ వెళ్ళిపోయింది. ఆమె కానాడు ఏదో నూత్నానుభూతి కలిగింది. దాన్ని ఆనందం అనలేం గాని అల్లాంటిదే ఏదో అనుభవించిందామె.

"వనజ" తన పేరు బావుందా? చక్కగా ఉందా? నిజంగానా? "వనజ" పలికి చూచుకుంది. మూడక్షరాలు. వాస్తవంగానే తన పేరు బావుంది. ఇంతవరకెవరూ అనలేదు, తనపేరు బావుందని, తన పేరులోని రమ్యతను తల్చుకొని తానే మురిసిపోయింది.

తాను పుట్టిందీ, పెరిగిందీ ఈ గడీ[19] లోనే. ఇక్కడే చాకిరీ చేస్తూందీ పశువులా. తిండి పెడ్తాడు దొర. తిండి పెట్టి పశువులా చాకిరీ చేయించుకున్నా బాగుండేది. తాను వారికి విలాస వస్తువు, దొరలెవరైనా గడీకి వస్తే వారి గదుల్లోకి భోజనాలూ, ఫలహారాలూ, మోసుకెళ్ళాలి. అవి అక్కడ పెట్టి వస్తే సరిపోతుందా? వారి కోర్కెలకు తాను లొంగిపోవాలి. వారు పశువుల్లా ప్రవర్తిస్తూంటే తాను బొమ్మలా వుండాల్సిందే కాని కిమ్మనడానికి వీల్లేదు. ఇదీ తన బ్రతుకు. ఈ కుళ్ళు నుంచి దూరం కావడానికి గడీ వదిలి పారిపోదామనుకుంది చాలాసార్లు. కాని, తాను ఆడబాప[20] ఎక్కడున్నా పట్టితెప్పిస్తాడు దొర. కాకున్నా ఎక్కడికి పారిపోతుంది? ఏం చేస్తుంది? ఆడబాపగా బ్రతికిందాని కెవ్వడైనా అండ చూపుతాడా? వేశ్యగా జీవించాలి.

ఆవిడకు మొదటి రాత్రి గుర్తుకు వచ్చింది.

ఆరోజు ఇంద్రారెడ్డి వచ్చారు-ఇందిరమ్మ దొరసానికి తమ్ముడు. అడవికి వేటకు వెళ్ళి మనుబోతును కొట్టి తెచ్చాడు. గుర్రంలా ఉందది. జీతగాండ్లు దాన్ని కోసి కుప్పలేశారు. ఊళ్ళో పెద్ద మనుషులందరికి గడీ నుంచి మాంసం పోయింది. గడీలో గుమ్మని వాసనకొట్టే మసాలాలతో రకరకాల కూరలు వండారు. తలంటిపోసింది తల్లి తనకు. పాలపిట్ట చీర కట్టించింది దొరసాని. కడుపునిండా తిండి పెట్టింది దొరసాని. తనదగ్గరకూర్చొని, ఆ రాత్రి ఎంత తాగారని దొరలు ! ఒకళ్ళమీద ఒకళ్ళు పడ్డారు. తనకు ఫలహారాల పళ్లెం యిచ్చి పంపింది దొరసాని. తనకళ్ళు చెమ్మగిల్లడం గమనించింది తాను. గుండెలో గుబులు నిండింది. అడుగు ముందుకు పడలేదు. దొరసాని గద్దించింది. తనకు కన్నీళ్ళు దుమికాయి. అడుగు ముందుకు పడింది. ఇప్పుడు పాణి ఉన్న గదిలోనే ఇంద్రారెడ్డి దిగింది. ఫలహారాల పళ్ళెంతో గదిలో ప్రవేశించింది తాను. ఎందుకో గుండె వేగంగా కొట్టుకుంది. తనను చూడగానే లేచి " రావే వయ్యారి" అని చేయిపట్టి లాగాడు. పళ్ళెం జారవిడిచి, కేకవేసి పరుగెత్తింది తాను. తల్లిమీదపడి పెద్దగా ఏడ్చింది. తల్లికూడ కన్నీరు రాల్చింది. ఆమె మాత్రం ఏం చేస్తుంది? దొరసాని గద్దించింది.

మరొక దాసి తనను పట్టుకొనిపోయి గదిలోవేసి తలుపేసింది.

ఆ దృశ్యం తల్చుకుంటే, ఆమె కళ్ళు జల్లుమంది. నాటినుంచి గడీకి వచ్చిన దొరల్లో చాలామంది తనను కోరుకున్నారు. వచ్చిన ప్రతివాడూ తననే చూసేవాడు: కళ్ళు చీల్చుకొని అలా చూచినప్పుడల్లా పిడుగు పడేది తనమీద. అయినా, యంత్రవతుగా వ్యవహరించాలి తాను. ఇందరూ తనను అత్తరులా, పన్నీరులా, సారాయిలా వాడుకున్నారే కాని, ఒక్కరైనా మనసుకు యింత హాయినిచ్చే మాట అన్నారా? "వనజ ..." ఆ మాటలు తల్చుకుంటే ఆవిడ వళ్ళు పులకరించింది. మాటలు మనసుకు ఎంత హాయినిస్తాయి!

'ఎంత మంచివాడు!' అనుకుంది. గడీలో యంత్రంలా, పశువులా, ఆటబొమ్మలా జీవిస్తున్న ఆమెకు సారంగపాణి పలుకులు ఎంతో ఆప్యాయత నిచ్చాయి. ఏదో తెలియని ఆనందం మైకంలా కమ్మింది.

గడీలో ఉంటున్నాడని పేరేగాని మూడు రోజుల్నుంచి రెడ్డిగారి దర్శనం కాలేదు పాణికి. పొద్దు గడవడం కష్టంగా ఉంటే అలా చింతలతోపుకు వెళ్ళాడు. హడావిడిగా ఉంది. పెళ్ళికి జరిగేటంతటి ఏర్పాట్లు జరుగుతున్నాయి. కొందరు గుంతలు తవ్వుతున్నారు. కొందరు గుంజలు పాతున్నారు. కొందరు బండ్లమీద నుంచి వాసాలూ, కొందరు తాటాకూ దింపుతున్నారు. కొందరు ఒకపక్క పందిళ్ళకు తాటాకు వేసి కుడుతున్నారు. మంచాలు, కుర్చీలు చిందరవందరగా పడి ఉన్నాయి. ఒక చింతక్రింద మంచం మీద కూర్చొని అజమాయిషీ చేస్తున్నారు రెడ్డిగారు. కరణం వెంకట్రావు హడావుడిగా వచ్చి "మంచాలియ్యమంటున్రట ఊళ్ళోళ్ళు. చాకలోళ్ళు ఊరికేనే తిరిగొచ్చిన్రు" అని షికాయతు[21] చేశాడు తాను పంపుతే ఇవ్వనందుకు తగిన శాస్తి జరిపించాలనే ఉద్దేశంతో "మస్కూరోళ్ళ[22]ను తోలి ఇండ్లలోంచి గుంజుకురమనున్రి. ఇయ్యకుంటే ఇండ్లల్ల మాల మాదుగుల్ను జొర పెడ్తమని చెప్పమనున్రి" అని ఆదేశించారు రెడ్డిగారు. కరణం అదేమాట చెప్పి తలార్లను పంపించాడు.

రెడ్డిగారు ఉద్రేకంలో ఉన్నారు. దర్శనం చేసుకోవాలా, వద్దా? అని వెనకా ముందాడుతున్న పాణిని చూశారు రెడ్డిగారు. వంకరకర్ర ఊతమీదలేచి "జర గడీదాకా పొయ్యొస్త" అని కరణంతో చెప్పి బైల్దేరాడు రెడ్డిగారు. పాణి దగ్గరికి వచ్చి "రా పంతులూ!" అని సాగిపోయారు. పాణి ఏదో విన్నవించుకోవాలని మధనపడసాగాడు. ఎలా ప్రారంభించాలో అర్థం కాక తికమక పడ్తుండగా "దొరా! దండం పెడ్త" అన్న మాటలు వినిపిస్తే దొర అటు చూచాడు. ఒక వ్యక్తి తలగుడ్డ తీసి మోకాళ్ళు వంచి నమస్కరించాడు రెడ్డిగారికి.

"ఏమ్రా మల్లిగా! ఏటో వచ్చినావూ?" అడిగారు రెడ్డిగారు.

"నీకాడికే వచ్చిందొరా! గడీలకి పోతే చింతల్తోపులున్నడు దొర అని చెప్పిండు ఎంకటయ్య, అణ్ణించి నీకాడికే వస్తాన్న బాంచెను."

'ఏంది కత?" తీవిగా అడిగారు సాగిపోతూ.

రెడ్డిగారి వెనక నడుస్తూ చెపుతున్నాడు మల్లిగాడు:

"పాత కతేనండి. మా అయ్య సచ్చినాక బూమి అన్నకు నాకు హిస్సె[23]లు పంచిన్రు కదనండి. నాకేమో గొడ్లు, గోద, ఎగుసం[24] లేదాయె. మా అన్నకి ఇచ్చిన నాపాలు బూమి సుత మునాఫ[25]కు మక్త గింజలు[26] ఇగిస్త నంటడు. మూడేండ్లాయె ఎగబెడ్తాండు. దొరతో చెప్తతనంటే కాళ్ళుపట్టుకుంటడు, కడుపులు పట్టుకుంటడు, ఏడుస్తడు, ముసల్దాన్నేమో ఎల్లగొట్టింది మా వదిన. నీ కాల్మొక్త - నాకేమన్న మళ్ళున్నయా మాణ్యాలున్నాయా? మక్త గింజలడిగేతందుకు పాయిన్నుండి నిన్న. మా అన్న మక్తలేదు గిక్తలేదు పో అని వెల్లగొట్టిండు. నీ బాంచను. ఎట్లయ్యావో చూస్త దొరతానికి[27] పోతున్నని ఎళ్ళినుండ్రి, ఎనకనుంచొచ్చి కిందపడేసి గొరగొర గుంజ్కా పోయిన్రు ఆల్మగలు. చావగొట్టిన్రు ఇద్దరు కలిసి" అని కంట తడిపెట్టి వీపు చూపించాడు ముందుకు నడిచి. చర్మం లేచిపోయింది రెండుచోట్ల. దద్దులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. "దొరతానికి పొయ్యి చెప్తనని' వస్తాంటే పోరా! దొరేం తలకొట్టి మొలేస్తడా: నేనొక్క గింజియ్యనను పో' అని తుపుక్కున ఉమ్మేసిండుండి. దొరలు మీరే రచ్చించాలె. గరీబోణ్ణి. పిల్లలు గల్లోణ్ణి" అని రెడ్డిగారి కాళ్ళ మీద పడ్డాడు వీధిలోనే.

'జరుగు' అని కాళ్ళు వదిలించుకొని సాగిపోతూ "మక్త ఇప్పిస్తలేరా! వానికి మస్తీ[28] ఎక్కింది నాల్గెకరాల పొలం ఉంటే టార్కల్ల. దొర పిలుస్తాండని పట్కరాపో, తోళ్ళొలుస్త. దొర తలకొడ్తడో మొలేస్తడో

చూస్తే" అన్నారు.

"దర్మదొరలు నీ గులాపోణ్ణి. ఎట్లనన్న మఖ్త ఇప్పించురి" అని అక్కడే నిల్చిపోయాడు, మరొకసారి మోకాళ్ళు వంచి దండం పెట్టి.

పాణి ఎలా ప్రారంభించాలా అని తర్కించుకుంటుండగా ఉభయులూ మౌనంగా సాగిపోతున్నారు.

ఇంటముందరి అరుగుమీద కూర్చున్న కౌసాలి బ్రహ్మయ్య దొరను చూసి బీడీ ఆర్పి జేబులో వేసుకొని లేచి నుంచొని 'దొరా! దండం పెడ్త' అన్నాడు చేతులు జోడించి.

" ఏం బ్రహ్మయ్యా! దొంగ సామ్మేమన్న గలాయిస్తున్నావా[29]?"

"దొంగ సామ్మేడి ద్దొరా?" వెంట నడుస్తూ, "పనే దొరకటం లేదు" అన్నాడు.

"చిందొరసాని చంద్రహారం కావల్నంటున్నది, చేసి పెడ్తవా?"

"ఎందుకున్ననండి ఊళ్ళ, దొరల పన్లు చేయటానిక్కి కాకుంటే?" అని ధ్వని తగ్గించి 'రమ్మంటారా గడీలకి' అని అడిగాడు వినయంగా.

"ఇయ్యాల్రేపొగు."

"దొరవారూ!" అని దగ్గరికి వెళ్ళి మెల్లగా "తురకల్ను చేయటాన్కి వస్తున్రట అప్సర్లు[30]?"అని అడిగాడు.

"మాల మాదిగోండ్లను చేస్తరట."

"మహబూబ్ పాషా[31] ఇట్ల లేకుండె నుండి ధర్మాత్ముడు. చచ్చి ఏ సొర్గానున్నడోకాని. ఏన్గ నెక్కి పోయేటప్పుడు పైసల్చల్లించెటోడట! బాపన్ల క్కాడ సంభావన్లిచ్చేటోడట కాదుండీ!"

"అంటారు."

"బస్తీల ఇన్న, హనుమకొండలో కరణపాయనే తురకల్ల కల్సిండట కాదుండి, ఆయన పేరేదో చెప్పిన్రు, యాదికి[32] రావటంలే. నమాజు చేస్తడట. మసీదులకి పోతడట. నిజమేనా నుండి?"

"ఊ"

"వాళ్ళన్న కొత్తపల్లి దేశ్‌ముఖ్ కూడా కలిసిండట కాదుండి తురకల్ల? బాపనోళ్ళతో కూడ నమాజు చేయిస్తండట!"

"హు, రాజ్యం తురుకోళ్ళది. మళ్లిస్తరు, మాన్యాలిస్తరు, తురకల్ను చేస్తరు. ఏమంటవు?"

"నేనంటే మాత్రం ఆగుతాదుండి. ఏదో తెలియకడుగుత! 'ఆరుతరాల్నుంచి రాజ్యం చేస్తున్నం. ఇంకా నా రాజ్యం నూటికి ఎనభై మంది హిందూలున్నరు' అని విచారపడ్తున్నడట కాదుండి మన హుజూర్?"

గడీ రావడంతో " సరేగాని ఎల్లుండొచ్చి బంగారం తీస్కపో. జల్దిచేసియ్యాలే. లేకుంటే . యాదున్నదా?" అని ఉరిమారు రెడ్డిగారు.

"జేల్ల పడ్డది మరుస్తానుండీ?" అని వెనక్కు తగ్గాడు బ్రహ్మయ్య.

గడీలోకి వెళ్ళిపోయారు రెడ్డిగారు, పాణివైపు చూడనైనా చూడకుండా.

సారంగపాణి గదిలో ప్రవేశించి మంచంమీద పడిపోయాడు.

రెడ్డిగారు దర్శనం చేసుకుంటే నాల్గు సంగీతపు పాఠాలు దొరుకుతాయని ఆశతో వచ్చాడా ఊరు. ఎలాగో ఒక సంవత్సరం గడుపుకొని తనదేశం చేరాలని అతని సంకల్పం. రెడ్డిగారి దర్శనమే

గగనమైంది. గడీలో ఉండమని ఆశ్రయమిచ్చాడు. బాగానే ఉంది. తింటూ కూర్చోగలడా మనిషి? వచ్చింది కూడా మరచిపోతానేమో అనుకున్నాడు. రెడ్డిగారికి తన విషయం విన్నవించుకోడానికే సమయం దొరకడం లేదు. చింతల తోపుకు వెళ్తే తనను చూచి లేచి వచ్చాడు ఎందుకో? మల్లిగాని పోట్లాట? వాడు చెప్పింది నిజమేనా? ఏమో? తనకెందుకు? బ్రహ్మయ్యేమన్నాడు? బ్రాహ్మణులు సైతం తురకలై పోతున్నారా? ఇలా మతాలు మారుస్తూ రాజ్యమంత తురకల్ను చేస్తాడేమో నిజాం నవాబు. పోల్చిచూస్తే ఇంగ్లీషువాళ్ళే దేవతల్లా కనిపిస్తున్నారు. దీనికి ప్రతిక్రియ లేదా? గాంధీజీకి ఈ విషయాలు తెలియవా? అనుకున్నాడు. సహాయ నిరాకరణ, విదేశ వస్తు దహనం, ఉప్పు సత్యాగ్రహం గుర్తుకు వచ్చాయి. వనజ గుర్తుకు వచ్చింది. ఏదో ఆకర్షణ ఉంది ఆమె దగ్గర! కాస్సేపు తీయగా మాట్లాడకూడదూ వచ్చి! కళ్ళల్లో ఎంత అమాయకత ఉంది !

వనజ అతని కళ్ళలో మెదిలింది.

"ఏం పంతులూ, మంచిగున్నదా ఈడ?" అంటూ గదిలో ప్రవేశించారు రెడ్డిగారు ఆ రాత్రి.

దొరవారి కంఠం విని ఉలిక్కిపడి మంచంమీంచి దూకాడు పాణి. చేతులు జోడించి వినమ్రంగా నమస్కరించి "మీ దయవల్ల సుఖంగా ఉన్నానండీ" అన్నాడు సవినయంగా.

రెడ్డిగారు కుర్చీలో కూర్చున్నారు. చేతులు జోడించి హనుమంతునిలా పక్కనే నుంచున్నాడు పాణి.

"సర్లేగాని ఇంతజాముల్ల[33] మస్రూపుండి[34] మర్చిన..... నువ్వీడికేం పనిమీ దొచ్చినవ్, నన్నేం చేయమంటవ్?"

"చిత్తం. సమయం దొరికినప్పుడు విన్నవించుకుందా మనుకున్నా. మాది బెజవాడ. తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతం చదువుకున్నాను. సంగీతం నేర్చుకున్నాను. ఒక నెల తేడాతో తల్లితండ్రులిద్దరూ చనిపోయారండీ! నాకింకెవరూ లేరు. ఆ దుఃఖం భరించలేక దేశ సంచారం బైల్దేరాను. నైజాంలో అడుగు పెట్టినప్పణ్నుంచి మీ దయవల్ల ఆదరణ జరుగుతూనే ఉంది. ఏదో రెండుపారాలు కుదిర్చిపెడ్తే మీ పంచన ఒక సంవత్సరంపాటుండి వెళ్ళిపోతానండీ! మీరు రసికులనీ ధర్మాత్ములనీ విని వచ్చాను. మీ దయ."

రెడ్డిగారు తల గోక్కుని ఏదో ఆలోచించారు. కొద్దిసేపటి తరువాత "పంతులూ! ఒక పాటైతే పాడు" అన్నాడు. ఫిడేలు శ్రుతిపెట్టి ప్రారంభించాడు పాణి:

"యోచనా! కమలలోచనా!
నను బ్రోవ యోచనా!
సూచన చేతుననుచు నీకు తోచెనా
ద్యుతి విజితాయుత విరోచన!
నన్ను బ్రోవ నింకా యోచనా॥
కాచన, నిజభక్తి నిచయ, పాప విమోచన
గల బిరుదెల్లగాని నన్నేచిన
కృతి విపినరాబి హేచన!
త్యాగరాజ పూజిత కమలలోచన!

యోచనా నను బ్రోవ"

పాట పూర్తి చేసి ఫిడేలు క్రింద పెట్టి కండువాతో ముఖం తుడుచుకున్నాడు పాణి. తన్మయులై విన్నాడు రెడ్డిగారు. లోకాన్ని మరిపించి మనసును మురిపించే శక్తి సంగీతంలో ఉందని గ్రహించారు.

"పంతులూ! బాగ పాడినవయ్యా! నిషా వచ్చినట్లయిందనుకో. దినాం[35] ఈయాళ కొస్త, దినాం ఒక పాట పాడు. నువ్వీ గడీల ఎన్నోద్దులున్నా అడిగేటోడు లేడు. ఇన్నావా? ఏమంటవ్?" అని కుర్చీ మీది నుంచి లేచారు.

"చిత్తం. అలాగేనండీ!" అని, "పా...లా...లు... "నసిగాడు పాణి. అది వినిపించుకోనట్లుగానే వెళ్ళిపోయారు రెడ్డిగారు.

## 2

తెల్లవారే వరకల్లా స్నానం చేశారు రెడ్డిగారు. వైస్రాయ్ ధోవతి కట్టుకొని, జరీపనిచేయబడిన షేర్వానీ వేసుకొని, ఎర్రని కుచ్చుటోపి ధరించి, బూట్లు తొడుక్కొని దస్తార్[36] నడుముకు కట్టుకొని, అత్తరు పూసుకొని ముస్తాబై బైల్దేరారు చింతల తోపులోకి. అక్కడికి చేరేవరకు సుమారు అలాంటి వేషంలోనే ఉన్న కరణం వెంకట్రావు కనిపించాడు. తేడా ఏమంటే కరణంగారికి ఊర్ధ్వపుండ్రాలున్నాయి. నారయ్య, కోమటి వెంకయ్య, కిష్టయ్య ధోవతులు కట్టుకొని, కమీజులు వేసుకొని, రుమాళ్ళు చుట్టుకొని ఉన్నారు. మామూలు షేర్వాని, చుడిదార్ పైజామాలో ఉన్నాడు నిజాముద్దీన్.

రెడ్డిగార్ని చూసి అంతా నమస్కరించారు. ఒకసారి పందిరంతా కలయజూచి, ఏర్పాట్లన్నింటినీ అజమాయిషీ చేసి, వంటలకోసం ఏర్పాటయిన స్థలం చూడ్డానికి బైల్దేరారు రెడ్డిగారు. బస్తీ నుంచి తెప్పించిన పెద్ద పెద్ద దెగ్చాల్లో[37] వంటలు జరుగుతున్నాయి. ఆవు మాంసం ఎర్రగా, కుప్పగా పడి ఉంది. రెడ్డిగారి గుండె కలుక్కుమంది అది చూచి. గోవును దేవతగా పూజించే తాను గోమాంసరాశి చూడాల్సి వచ్చింది. అయ్యవారు చెప్పిన పురాణాలు గుర్తుకువచ్చాయి. రాక్షసులు మాత్రమే గోవులను హింసించేవారట! కలిపురుషుడు గోవును తన్నినంత మాత్రానే పరీక్షిత్తు ఉగ్రుడైపోయాడు. ఎంతటి కలికాలం! తాను గోమాంస భక్షకులకు సేవచేయాల్సి వచ్చింది కదా అనుకున్నారు. గిరుక్కున తిరిగి అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

ఒక మస్కూరు[38] పరుగెత్తుకొని వచ్చి, బండ్లు వస్తున్నాయని తెలియజేశాడు. దూరంగా గజ్జలచప్పుడూ వినవచ్చింది. రెడ్డిగారు పరుగు పరుగున పందిరి కిందికి వచ్చారు. బోర్లపడివున్న ఒక కుర్చీని సరిచేయమని ఆదేశిస్తూ, చేతులు కట్టుకొని నుంచున్నారు. వారిపక్కన కరణం. కరణం పక్కన నిజాముద్దీన్, అతని పక్కన నారయ్య, ఆ తరువాత కోమటి కిష్టయ్యా, వెంకయ్యా నుంచున్నారు.

తాసిల్దార్ బండి వచ్చేసింది ముందు. బండ్లోంచి తాసిల్దార్ దిగగానే వంగి వంటిచేత్తో మూడుసార్లు సలామ్ చేశారంతా. సలాములు అందుకొని "ఇంతజాములు ఠీక్[39] ఉన్నయా?" అని అడిగారు రెడ్డిగార్ని. రెడ్డిగారు వెంట నడువగా పందిరంతా కలయజూచి వచ్చేశా రిద్దరూ.

ఈలోగా మిగతా బండ్లు కూడా వచ్చేశాయి. బహద్దుర్ యార్‌జంగ్, ఖ్వాజా ఇనాయతుల్లా బేగ్ లాహారీ ముస్తఫ్, షేక్ లతీపుల్హసన్ అమీను, కొందరు పోలీసులు దిగారు. ఒకరి తర్వాత ఒకరు తాసిల్దారుకు చేసినట్లే అందరూ, అందరికీ సలాములు చేశారు. బహదుర్ యార్‌జంగ్‌కు గ్రామాధికార్లను పరిచయం చేశాడు తాసిల్దార్. అందరూ పందిట్లోకి వెళ్ళి కూర్చున్నారు. వారికి ఎదురుగా కొద్దిదూరంలో హరిజనులు కూర్చున్నారు.

"దేశ్‌ముఖ్‌సాబ్! వీళ్ళను ముసల్మాన్లుగా చేయటాన్కి మీకేమైనా ఏత్‌రాజ్[30] ఉన్నదా?" అని అడిగాడు బహద్దుర్ యార్‌జంగ్.

"మాకేమి ఏత్‌రాజ్ ఉంటది ? సర్కార్ హుకుమ్ తామీల్[31] చేసేటోళ్ళం " అని కరణం వైపు చూచారు రెడ్డిగారు.

"అంతే జనాబ్ ! మే మెంత? మా ఏత్‌రాజ్ ఎంత?" అన్నాడు కరణం.

అక్కడున్న వారందరితోనూ వారికెలాంటి అభ్యంతరం లేదనిపించుకొని ఉర్దూలో ఉపన్యసించాడు:

"హిందువులు మాల మాదుగుల్ను చాలా నీచంగా చూస్తూ వున్నారు." హరిజనులు వింటున్నారనే విషయం ధ్రువపర్చుకొని మళ్ళీ సాగించాడు: "వారిని తమ బావుల దగ్గరికీ, గుళ్ళల్లోకీ రానివ్వరు. తాకితే మైలపడతామంటారు. అతి నీచం అయిన పనులు చేయిస్తారు. ఊరిబయట ఉంచుతారు. అంటే వారు హిందువులు కారని అర్థం. అట్టివారికి ఇస్లాం మతం ఇచ్చి వారిని ఉద్ధరించటానికి ఇత్తేహాదుల్ ముసల్మీన్[32] వెలిసింది. ఆలా హ(జత్[33] దయదల్చి 'ఇస్లామ్ ముసల్మీన్' అనే సేగా[44] ప్రారంభించారు. ఆ సేగా నవ ముసల్మానుల 'సంక్షేమానికి' కృషి చేస్తుంది. వారికిగాను బావులు త్రవ్వించడం, భూములు చూపడం, విద్య చెప్పించడం వారి పనులు.

"ప్రపంచంలో 'ఇస్లాం' ఒక్కటే మతమనీ, అల్లా ఒక్కడే దేవుడనీ, హ(జత్ మహమ్మద్ ప్రవచించినారు. ముసల్మానులంతా ఒక్కటే.

"వారికి కులాలు లేవు. ఒకే మసీదులో అలా హ(జత్ మరియు ఫకీర్ నమాజ్ చేయవచ్చు. అన్నపానముల వద్ద భేదము లేదు. అల్లాదృష్టిలో అందరూ సమానులే. హ(జత్ మహమ్మద్ పేదవారికొరకే కృషిచేసినారు. ఆలా హ(జత్ కూడా పేద ముసల్మానులను ఉద్ధరించ తలచినారు. కాబట్టి ఇందు విషయంలో ఎవరికీ అభ్యంతరం ఉండరాదు. మేము వీరిని చాటుగా ముసల్మాన్లను చేయటం లేదు. మీ సమక్షంలోనే చేస్తున్నాము. ఇందుకు మీరందరూ సాక్షులు."

రెడ్డిగారి రక్తం వేడెక్కింది. దాచాలన్నా దాగక కరణం కళ్ళు ఎర్రవారేయి. అయినా లోపల్లోపల తిట్టుకున్నారేగాని పైకి ఒక్కమాట మాట్లాళ్ళేదెవ్వరూ.

ఖాజీ[45] ఆదేశం మేరకు, వారివెంట వచ్చిన తురక మంగళ్ళు హరిజనుల్ను వరుసన కూర్చోపెట్టి నెత్తులు గొరిగారు. జుట్టు రహితంగా క్షౌరం చేయించుకున్న తరువాత మామూలుగా చూసుకున్నట్టు తలమీదికి చేయిపోనిచ్చి చూసుకున్నారు. బహద్దుర్ యార్‌జంగ్ అంతటివానిముందు కూర్చోవడం, అతడు చెప్పిన మాటలు వారికి కొంత సంతోషాన్నిచ్చిన మాట వాస్తవమే అయినప్పటికీ, జుట్లుపోతే చిన్నబుచ్చుకున్నారు వారంతా. అవి వారికి చిన్నతనంనుంచేకాక, తరతరాల్నుంచి వస్తున్నవి. తమ ఆస్తి ఏదో పోయినట్టు బాధపడ్డారు. అయినా ఎవరూ మాట్లాళ్ళేదు, యమదూతల్లాంటి పోలీసుల్ని చూచి.

తరువాత ఖాజీ ఒక్కొక్కని మొలత్రాడు రెండుచేతుల్తోనూ పుట పుటా తెంపేశాడు. తమతో తెచ్చిన గుడ్డలు పంచిపెట్టారు అధికార్లు అందరికీ. పైజామాలూ కుర్తాలు తొడుక్కొని అంతా ముసల్మాన్లయి పోయారు. ఖాజీ వారిపేర్లు మార్చి మహమ్మద్, హసన్, హుసేన్ మున్నగు పేర్లు పెట్టాడు. ఆ పేర్లన్ని వ్రాసుకున్నాడు తాసీల్దార్ 'ఇస్లామ్' ముసల్మీన్[46]కు పంపడానికి.

ఆడవారి వంతు వచ్చింది. మంగళసూత్రాలు తెంపడానికి సాగాడు ఖాజీ. వాటిని తెంపనియ్యమన్నారు ఆడవాళ్ళు.

"పుస్తె తెంచుతే మా పెద్దాయనకు గండమొస్తది. పుస్తె వుంచి తురకల్ల కలుపుతే కలుపురి. లేకుంటే మాల మాదిగోళ్ళంగనే ఉంటం. ఏమ్మాతాతల్తం(డుల్బచ్చినా?" అన్నది మైసి.

"మంగళసూత్రం లేకున్నా" అని ఏదో అనబోయాడు ఖాజీ. "మనకెందుకసే గీ తురకమతం గిరకమతం? మొగోళ్ళకు సిగ్గులేకపోయే మనకన్న ఉండొద్దే. పదురి. పదురి గుడిసెల్లకు. చస్తే మాల మాదిగులంగనే చస్తం" అని వెనక్కు తిరిగింది మైసి. అందరూ ఆమెననుసరించారేకాని అక్కడున్న కొత్తచీరెలు వారి మనసుల్లో రెపరెపలాడేయి.

అధికార్ల ఒళ్ళు మండిపోయింది. పోలీసు అమీను పళ్ళు పటపటమని కొరికాడు. తాసిల్దారు గుడ్లెర్రచేశాడు. మున్సఫ్, బహద్దుర్ యార్‌జంగ్‌తో ఏదో గుసగుసలాడాడు.

రెడ్డిగారూ, కరణమూ సంతోషించారు లోపల్లోపల.

మున్సఫ్ ఏవో సంజ్ఞ చేశాడు. ఖాజీ వారందర్నీ పిలిచాడు:

"రాండి.....రాండి, పుస్తెలు తెంపకుండనే తురకల్ను చేస్త"

చీరల మురిపం వారిని వెనక్కు తిప్పింది. "నీ కాల్మొక్త ఎనకటి నుంచి వస్తాన్నది కాదుండి పుస్తే, చూస్త చూస్త ఎట తెంపుదుం?" అన్నది మైసి రాజీపడుతున్నట్లు. తనచేత్తో వారి బొట్లు చెరిపేశాడు ఖాజీ.

మతం మార్చుకున్న మగవారిస్థితి ద్రౌపదీ వస్త్రాపహరణమప్పటి పాండవుల్లా వుంది.

అడవాళ్ళందరికీ తురక చీరలు కట్టించారు. దాంతో వారూ తురకలైపోయారు. అందరినీ వరుస నుంచోపెట్టి తాను చెప్పినట్టు చెప్పమన్నాడు ఖాజీ.

"లా ఇలాహీ, ఇల్లల్లాహీ, మహమ్మదున్ రసూలల్లాహీ."

'కొత్త తురకలు ' ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. అంతా కలసి రాయిలాగా అనేశారు.

"అట్లకాదు. ఒక్కొక్క మాట అనండి" అని "లా ఇలాహీ" అని చెప్పాడు ఖాజీ.

"రా యిలాగా" అన్నారందరూ.

"అట్ల కాదు. లా ఇలాహీ" అన్నాడు ఖాజీ.

"లాయరప్పా" అన్నారంతా.

ఎవరూ అనలేకపోతే ఏదో అనిపించి సంతృప్తిపడ్డారంతా. మొత్తంమీద కొత్త ముసల్మాను లన్నది ఇలా వుంది :

"లాయిలప్పా, ఇల్లెల్లా మా అమ్మకు రాసురల్లా".

దానిని గురించి ఇలా చెప్పాడు ఖాజీ:

"అల్లాతప్పవేరు దైవంలేదు. మహమ్మద్ ఒక్కడే దేవుని దూత. ఈ విషయమును నోటితో పఠించి మనసార విశ్వసించుటే ఇస్లాం. ఇదియే మీ మతము. ఇదియే మీ విశ్వాసము. ఇది మిక్కిలి నిరాడంబరమైన మతము. దీనిలో ధనవంతుడని, పేదవాడని భేదము లేదు. ముసల్మానులందరు సహోదరులే. 'అల్ ముస్లిమ్ ఆఖల్ ముస్లిమ్' కాబట్టి నేటినుండి మనమందరము సోదరులము. అందరమూ కలిసి నమాజు చేయుదము. నేనెట్లు చేసిన మీరందరు నట్లే చేయవలెను" అన్నాడు ఖాజీ.

అందరూ వరుసలుగా నుంచున్నారు. నవ ముసల్మానులు అధికారుల ప్రక్కలా, వెనుకా నుంచున్నారు. ఖాజీ ముందు నుంచున్నాడు. అతడు చెవుల్లో వ్రేళ్ళు పెట్టుకుంటే అంతా పెట్టుకున్నారు. అతడు వంగుతే అంతా వంగారు. కాని, అతడు లేవకముందే కొత్త తురకలంతా లేచారు. ఖాజీ

వంగివున్నాడని తెలుసుకొని మళ్ళీ వంగారు. ఖాజీ లేచాడు. వారు లేవలేదు. లెమ్మన్నాడతను. అందరూ లేచారు. ఇలా నమాజు ముగిసిందనిపించాడు ఖాజీ.

భోజనాలకు ఏర్పాట్లు జరిగాయి. అధికారుల పంక్తిలోనే కొత్త తురకలూ కూర్చున్నారు. అందరికీ గోమాంసపు బిర్యానీ వడ్డించారు.

"మేం మాదిగోండ్లతో తినముండి. తురుకోండ్లమైతే మాత్రం కులం తగ్గుతదా? మాదిగోండ్లు మాదిగోండ్లే, మాలోండ్లు మాలోండ్లే" అన్నాడు ఒకడు. మాలలంతా మేం తినమంటే మేం తినమని లేచారు.

"మేం డొక్కలోండ్లతో తినముండి" అని మాదిగలు లేచారు.

అధికారులు ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. బహద్దుర్ యార్‌జంగ్ ఉపన్యాసం బూడిదలో పోసిన పన్నీరైంది.

"మేం మాల తురుకోండ్లమే., వాల్లు మాదిగతురుకోల్లే. తాతల్నాటినుంచి లేంది ఇప్పుడు తినమంటే తింటాముండి?" అన్నాడు మరొకడు.

విధిలేక వేరే పంక్తులు తీర్చి వడ్డించారు వీర ముసల్మానులు.

భోజనాలయింతరువాత కొత్త తురకలందరికీ గింజలు కొలిపించాడు తాసిల్దారు. బండ్లు సిద్ధమైనాయి. రెడ్డిగారి చేతుల్తో చేతులు కలిపి "షుక్రియా[47]" చెప్పి బండ్లెక్కారంతా.

బండ్లు సాగిపోయాయి.

కొత్త తురకలు గింజల మూటల్తో ఇండ్లకు చేరారు.

రెడ్డిగారు గడీకి తిరిగి వచ్చారు, గరం గరంగా.

## 3

మంచం మీద పడుకొని కూనిరాగం తీస్తున్న పాణి గాజుల చప్పుడు వినిపిస్తే తల త్రిప్పి చూచాడు. కావిడి పెట్టెమీద భోజనపు పళ్ళెం పెట్టి వెళ్ళిపోవడానికి ప్రయత్నిస్తూంది వనజ. లేచి కూర్చుని పిలిచాడు.

కళ్ళెం పట్టుకొని లాగినట్లు నుంచుండి పోయింది.

"నుంచోరాదూ?"

తలవంచుకొని నుంచుంది.

"వనజా ! నీ పేరుకు అర్థం తెలుసా?"

తల అడ్డంగా ఊపింది తెలీదన్నట్లు.

"వనజము అంటే తామరపూవు."

తలెత్తి కళ్ళు పెద్దవిచేసి చూసింది. తన పేరు అంత అందమైందా అనుకుంది.

"నీ కళ్ళిప్పుడు నిజంగా తామరల్లాగే వున్నాయి వనజా!"

తల వంచుకుంది.

"దొరసాని తిడ్తది" అని గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది. పాణి ఎంత మంచివాడు, తన పేరు చక్కనిదని చెప్పాడానాడు, ఇప్పుడు దానికి అర్థం చెప్పాడు. తామరపూవు! తాను అందగత్తెనని మొదటి తడవగా చెప్పిన వాడతడే. నిజంగా తాను అందకత్తెయేనా? ఎంతమంది వాడుకున్నారు తనను! తన అందాన్ని గురించి ఒక్కమాట కూడా అనలేదెవడూ ఈనాటికి. యంత్రంలా, ఆటబొమ్మలా అందరికీ

లొంగింది తాను. తనకు సిగ్గన్నది ఎన్నడో పోయింది - మొదటి రాత్రితో . మామిడిపండ్లు పళ్ళెంలో పెట్టి అందించినట్లు అందించింది తనను అందరికీ. రసం త్రాగి తొక్క పారేసినట్లు పారేశారెందరో. మగవారంటే ఆడదాన్ని పళ్ళరసంలానూ, పాయసంలానూ, సారాయిలానూ తాగేవారనుకున్నది తానిన్నాళ్ళనుంచి. అల్లాంటి తనకు కొత్త అనుభూతి కలిగించాడు పాణి. అతని ముందుకు వెళ్ళగానే ఎందుకు తన తల అలా సిగ్గుతో వంగిపోతుంది? ఎందుకు గుండె వేగంగా కొట్టుకుంటుంది? ఆతను తనను కోరాడా? కోరితే అడ్డు చెప్పగలదా తాను? తనను అనుభవించినవారెవరో, ఎంతమందో కూడా తనకు గుర్తులేదు. కాని, ఈ పాణి! ఇతను విచిత్రంగా ఉన్నాడు. ఇతను శరీరానికి కాక, గుండెకు గిలిగింత పెట్టుతున్నాడు. శారీరకం అయిన తృష్ణ తనకు లేదు. కాని, ఏదో మానసిక తృష్ణ కలిగిస్తున్నాడితను.

ఆమెకు గడీ పక్కనున్న దంపతులు గుర్తుకువచ్చారు. కిష్టయ్యకు జబ్బుచేస్తే రాములమ్మ ఎంత తహతహలాడిపోతుంది? రాములమ్మ కాలికి ముల్లు గుచ్చుకున్నా గుండెల్లో ముల్లుగుచ్చుకున్నట్లు బాధపడ్తాడు కిష్టయ్య. వారిద్దరి బాంధవ్యం ఏమిటి? అది శారీరకం అయిందా? కాదు. తనకూ ఇంద్రారెడ్డికి శారీరకమైన సంబంధం. ఇంద్రారెడ్డి చనిపోయినా తాను ఏడవలేదు. తాను చనిపోతే, తనకు బాధ అవుతే ఇంద్రారెడ్డి బాధపడ్తాడా? పడడు. ఎందుకు? అది క్షణికమైన సంబంధం. శారీరకమైన సంబంధం. రాములమ్మదీ, కిష్టయ్యదీ అలా కాదా? వారిది పవిత్రమైన బంధం! జీవితాంతం ఒకరి దుఃఖాన్ని ఒకరు పంచుకుంటారు. ఒకరి దుఃఖం పంచుకోని జీవితం ఏం జీవితం? తానెవరికోసమన్నా దుఃఖపడగలదా? ఎవరున్నారు తనకు? దొర. తనకు తిండి పెడ్తాడు. జబ్బుచేస్తే మందిస్తాడు. అది అతని దొడ్లో ఉన్న పశువులకూ చేస్తాడు. దొర దుఃఖాన్ని తాను పంచుకోగలదా? లేదు. పంచుకోలేదు. తల్లి చనిపోయినప్పుడు తానెంత ఏడ్చింది? మళ్ళీ అలా ఏడవగలదా తాను? లేదు. పోనీ, తన దుఃఖాన్ని పంచుకొనేవారున్నారా? లేరు.· తానొకరి సుఖదుఃఖాల్ను పంచుకోవాలి ? తన సుఖదుఃఖాల్ను పంచుకోవడానికి తన కొకరు కావాలి. నిజమే కాని, ఎలా?

## 4

రెడ్డిగారు పొలాలవైపు వెళ్తున్నారు చింతల తోపులోంచి. చింతచెట్టు మీద ఏదో అలికిడి వినవచ్చింది. తరువాత ఆదుర్దాగా దూకిన చప్పుడైంది. చకచకా నడిచి చూస్తే చెట్టుమీద నుంచి దూకి పరిగెత్తుతున్నాడొకడు. అది చూచి "ఎవడ్రా! ఆగు" అని కేకవేశారు రెడ్డిగారు. పరుగెత్తుతున్న మనిషి ఆ మాటే వినిపించుకోనట్లు పరుగెత్తాడు.

దొరగారి ఆజ్ఞకు అంతగా ధిక్కారం ఎప్పుడూ జరుగలేదు. లోకమంతా తలక్రిందు లౌతున్నట్లనిపించిం దాయనకి. అలికీ మనిషి తాను నిలవమంటే నిలవడూ? కోపం పొంగింది. నరాల్లో రక్తం మహావేగంగా పార్లింది. ఆవిర్లొచ్చాయి. మళ్ళీ కేకవేశాడు "ఒరే, నిలబడు. లేకుంటే తోళ్ళొలుస్తా!" అని. పరిగెత్తే మనిషి మరికొంత వేగంగా పరిగెత్తాడు. కాని నిలవలేదు. రెడ్డిగారి ఉద్రేకం పార్లింది. నరాలు చిట్లి రక్తం బైట పడేంత పనయింది.

"ఎవడ్రా అక్కడ?"

"బాంచను. పెంటిగాణ్ణి" అని బాణంలా పరిగెత్తుకొని వచ్చి చేతులు కట్టుకొని నుంచున్నాడు.

"లంజకొడుక, ఏం చేస్తున్నావుర ఈడ! చింతల్ల దొంగలు పడ్తే చూడొద్దు?"

"నీ కాల్మొక్త, నేను జొన్న చేనుమీదున్ననుండి."

"జవాబు సుత చెప్పుతాలే గాడ్దికొడకా" అని వంకర కర్రతో వానిమీదపడి బాదాడు.

దెబ్బతగిలినచోట చేత్తో రాసుకుంటూ బెత్తానికి చేయి అడ్డంపెట్టి దెబ్బలు తప్పుకుంటున్నాడు పెంటిగాడు. ఈలోగా బాటన వెళ్తున్న బ్రహ్మయ్య కనిపిస్తే "ఎవరయ్యా పారిపోతున్నదీ?" అనడిగారు. బ్రహ్మయ్య నుంచొని దండం పెట్టి జవాబు చెప్పాడు: "మల్లిగాని కొడుకు పీరిగాడు."

"ఏ మల్లిగాడు?"

"చాకలి మల్లిగాడు.గత్తరొచ్చి చచ్చిండు కాదుండి, అని కొడుకు."

"చాకలి మల్లిగాడు కొడుక్కు ఇంత మస్తెక్కింది[48]లే!"

"ఏం చేసిండుండీ?" అడిగాడు బ్రహ్మయ్య.

"చింతచెటెక్కి కాయలు కోస్తాండు. నే నొచ్చేటారల్కల, నన్ను చూసిండు. దునికిండు, ఉరికిండు. అరిచినా పలక్కుండ, ఉరికిండు. కాయకోసుకున్నోడు 'దొరా! గీకాయ కోసుకున్న నీ బాంచను' అంటే పోక పోయినది. ఏమంటవు చెప్పు?"

దొర వ్యవహారం వింతగా తోచింది బ్రహ్మయ్యకు. చింతలు ఎవరివి? దొర తండ్రివా, తాతవా! సర్కారువి. ప్రతి ఏడాది సర్కారు చింతల్ను వేలం వెయ్యాలి. ఎవడు ఎక్కువ పాడితే వాడికి సంక్రమించాలి న్యాయంగా చింతలు. కాని, దొర వేలం వెయ్యనివ్వడు. తాసీల్దారువాళ్ళకేదో చెప్పి వేలంలో ఎవరూ పాల్గొనలేదని వ్రాయిస్తాడు. చింతకాయంతా కొట్టించి ఊళ్ళో కరణానికంత, పటేలుకింత ఇచ్చి, మిగిలింది బస్తీకి పంపి అమ్మిస్తాడు. పైగా, ఈ చింతలు తన జాగీరైనట్లు అందర్నీ బెదిరిస్తాడని మనసులో అనుకొని పైకి "దొరోరు నిలవడమంటే నిలవకుండ పోయిండులే! అబ్బ, ఎంత ధైర్యముంది!! చాకలోడే అట్లయితే ఇగ దొరోరి మాట సాగినట్టే" అని దండంపెట్టి వెళ్ళిపోయాడు బ్రహ్మయ్య.

'చాకలోడే అట్లయితే ఇగ దొరోరి మాట సాగినట్లే' అనే మాటలు రెడ్డిగారి మెదడును చీల్చి వేయసాగాయి. తరతరాలుగా వస్తున్న ప్రభుత్వం ఊడిపోతున్నట్లనిపించింది. పీరిగానికి తగిన శాస్తి చేయాలి. ఈ దెబ్బతో ఊరికి ఊరే అదిరిపోవాలి. మళ్ళీ చింతలవైపు వెళ్ళే ధైర్యం ఎవడూ చేయగూడదు అనుకుంటూ జొన్న చేనువైపు నడిచారు. గొడ్డు దూరి కరకరా మేస్తున్నది జొన్నంతా. మెదడు కరకరా కొరికినట్టనిపించింది.

"ఎవడ్రా అక్కడా?" గర్జించారు. అదే ధ్వని తిరిగి వచ్చింది. 'గాడిద కొడుకులు, సొమ్ముతిని ఇండ్లంల్ల పంటరు' అనుకుంటూ జొన్నచేలో దూరి పశువును బాదారు రెడ్డిగారు. పశువు పరిగెత్తింది. దానివెంట పరుగెత్తి బాదారు. పశువు అమాంతంగా వెనక్కు తిరిగింది. దొరవారూ తిరగబోయి, ధోవతి కాలికి తట్టుకొని పడిపోయారు. ఎవరైనా చూసారేమోనని అటూ ఇటూ కలియజూచారు. ఎవరూ చూళ్ళేదని ధ్రువపరుచుకొని పంచ దులుపుకొని కర్ర అందుకొని బుసలుకొట్టూ ఊళ్ళో ప్రవేశించారు.

తలమీది బిందెల్లో మంచినీళ్ళ బావినుంచి వస్తున్న ముగుదలు 'దొరోరు దొరోరు' అని పక్కకు ఒదిగి నుంచున్నారు. అరుగులమీద కూర్చొని ముచ్చట్లాడుకుంటున్న మగువలు అమాంతంగా లేచి లోనికి వెళ్ళి తలుపులు వేసుకున్నారు. బాట వెంట నడిచేవారు పక్కకు ఒదిగి దొరవారికి మార్గం చేశారు.

కరణం ఇంటి ముందరి అరుగుల మీద కరణం, పటేలూ కూర్చుని మాట్లాడుకుంటున్నారు రెడ్డిగార్ని చూచి లేచి నమస్కరించారు.

"చాకలి పీరిగాడు చింతకాయలు కోస్కపోయిండట కాదుండి?" కరణం వెటకారంగా అడిగాడు.

"యాడికి పోతడులే దొరను తప్పించుకొని?" పటేల్ నిజామొద్దీన్ అన్నాడు.

"కలికాలం కాదు దొర. దాతలెక్కున్నాది?" అన్నాడు కరణం చివరి పదం కావాలనే నొక్కి

పలుకుతూ.

రెడ్డిగారి రక్తంలో నిప్పు పెట్టినట్లయింది. అయినా, అది బయట పడనివ్వకుండా "వస్తరా గడిదాక" అని సాగిపోయారు. కండవాలు బుజాన వేసుకొని బైల్దేరారు వారిద్దరూ ఆయన వెనకనే. పీరిగాని విషయం తనతో సంప్రదించడానికి రమ్మన్నాడనుకున్నాడు కరణం. తన కలవరం వారికి తెలియనీయ రాదనుకున్నారు రెడ్డిగారు. ఈ చిన్న విషయం కరణంతో సంప్రదిస్తే తాను లోకువైపోతా ననుకున్నారు. పీరిగాణ్ణి పట్టుకొని నాలుగుబాత్తే సరిపోతుందనుకున్నారు. రెడ్డిగారు గడీకిచేరి బల్లపీటమీద కూర్చునేవరకే వారూ వచ్చేశారు. ఎదుటి బల్లమీద కూర్చున్నారు. వారిని ఎందుకు పిలిచిందీ,,ఏం మాట్లాడాల్సిందీ అర్థం కాలేదు రామారెడ్డిగారికి.

"మంది మితిమీరిపోత్రాను (స్రీ " అన్నాడు పటేలు.

విషయం మార్చాలని తటపటాయించే రామారెడ్డిగారికి పాణి గుర్తుకు వచ్చాడు.

"కరణంగారూ! ఊళ్ళ రాములోరికి గుడి కట్టించినం. బాపన్లను తెచ్చి ఉంచినం. సర్కారుతో మదర్స[49] పెట్టించినం. ఒక సంగీతపాయిన్నుంచాలని శాన దినాల్నుంచి..."

"ఔ మహరాజ్! సంగీతపాయ నుండాలె, వెంకటేశ్వర్ల జాతర్ల ఏం చక్కగ పాడిండుండి" అన్నాడు నిజామొద్దీన్.

"సంగీత పాయన్నుంచటమంటే మాటలా నుండి? ఇల్లు కావాలే, సంసారాన్కి తగిన భూమి కావాలే, ఇన్నిచ్చేనా వచ్చి ఉండేటోడు కావాలే - పారిపోకుండ."

"అయ్యన్ని ఆలోచించిన. మొన్నొక సంగీతపాయ నొచ్చిండు. శాన మంచిగ పాడ్తడు. లగ్గం కాలేదు. ఒంటిగాడు. ఒక్కణ్ణే భరాయించలేమా?"

"ఒంటిగాడు - లగ్గం కాలేదా? అయితే, ఉంచుకోవచ్చు దొరవారు. కుంటిదానికి సంగీతం చెప్పిస్త, నారయ్యగారి బిడ్డగ్గాడ చెప్పించమంట - ఏమంటరు?"

"శాన బాగున్నదుండి. జర గానా బజానా[50] ఉండాలే ఊళ్ళ" అన్నాడు పటేల్ నిజామొద్దీన్.

"ఎంకటిగా! పంతుల్ను పిలువ్" - ఆదేశం.

సారంగపాణి వచ్చి ముగ్గురికీ నమస్కరించి కూర్చున్నాడు.

కరణం అతణ్ణి ఆపాదమస్తకం కొలిచాడు. నిజామొద్దీన్ తుపాకి గుండులా అనేశాడు - "ఎంకటేశ్వర్ల జాతరాయనే కాదుండి!"అని.

"అవును. పేరు సారంగపాణి. శాన బాగ పాడ్తడు. సంగీత పాఠాలు చెప్పుకోటాన్కివచ్చిండు" అన్నారు రెడ్డిగారు.

" ఊరుండి?" అడిగాడు కరణం.

"బెజవాడ."

"తల్లిదండ్రులు లేరా?"

"లేరండీ!"

"లగ్గం కాలేదా?"

"కాలేదండి!"

"ఊళ్ళుంటవా? నాలుగు దినాలుండి ఎగిరిపోతవా?"

"ఉండి పోదామనే వచ్చానండీ! దొరవారు ఆశ్రయం ఇచ్చారు."

చివరి మాటకు కరణం గుండె కటుక్కుమంది " దొరవారు ఎంతమంది కిచ్చిన్రో ఆశ్రయం. నీకియ్యటం లెక్కా?" అని రామారెడ్డి పొంగిపోతున్నారని గ్రహించి, "రేపట్నుంచి నా బిడ్డకు పాటం శురూ[51] చెయ్యి" అని ఆదేశించినట్లుగా చెప్పాడు కరణం పాణితో.

"ఏం చెప్పమంటారండీ?"

"సంగీతం చెప్పమంటే " కాస్త విసుక్కొని అన్నాడు - సంగీతం అనేదంతా ఒక పదార్థం అయినట్లూ అందును గురించి వివరణ అవసరంలేదన్నట్లూ.

"అది కాదండీ, ఏ వాద్యం చెప్పమంటారని?"

"అట్లానా" అని తలగోక్కుని, తనకు అర్థం కాలేదనే విషయం ఎదుటివారికి తెలియనీయకుండేందుకు ప్రయత్నిస్తూ " నీకేమేమి వస్తయి?" అనడిగాడు.

"ఫిడేలు, వీణ, మృదంగం."

అన్ని పేర్లు విని మరికాస్త తికమకపడ్డాడు కరణం. ఫిడేలు అందామనుకున్నాడు. కాని, ఎప్పుడు విన్నదానికంటే విననిదాని పేరు చెపుతే రసికుడనుకుంటారనుకొని "వీణ చెప్పు" అన్నాడు.

"అయ్యా! నా దగ్గర ప్రస్తుతం ఉన్న వాద్యం ఫిడేలు. అదే చెప్పమంటే రేపట్నుంచి పాఠం ప్రారంభించగలను. వయొలిన్ తరువాత తెప్పించి ఇచ్చినా ఫరవాలేదు. వీణ చెప్పమంటే అది తెప్పించింతరువాతగాని ప్రారంభం చేయడానికి వీల్లేదు."

'వీణ' అన్నందుకు చాలా బాధపడ్డాడు కరణం. కరణం బాధ గమనించి చిరునవ్వు నవ్వారు రెడ్డిగారు.

"సరే. అదే చెప్పు" అన్నాడు పటేల్ నిజాముద్దీన్ 'ఫిడేలు' అనే పదం పలుకరాక.

"సరే అదే చెప్పు" అన్నాడు కరణమున్నూ, ఏదైతేనేం అనే అర్థం ద్యోతకమయ్యేట్లు.

"మంచిదండీ, రేపు ఉదయమే వచ్చి ప్రారంభిస్తాను" అన్నాడు పాణి.

"సరే, శలవు తీసుకుంట" అన్నాడు కరణం, పీరిగాని విషయం సంప్రదించడానిగ్గాను కూర్చొమ్మంటాడని ఆశిస్తూ.

"మంచిది " అన్నారు లేచి నుంచుంటూ రామారెడ్డిగారు. నిజాముద్దీన్ కూడా లేచి నుంచున్నాడు. ఇద్దరూ బైల్దేరారు.

నాలుగడుగులు వేసిం తర్వాత "కరణంగారూ!" అనే రెడ్డిగారి మాట వినిపించడంతో పీరిగాని విషయం మాట్లాడ్డానికే పిలుస్తున్నాడనుకొని వెనక్కు తిరిగిన కరణంగారికి, "నారయ్య గారి జిమ్మేదారి[52] మీదే" అనే మాట నిరాశ, కోపం కలిగించాయి.

"మంచిది, ఇయ్యాళ్నే మాట్లాడ్త" అంటూ సాగిపోయారిద్దరూ నారయ్య ఇంటివైపు.

"చూసినవా, పీరిగాని సంగతి దాచిపెడ్తున్నడు" అన్నాడు కరణం నిజామొద్దీన్‌తో.

"అ... పట్వారీసాబ్, పీరిగాని సంగతన్న ఎత్తలేదు మన ముంగల" అన్నాడు ఆశ్చర్యం వ్యక్తపరుస్తూ. "దొర ఏమనుకుంటడో" అన్నాడు తరువాత.

"ఏమనుకుంటాడా? తానే రాజాననుకుంటడు ఊరికి, చూద్దంలే" అన్నాడు. ధ్వనిలో ద్వేషం వ్యక్తం అయింది. పటేలు చకితుడై కళ్ళల్లోకి చూస్తే అప్పుడే రక్తం దిగిపోతున్నది.

నిజామొద్దీన్ శలవు తీసుకొని సలాం చేసి వెళ్ళిపోయాడు.

నారయ్య ఇంటిముందుకు వెళ్ళి "నారయ్యా!" అని పిలిచాడు కరణం.

ఒక స్థూలకాయుడు, గుండ్రనిముఖమూ, బట్టతలా, చిన్నచెవులూ, లావైన ముక్కూ, చిన్న కళ్ళూ గలవాడు వచ్చి దండం పెట్టి " రాండ్రి, కూచుండ్రి" అన్నాడు. కరణం కూర్చోక ముందే "పీరిగాడు దొరల చింతల్లపడి చింతకాయ కోసిండటకద" అని అడిగాడు.

"ఊళ్ళో అనుకుంటున్నారు. దొర దగ్గర్నుంచే వస్తున్న. నాతోని ఆ ఖబర్ ఏం చెప్పలేదు."

"అదేందుండీ చిత్రం! మీకు చెప్పకుండ ఏమన్న చెయ్యలేస్తాడు దొర?"

ఆ సంభాషణ పొడిగిస్తే కోపం పొంగి పొర్లేట్లుంది కరణానికి. ఏదో ఒకటి గబగబా వాగినా వాగొచ్చు. రామారెడ్డి బలవంతుడు. తాను అతణ్ని ఏమి చేయలేడు. మాటలవల్ల ప్రయోజనం లేకపోగా శత్రుత్వం రావచ్చు అనుకొని మాట మార్చాడు.

"నారయ్యా గారూ ! ఊళ్ళకి సంగీతపాయనొచ్చిండు. మా తాయారుకు సంగీతం చెప్పిస్తున్న, నీ బిడ్డక్కూడ చెప్పించరాదు?"

అనుకోకుండా పిడుగుపడ్డది నారయ్య మీద. సంగీత పాటకుడు గడీలోకి వచ్చాడని తెలిసిన్నాడే తనమీద ఈ పిడుగు పడుతుందని గ్రహించాడు. కాని, రెడ్డి కరణం చేత చెప్పించి తనను అడకత్తెరలో పెడ్తాడనుకోలేదు. లంబాడీల భూమి తగాదా విషయంలో తాను కరణం చేతుల్లో ఉన్నాడిప్పుడు. కరణం మాట వినకుంటే నిలువునా ముంచుతాడు తనను. నారయ్య తన చేతులోంచి జారిపోతాడనే తెగనియ్యడం లేదు కరణం. అది నారయ్యకు తెలుసుకాని ఏం చేయగలడు పాపం!

" మీరు చెప్పుతే కాదంటానుండి నన్నడగట మెందుకు? ఆణ్ణే చెప్పకపోయినారు మా సీతకు కూడా చెప్పమని."

కరణం చిరునవ్వు నవ్వి "నువ్వీ మాటంటవని నా కెరికే. ఎట్లయిన నిన్నడుగుతే బాగుంటదనుకున్న. రేపు పొద్దున లేచి మా ఇంటి కొస్తడు సంగీతప్పంతులు, వెంట పెట్టుకొని వస్త" అని లేచాడు.

నారయ్య కూడా లేచి కరణంతో నాలుగు అడుగులు వేసి "ఆ లంబాడీల పంచాయితీ తప్పియు[53] చేయకపోతిరి" అన్నాడు.

"చూస్తంలే జల్దేమున్నది? ఫసల్[54] నువ్వే తింటున్నవ్ కద, లంబాడి ముండాకొడుకులు కచ్చేరికి పోయిన్నాడు చూతంలే" అని వెళ్ళిపోయాడు కరణం.

## 5

**తాం**బూల చర్వణం చేస్తూ గదిలో ప్రవేశించారు రెడ్డిగారు. దిగ్గునలేచి నుంచొని దండం పెట్టాడు పాణి.

"కూచో పంతులు" అంటూ కుర్చీలో కూర్చున్నారు రెడ్డిగారు. పాణి వయొలిన్ పెట్టె మూత తీస్తుంటే అడిగారు 'పంతులూ పీరిగాని ఖబరిన్నావా?' అని.

లేదన్నట్టు చూచాడు పాణి, వయొలిన్ అలాగే ఉంచి.

"అయితే నీదనక రాలేదన్నమాట. పొద్దుగూకేటాళ్ళ పొలాల కాడికి పోతన్నా, చింతచెట్లమీద జర్ర అలికిడనిపించింది. ఎవడ్రా వాడు అంటుండగనే చెట్టు దిగిండు, ఉరికిండు. నిలువకుంటే తోళ్ళొలుస్తనన్నా. వెనక్కు మళ్ళనన్న మళ్ళక్కుండ ఉరికిండు. మా తాతలకాణ్ణుంచి కూడ చింతలకు కాపలా పెట్టలే. దొరల చింతలని ఎవ్వడు తెంపెటోడు కాదు. ఊళ్ళెవరిండ్లనన్న లగ్గమన్న ఏమన్న అయితే

నన్నడిగేటోరు. తెంపు కొమ్మంటేనే తెంపుకొనేటోరు. ఇట్ల దొంగతనం ఎవ్వడు ఇయాల్టికి చెయ్యలేదు పంతులూ! కోసుకొన్నోడు పారిపోతే అ అదొక మాట. నిలవమంటే నిలవకుండా పోతాడు లంజకొడుకు. అక్కడికి నా మాట చెల్లదన్నట్లాయె. అదంతా ఎవ్వరు చూడకుండున్నా బాగుండేది. కంసలి బ్రహ్మయ్య చూచిండు, ఊరంత చాటిండు. పీరిగాడి తోలు వలవాలె, నేను నిద్రపోవాలె. యాడికి పోతడు గాడ్దికొడుకు. కరణం వెంకట్రావు నన్ను కమ్జోర్[55] చెయ్యాలనుకుంటున్నడు. అట్లనే కరణంతో సుత చెప్పలేదు. నువ్వంటే ఎత్మెనా[56] నుండబట్కొచెబితాన్న" అన్నారు రెడ్డిగారు.

శ్రద్ధగా విన్నాడు పాణి. వయొలిన్ వదిలి రెడ్డిగారి ముందు కుర్చీలో కూర్చుంటూ అన్నాడు:

"దొరవారూ! మీరు నాకు ఎంతో మేలు చేస్తున్నారు. మీ అన్నం తింటున్నాను. అలాంటప్పుడు మీ శ్రేయస్సు వాంఛించడం నా ధర్మం. ఒక మాట చెపుతాను. లోకంలో మేలుకోరి నిష్ఠురం అయినా శ్రేయస్సు కొరకు మాట చెప్పేవారు అరుదు. 'అప్రియస్యతు పథ్యస్య వక్తాశ్రోతాచ దుర్లభః' అన్నాడు వాల్మీకి. 'హితం మనోహారంభ దుర్లభం వచః' అన్నాడు భారవి. హితకరం అయిన మాట ఎప్పుడూ తీయగా ఉండదు. తీయగా లేనిమాట చెప్పేవారూ, వినేవారూ లభించడం దుర్లభం. 'చింతకాయల కోసంగానూ మీరు మనస్సును క్షోభ పెట్టుకోవడం మంచిది కాదు. పీరిగాణ్ణి లాక్కొచ్చి చావకొట్టడం వల్ల ప్రయోజనమూ లేదు. వాడూ బుద్ధిపూర్వకంగా చేయాలని దొంగతనం చేసి ఉండడు. మీరంటే ఉన్న భయంతో పారిపోయి ఉంటాడు. 'చింతకాయలు' అతి చిన్న విషయం. దీనికోసం తాము చిక్కుల్లో ఇరుక్కోవడం మంచిది కాదని నా మనవి."

'హు బోడిముండకు దండం పెడ్తే నావోలెనే ఉండమని దీవించిందట. ప్రభువులు, ప్రభుత్వం వారి గౌరవం నీకెట్ల ఎవరిక్కైతది' అంటూ కోపంగా లేచిపోయారు రెడ్డిగారు. సారంగపాణి మనసు చివుక్కుమంది. తాను దొర మేలుకోరి చెపుతే 'బోడిముండ' అంటాడా అనుకున్నాడు. బాధపడ్డాడు. తనను తిట్టుకున్నాడు, దొరను తిట్టాడు మనసులో.

'పేదవాని మాట పెదవికి చేటు.'

× × ×

పెద్దగా చదువుతూ రోజ్నామ్చా[57] రాస్తున్నాడు కరణం.

'గామం సివార్‌పై కావల్కార్ గస్తీ[58] తిరుగగా తమామ్[59] ఖైరియత్[60]

జనన మరణములు కాలేదు.

బందెకు జాన్‌వర్లు[61] రాలేదు.

గ్రామానికి మూసాఫిర్లు[62] రాలేదు.

సునార్లు[63] సోనా గలాయించలేదు[64]

చోరీ[65], సర్కా[66] జరుగలేదు.

బద్మాషులంతా హాజరున్నారు.

ఖరీద్, పోరోక్త్[67] జరుగలేదు.'

అది పూర్తి అయ్యేదాకా నుంచొని నమస్కరించాడు పాణి, కరణంకి.

'వచ్చినావు శానసేపైందా? కూచో' అన్నాడు. పాణి కూర్చున్నాడు.

వయొలిన్ కేసు పట్టుకొని వచ్చిన ఎంకటి, అది అక్కడ పెట్టి వెళ్ళిపోయాడు.

"బాగా పాడ్తవట?" అడిగాడు కరణం ఉబుసుపోకకు అన్నట్లుగా.

'ఏదో మీ దయ"

'ఆహా, దొరవారు మెచ్చుకున్నరంటే......'

'అది వారి దయ'

'ఆయనకు కోపం వచ్చినా, మెహర్బానీ[68] వచ్చినా అంతే' వెటకారంగా అన్నాడు.

'పాఠం ప్రారంభిస్తే ..... ' మాట మార్చడానికి అన్నాడు పాణి.

'తాయారు స్నానం చేస్తున్నది. మినిట్ల[69] అయిపోతది. తాయారు శాన హుషారైంది. ఇట్ల చెప్తుతే అట్ల వప్పచెప్తుతది. కాలు కాస్త కుంటికాని రంభే అనుకో! ఆ కాలొక్కటుంటే మూడులోకాలు ఏలేదనుకో!'

పాఠం చెప్పించుకునే దాని అందాన్ని గురించి వివరించాల్సినపనేమిటో అర్థం కాలేదు పాణికి.

'అవిటికీ, అందానికీ ఏం సంబంధమండీ? అవిటివాళ్ళు అనేకమంది అందంగా వుంటారు. బెజవాడలో ఒక గుడ్డమ్మాయిని చూచాను. ఎంత అందంగా ఉందంటారు! ఇప్పటికీ నా కళ్ళలో ఆడుతూంది. ఆ అమ్మాయికి కళ్ళు లేవని గ్రహించలేం. గాజుకళ్ళు పెట్టుకుంది. చూడలేదనేగాని చూపున్న దానిలాగానే కనిపిస్తుంది......'

'ఏందేందీ, కండ్లుంటయికాని కండ్లగపడవా? చిత్రం! అయితే మా తాయారుకు కాలొచ్చే ఉపాయం ఉన్నదంటావా?'

"చూస్తేగాని......"

ఇంట్లోంచి పిలుపువస్తే కరణం ఇంట్లోకి వెళ్ళాడు. తిరిగివచ్చి పాణిని లోనికి తీసికెళ్ళాడు. గదిలో చిరుచాప పరచివుంది. అక్కడక్కడ పుల్లలు, గడ్డిపరకలు పడివున్నాయి, పిట్టలు గూళ్ళు కట్టుకోవడానికి తెచ్చినవి అయ్యుంటాయి. చాపమీద చక్కగా ముస్తాబై కూర్చొని ఉంది తాయారు. కరణం చెప్పినట్లు రంభేమీ కాదుకాని, ముక్కూ, ముఖమూ బాగానే ఉన్నాయి. తండ్రి ఆదేశాన్ని అందుకొని చేతులు జోడించి నమస్కరించింది. పాణిని నఖశిఖపర్యంతం ఒకసారి కొలుస్తున్నట్లుగా తలెత్తి దించేసింది.

'ఎట్లున్నది?' అడిగాడు కరణం.

ఆ ప్రశ్న ఏహ్యంగా కనిపించింది పాణికి. తండ్రి అయినవాడు అడగరాని మాటలా ఉంది. కరణం తాయారు తండ్రేనా అనే సంశయం రాగా ఒకసారి అతని ముఖం చూచి, 'కాలు కాస్త కుంటికాని-' రంభలా ఉంది అనే పాఠం అప్పగించాడు.

కరణం నవ్వాడు 'భలేటోనివే, కుంటని నీకెట్లెరిక?' అని అడిగాడు.

నిజంగానే తాయారు కాలు కనిపించడం లేదు. చీర కప్పుకొని కూర్చుంది. వాస్తవంగా అవిటిగాదేమో! తానలా అని పొరపాటు చేశానేమో అనుకొని కరణం మాట గుర్తుకు తెచ్చుకొని 'మీరే అన్నారు కదండీ?' అన్నాడు.

'ఆ అట్లను, చెప్తేగాని తెల్వదు కుంటని' అని, 'తాయారూ ! లేచి నిలబడు' అని ఆదేశించాడు కరణం.

రెండుచేతులూ నేలకు ఆనించే లేచింది. నుంచుంటే ఒకవైపు కాస్త వంగినట్లుంటుంది. కొద్దిగా కురచకూడా.

'జర నడు!' ఆదేశించాడు తాయార్ను కరణం.

కాస్తగెంతుతూ, ఒక చేత్తో అవిటికాలు పట్టుకొని నడిచింది.

'ఎట్లున్నది?'

ఏం చెప్పాలి తాను? ఏమిటా ప్రశ్న? 'కాలు కాస్త అవిటి...' అని కరణం పారం కరణానికే అప్పగించాడు.

'బాగైతదంటవా?'

'ఇప్పుడిప్పుడే ఒకరి అవయవాలు ఒకరికి అమరుస్తున్నారట డాక్టర్లు. కాని మనదేశంలో కాదు- ఆమెరికాలో!'

'గట్టోనివే! నీకు దునియంత[70] ఎరికేనట్లున్నదే.'

ఏదో మీ దయ. కొన్ని సంవత్సరాలైతే మన దేశంలో కూడా కావచ్చు. అప్పుడు అవిటితనం పోవచ్చు.'

కరణం ఒక నిట్టూర్పు విడిచి 'సరే, దాని నసీబెట్లున్నదో[71]' అని నడిచాడు.

తననూ, తాయార్నూ గదిలో వదిలి వెళ్ళిపోయాడు కరణం. అతని ప్రవర్తన ఎందుకో వింతగా తోచింది పాణికి.

'సంగీతమంటే ఇష్టమా?' అడిగాడు పాణి.

తలెత్తి ముఖంలోకి చూచింది.

'సంగీతమంటే ఇష్టమా?'

'అంటే ?' గొంతు దురుసుగా ఉంది.

'పాట నేర్చుకుంటావా?'

'నువ్వు నేర్పిందల్ల నేర్చుకొమ్మన్నడు నాయన.'

'సరి' అని సరళి వరుసలు ప్రారంభించాడు.

వెళిపోయేప్పుడు కరణం కనిపిస్తే నమస్కరించి శెలవు కోరాడు.

'ఎట్లున్నది?' మళ్ళీ అదే ప్రశ్న.

"బాగానే ఉంది, మొదటిరోజే కదా! 'అనగనగ రాగ మతిశయిల్లుచునుండు' అన్నాడు వేమన. క్రమంగా వస్తుంది."

"సరే నడువ్, నారయ్యగారింటికి తీస్కపోత" అన్నాడు కరణం.

ఇద్దరూ నారయ్య ఇంటికి వెళ్ళారు. నమస్కారం చేసి ఇద్దర్నీ బల్లమీద కూర్చుబెట్టాడు నారయ్య. లోనికివెళ్ళి బైటికివచ్చి 'పాఠం శురుచేస్తరా'' అన్నాడు పాణితో నారయ్య. చెప్పులు వదిలి పాణి లోనికి వెళ్ళాడు. వసారాలో చాప పరిచి వుంది. పాణిని దానిమీద కూర్చోమని " సీతా!" అని పిల్చాడు నారయ్య.

సీత వచ్చి నమస్కారం చేసి కూర్చుంది. ప్రక్కనే ఆమె తమ్ముడు వచ్చి కూర్చున్నాడు. నారయ్య కరణం దగ్గరికి వెళ్ళిపోయాడు.

బక్కపల్చగా, పొడుగ్గా ఉంది సీత. కోలముఖం, పల్చని చెంపలూ, పెదవులూ, చిన్న చుబుకం, కొద్దిగా చిన్నగా వున్నట్లుకనిపించే ముక్కూ, పెద్దకళ్ళు, చామనఛాయ - మామూలు తెలుగు కన్నెలా ఉంది సీత. నడకలో మాత్రం వయ్యారం ఉంది. వయసే అల్లాంటిది.

'సంగీతమంటే ఇష్టమా?' అడిగాడు పాణి.

అవునన్నట్లుగా తల ఊపింది.

'అయితేసరి' అని సరళి వరుసలు ప్రారంభించాడు.

ఆ రాత్రి రెడ్డిగారు వస్తారనుకోలేదు పాణి. క్రితం రాత్రి అంత కటువుగా మాట్లాడి వస్తాడా అనుకున్నాడు. తన మేలు కోరుకునేవాడెవడూ ధనమదాంధులకు నీతులు చెప్పరాదు. వంత పాడాలి అనుకున్నాడు. ధనం, అధికారం ఉన్నవాడు తాను తలచేదీ, చెప్పేదీ, చేసేదీ సరియైనదనుకుంటాడు. అది సరికాదని చెప్పేవాడు పిచ్చివాడనుకోవడమో, వాడిమీద పగ తీర్చుకోవడమో చేస్తాడు. రావణుడు విన్నాడా? భీష్మాదులు యుద్ధం ప్రమాదకరమని ఎన్ని నీతులు చెప్పారు దుర్యోధనునికి! విన్నాడా? వినకపోగా అందర్నీ తన శత్రువుల్ను చేసుకున్నాడు. అధికారం కంటికి ఒక పొర కప్పేస్తుంది. అది వాస్తవాన్ని చూడనివ్వదు. తాను పట్టిన కుందేలుకి మూడేకాళ్ళంటుంది. అబ్బ - మూడుకాళ్ళతో ఎంత బాగా గెంతుతూందండి కుందేలు అనాలి. కాని, కుందేలుకు మూడుకాళ్ళుంటాయా! అంటే చచ్చాడన్నమాటే. వెనక ఒక ప్రభువు 'గోడ ఊగుతూంది చూశారా?' అన్నాట్ట. ప్రక్కనున్న వారంతా 'మహాప్రభూ! గోడ ఉయ్యాల్లా ఊగుతూంది' అన్నారట. దారినే వెళ్ళే ఒక ప్రయాణీకుడు 'మహాప్రభూ వీరంతా మిమ్మల్ని పిచ్చివారిని చేస్తున్నారు. గోడ ఊగడం లేదు, ఊగదు' అన్నాట్ట. ప్రభువు దగ్గరే ఉన్న ఒక భటున్ని పిలిచి అతని తలనరికెయ్యమన్నాట్ట! అది ప్రభువుల చిత్తం! నేను రెడ్డిగారికి వ్యతిరేకంగా మాట్లాడాను. వెళ్ళి, మీరు చెప్పిందే సరైదండీ అని అంటే ... ... ఎలా వుంటుంది? కాని ఆ మాటంటే ఏం తిప్పలో! ఇప్పటికి అయినా గ్రహించాడేమో వాస్తవం? నేనా మాట చెబితే మళ్ళీ తలక్రిందులవుతుంది! అనుకుంటూ ఉండగానే రెడ్డిగారు "పంతులూ-కరణం ఇంటికిపోయినవా?" అని అడుగుతూ ప్రవేశించారు. రాత్రి ఉదంతం మరచిపోయారు రెడ్డిగారు. మళ్ళీ దాన్ని ప్రస్తావించడం బాగుండదని, 'వెళ్ళానండీ, పాఠం కూడా ప్రారంభించాను' అన్నాడు పాణి.

"నారయ్య గారితో సుత కరణమే చెప్పతనన్నడు?"

"ఆ పాఠం కూడా కుదిరిందండీ! సీతకూ పాఠం ప్రారంభించాను"

'కరణం విషపు మనిషి, జర్ర హుషార్ గుండాలె!'

కరణం సుమారు ఇలాంటి మాటే అన్నాడు. వీరిద్దరి నడుమ ద్వేషం ఉందని గ్రహించాడు పాణి. ఇద్దరికీ మన్ననగా ఉండడం కత్తిమీద సాములాంటి దనుకున్నాడు. ఇది అధికార ద్వేషం. ఒకరిని మించాలని ఒకరు పందాలు వేసుకోవడం. అమాయక ప్రజలు వేలమంది ఒకటి అవుతే కావచ్చు కాని అధికార దాహం గలవారు కలవడం అసాధ్యం అనుకున్నాడు.

'నాకు ఆయనతో వ్యవహారం ఏమిటండీ, పాఠం చెప్పుకొని వచ్చేవాడికి?'

"అహ జర్ర ఎహత్యాత్[72] గుండాల్నని చెపుతున్న!"

"చిత్తం అలాగేనండీ!"

"కుంటిదాన్ని నా బిడ్డ రంభ అంటుంటడు కరణం, నిజమేన?"

"పెద్ద అందకత్తేంకాదు కానీండి, ముక్కూ, ముఖమూ బాగానే ఉంటాయి."

"కరణం అట్లెందు కంటడు?"

"ఎవరి కూతురు వారి కలాగే కనిపిస్తుందండి."

తన మంజరి కూడ అంతేనా అనుకున్నాడు రెడ్డిగారు.

"ఆవిడ కరణంగారి కూతురేనాండి?" అడిగాడు పాణి.

"నీకూ షుబా[73] అయినాది. ఆవలిస్తే పేగులెంచె టట్లున్నవు! అదంత పెద్ద కతలే. సరేగాని,

పాట పాడు"

"సావిరహే తవదీనా..." పాడాడు పాణి.

"పాట శాన బాగున్నది పంతులూ! నిద్రొస్తుంది" అని లేచారు ఆవులిస్తూ, వళ్ళు విరుచుకుంటూను. వెళ్ళిపోతుంటే గుమ్మంపక్కన పళ్ళెం పట్టుకొని నుంచున్న వనజ కనిపించింది.

"ఎప్పటినుండి నిలబడ్డవ్?" ఉరిమారు రెడ్డిగారు.

"ఇప్పుడే వచ్చిన!" నసిగింది వనజ.

"అన్నం ఆడ పెట్టిపోక ఎందుకు నిలబడ్డవ్?"

"మీ... మీ... మీరున్నరని."

"హు...." అని వెళ్ళిపోయారు రెడ్డిగారు.

వాస్తవానికి వనజ వచ్చి చాలా సేపైంది. పాట వింటూ అలా నిల్చిపోయింది. పాటలోని పదాలు తనకేమీ అర్థంకాలేదు. కానీ, అతని పాట ఆమెను ముగ్ధురాల్ని చేసింది. పాట ముగిసిం తరవాత అన్నం అక్కడ పెట్టి వెళ్ళిపోదామనుకుంది. కాని, దొర ఉండగా వెళ్తే పంతులు తనను మాట్లాడించడు అనుకొని అక్కడే నుంచుండిపోయింది.

గుమ్మం దగ్గిరికి వచ్చి రెడ్డిగారిని సాగనంపిన సారంగపాణి సర్వం గ్రహించాడు. రెడ్డిగారు మెట్లు దిగిపోయారని ధ్రువపర్చుకొని "రా... వనజా!" అన్నాడు. ఆమె గుండెలో వెన్నెల కాసింది.

పళ్ళెం కావిడి పెట్టెమీద పెట్టి నుంచుంది వనజ.

"కూర్చో వనజా!" అన్నాడు ముందున్న కుర్చీ చూపుతూ.

ఇంద్రుని అర్ధాసనం లభించినట్లు పొంగిపోయింది. అయినా కూర్చోలేదు. తనను వారితో సమంగా కూర్చోపెట్టుకొని మాట్లాడిన వారున్నారా? అబ్బ! పాణి ఎంత మంచివాడు! తన పేరు బావుందని తాను అందంగా ఉందనీ చెప్పినవాడేకాక తాను ఇంతకాలం నుంచీ పశువులా జీవిస్తున్నానని తనను గ్రహించేట్లు చేసినవాడు అతనే. అతడు తనకు దేవుడు. అతని సరసనా కూర్చోవడం?

"ఉహు" అన్నది.

"వనజా! తాయారు తెల్సా నీకు?"

"ఎవరూ?" అన్నట్లు కళ్ళెత్తి చూసింది.

"కరణంగారి కూతురు."

ఆ మాట వినగానే గుండెలో ఒక పెద్దరాయి పడినట్లూ, ఎదుట దయ్యం నుంచున్నట్లూ వణికిపోయింది వనజ.

"ఎందుకు అలా అయినావు?"

ఎందుకో ఆమెకూ తెలిదు.

"ఊరికేనే" అన్నది సంభాళించుకొని. "కుంటిదా?" అని అడిగింది. అసహనం కనిపించింది త్వరలో.

"అవును. ఎలాంటిది?"

"బాగా చూడలే. ఊళ్ళోరు పోరి మంచిదికాదంటరు. కరణప్పంతులు శాన సంబంధాలు తెచ్చిండు. లగ్గానికి ఎవ్వరూ చేసుకోనన్నరుట. కుంటిది గయ్యాళి దంటరు. నీకెందుకు?"

"పాఠం చెపుతున్నా నాఅమ్మాయికి."

వనజ ఒళ్ళు జల్లుమన్నదనే విషయం గ్రహించాడు పాణి.

"చెప్పకుంటేమైతది?"

"ఎలా మరి? వచ్చింది పాఠాలు చెప్పుకొనేందుకేగా?"

వనజకూ, తాయారుకూ స్పర్ధలున్నాయా అనుకున్నాడు.

"అసలు తాయారు కరణం కూతురేనా?"

"ఊహు... కాదు." ఉత్సాహంగా జవాబు చెప్పింది వనజ. ఈలోగా ఎంకటి పిలుపు విని పరుగెత్తింది.

సారంగపాణికి అంతా విచిత్రంగా అనిపించింది. ఎవరూ గుండెవిప్పి మాట్లాడరు. రెడ్డిగారు ఒక్కసారి రాక్షసుడిగా మారిపోతాడు. కరణం విచిత్రమైన మనిషి ప్రతి మాటలోనూ ఏదో అంతరార్థం ఉందన్నట్లు మాట్లాడ్డానికి ప్రయత్నిస్తాడు. వనజ ఏదో కొత్త గుండెవచ్చి రొమ్ములో చేరినట్లు మాట్లాడుతుంది. వనజకు తాయారంటే ద్వేషం ఎందుకో అర్థం కాలేదు. సీతను తల్చుకుంటే ఈ అశోకవనంలో ఆమె ఒకతే సీతలా కనిపించింది. ఎంత సిగ్గు! ఎంత అణకువ! ఎంత శ్రద్ధ! ఎంత తెలివి! కోటలో తనింతవరకు చూడని ఇంకో రెండు ప్రాణులు తెరచాటున ఉన్నాయి. వాటిల్లో ఎంత విషం ఉందో? ఎంత అగ్గివుందో! అనుకున్నాడు.

## 6

**ఒ**కనాటి రాత్రి రెడ్డిగారు పాట వినడానికి వస్తే తాయారుకు వయొలిన్ తేవడానిగ్గాను తాను పట్నం వెళ్ళనున్నానని చెప్పాడు పాణి. కరణం తన వాడకానికి ఒక వంద రూపాయ లిచ్చాడని కూడా చెప్పాడు.

"కరణం నూర్రూపాయిలిచ్చిండులే?" దాని వెనుక ఏదో నాటకం తప్పక ఉండి ఉంటుందన్నట్లుగా మాట్లాడారు రెడ్డిగారు.

"అవునండీ! ముందు వారే వెళ్ళివస్తామన్నారు. తర్వాత 'వాద్యాల మంచి చెడ్డలు నాకేం తెలుస్తాయి? నువ్వే కొనుక్కురా' అని డబ్బిస్తూ బట్టలూ, తల మసాలా, పోకచెక్కలూ మరేవేవో వ్రాసిచ్చి 'పంతులూ! పట్నం వెళ్తున్నావు. నీకూ ఏదేనా కొనుక్కోవాలని ఉంటుంది. ఇదిగో ఈ నూరు రూపాయలు నీ ఖర్చుకు' అని వేరుగా ఇచ్చారండీ. రేపు ఉదయం వెళ్దామనుకుంటున్నా!"

పాణి మాటలు వింటూనే రెడ్డిగారు ఆలోచన్లో పడిపోయారు. పంతుల్ను తిప్పుకోవడానికి ప్రయత్నిస్తున్నాడా కరణం? అతని ద్వారా తన రహస్యాలు బైటికిలాగాలని చూస్తున్నాడా? కాకుంటే నూరురూపాయిలిస్తాడా ఒక్కసారే. అదీ కరణం!

"పంతులూ! ఎట్లనన్న పట్నం పోతున్నవు కదు. ఇంకో ఫిడేలు తీస్కరా."

"ఎందుకొరకో తెలుస్తే ఎట్లాంటిది తేవాల్నో తెలుస్తుంది కదండీ!"

"అట్లనా? చిందొరసాని సంగీతం నేర్చుకుంటనంటున్నది. నేనింక తప్పీయ[74] చెయ్యలే కానియ్యి, వాయిద్యం ఉంటే తప్పా యింట్ల?"

"చిందొరసానికి సంగీతం చెప్పించ దలుచుకుంటే వయొలిన్ వద్దండీ! ఫిడేలు కాస్త తక్కువరకం వాద్యం. గంభీరత ఉండదు. పూర్వం రాణులు వీణ నేర్చుకునేవారండీ! వీణ ముందు కూర్చున్నా గౌరవంగానూ, హుందాగానూ ఉంటుందండీ! అందమైన ఆడవారు వీణ ముందు కూర్చుంటే సరస్వతిలా

ఉంటారండీ! సరస్వతికి వీణాపాణి అని పేరు కదండీ, తెమ్మంటే చక్కని వీణ తెస్తా. కాదంటే...'

రెడ్డిగారు ఎన్నడూ వీణ చూడలేదు. కాని వీణముందు కూర్చుంటే మంజరి సరస్వతిలా వుంటుందని విని "అచ్చా అదేతే" అని "దొరసాన్లను ఏం కావాల్నో అర్సుకొని[75] చెప్పుతా. నాకు మాత్రం గాజు బిందెలు కావాలే పది. కుండలంత పెద్ద గుండాలే. అబిద్ రోడ్‌లో దొరుకుతాయనుకుంట. పత్తర్ ఘట్టిల మంచి జరీ చీరలు దొరుకుతాయి. నవాబులు కొనే దుకాణం ఉన్నది. ఆణ్ణించి నాల్గుచీరల్తే. రెండు చిందొరసానికి, రెండు పెద్దొర్సానికి. ఎసువంటియి తెస్తవో మెప్పించలే వాండ్లను, ఆణ్నే "షాహీహల్వాయి" దుకాణాలున్నాయి. హుజార్‌కు[76] మిరాయి పోతదాణ్ణుంచి. ఆణ్ణుంచి అయిదు సేర్ల మిరాయితే. మక్కా మసీదు ముంగల పక్కలకు వెండి రేకులు, బంగారం రేకులు అమ్ముతరు. అవి శాన మంచివి ఒంటికి. పది తులాల వెండి రేకు, ఒక తులం బంగారం రేకు తేవాలే. మరింకేం కావాల్నో అడిగి చెప్పుతా" అని వనజను కేకవేశారు. "వనజా! దొరసాన్లతో చెప్పు పంతులు రేపు పట్నం పోతాండని, ఏమెంకావాల్నో రాసియ్యమంచెప్పు" అని పాణి వేపు తిరిగి-

"పట్నంల హుషార్ గుండాలె. మంచి హోటల్ల దిగు. డబ్బు చేతినిండ కర్చు చెయ్యి. ఇన్నూరు రూపాయలు వాడుకో సరేగాని, జల్దేరావాలే. టెసనుకు సవారి కచ్చడం[77] ఎప్పుడు తోలమంట?" అన్నారు.

ఇది వింటూనే ఉక్కిరిబిక్కిరైనాడు పాణి.

"చిత్తం. అలాగే వస్తానండి. రేపు వెళ్తున్నాగా - రెండు రోజులు పట్నంలో ఉంటా. నాలుగు సినీమాలు చూస్తా. సినీమాలంటే నాకు చెడ్డపిచ్చండీ. ఏనాటికైనా సినీమాల్లో పాడాలి. మీ దయ ఉంటే మూడోనాడు బైల్దేరతానండీ! నాలుగోనాడు ఉదయం పంపించండి కచ్చడం."

ఇంతట్లోకి డబ్బూ, మంజరి వ్రాసిచ్చిన జాబితా తెచ్చిచ్చింది వనజ. అవి రెండూ పాణికి అప్పగించి, జాగ్రత్తగా వెళ్ళిరమ్మని చెప్పి రెడ్డిగారు వెళ్ళిపోయారు.

అ తరువాత భోజనపు పళ్ళెం తీసుకొని వచ్చేసింది వనజ. పళ్ళెం కావిడి పెట్టెమీద పెట్టి "పట్నం పోతున్నరట. చెప్పుసుతలేదు[78]" అన్నది చిరుకోపంగా.

"నాకుమాత్రమేం తెల్సు? కరణంగారు స్వయంగా వెళ్తామన్నారు. ఇవ్వాళ ఉదయమే నన్ను వెళ్ళమన్నారు."

"అయినా నాకేమిటికి చెప్పుతరుగని-తాయారుకూ, సీతకూ చెప్పుతరు. దాసీదాన్ని..."

"వనజా! అంతకోపమా?" అని చెయ్యిపట్టుకొని లాగి పక్కన కూర్చోపెట్టుకొని, "తాయారంటే నాకిష్టమనుకున్నావా? అసహ్యం. పిచ్చి పిచ్చిగా చూస్తుంది. పిచ్చి పిచ్చి పనులు చేస్తుంది. ఇక సీత పెళ్ళయిన పిల్ల గదా, నువు అలా అనొచ్చా? కోపం వచ్చినా ఎంత అందంగా ఉంటావు!" అన్నాడు, వంచిన ముఖాన్ని చూడ్డానికి తాను వంగుతూ. వనజ తలెత్తింది. కళ్ళు ఎర్రగా వున్నాయి. "ఇప్పుడు నీకళ్ళు నిజంగా తామర రేకులే వనజా!" అని, "నీకోసం ఏం తెమ్మంటావు పట్నం నుంచి?" అని అడిగాడు.

కోపం దిగిపోయింది. దొర ఎన్నిసార్లు పట్నం వెళ్ళలేదు! ఎందరెందరికి ఎన్నెన్ని వస్తువులు తేలేదు? తన నెప్పుడైనా అడిగాడా-ఏం కావాలని? వాస్తవంగా తనకు కావలసిందేమిటి? నీలి ఆకాశపు రంగుచీర కట్టుకోవాలని తాను చాలాకాలం నుంచి అనుకుంటూంది? అట్లాంటి చీర తెచ్చి పెట్టమందామనుకుంది. కాని, ఎంత ఖరీదు అవుతుందో? అదీకాక, పంతులు తనకు చీరతెచ్చి పెడ్తే దొర ఏమనుకుంటాడు? దొరసానులు ఏమనుకుంటారు? పంతులు వాళ్ళ దృష్టిలో చులకనై పోతాడు. తనకు చీర లేకున్నా పరవాలేదు, పంతులు గౌరవానికి లోపం రాకూడదు అనుకున్నది.

"గులాబిపూలు" జవాబు చెప్పింది.

"ఉష్ ఇంతేనా? గంపెడు తెస్తా. సరేనా?"

తల ఊపింది సరేనని. "మళ్ళెప్పుడొస్తరు" అడిగింది.

"మూడు రోజులకు"

"మూడొద్దులకా?"

"ఎంతలో వెళ్ళిపోతాయి మూడురోజులు?"

వనజ మరిమాట్లాళ్ళేదు. చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయింది. మంజరి వ్రాసి ఇచ్చిన పట్టిక చూచాడు పాణి. ముత్యాల్లా ఉన్నాయి అక్షరాలు. అక్షరాలు పట్టిచూస్తే మంజరి అందకత్తె కావాలి. బహుశా మంజరిది బంగారుఛాయ కావాలి. ఆ రంగువాళ్ళు నీలిచీర కట్టుకుంటే అందంగా వుంటారు. మబ్బుల్లో మెరుపులా ఉంటారు. కాబట్టి నీలాకాశపు రంగుచీర ఒకటి మంజరికి తేవాలి. లేతరంగు చీరలు తేవాలి. ఎలాంటి చీరెలు తేవాలంటే - వాటిని చూచి తన ఎన్నికకు ఆవిడ మురిసిపోవాలి. గులాబులు రెడ్డిగారు ఎన్నడూ తేనన్ని తేవాలి అనుకొని మంజరి వ్రాసిచ్చిన జాబితా చదివాడు.

"కుంకుమ రంగు రంగులది! తలనూనెలు, తలమసాలా, అత్తర్లు మొగిలి, గులాబి, చమేలి, మల్లే, మట్టి."

ఇంకా ఎన్నో వున్నాయి. అన్నీ అలంకరణ వస్తువులే. అన్నీ పాతవే. అందులో స్నో, పవుడర్, లిప్‌స్టిక్, వగైరాల్లేవు. ఆధునిక అలంకరణలన్నీ తేవాలనుకున్నాడు. ఏదో కొత్తదనం చూపించాలనుకున్నాడు. అందర్నీ మురిపించాలనుకున్నాడు. అవే ఆలోచనల్లో పడుకొని నిద్రపోయాడు.

తెల్లవారుజామున వచ్చి గదితలుపు తట్టిలేపాడు ఎంకటి. "గాడికి యాళ్ళైతాంది[79]. ఎల్లిగా డొచ్చిండు. కచ్చడం తయారైంది. మల్లిగాడు సామానులు సరుదుకుంటాండు. నీలుకాగి తయారుగున్నై, లేచి స్నానం చెయ్యి" అన్నాడు. పాణి లేచిచూస్తే ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

"ఇగో యాప్పుల్ల, పండ్లు తోముకుంటార్కల్ల మల్లొస్త" అని వెళ్ళిపోయాడు ఎంకటి.

పుల్ల నోట్లో వేసుకొని గదినుంచి బయటికి వచ్చాడు. వరండాలో ఉన్న పిట్టగోడనానుకొని పండ్లు తోముకుంటున్నాడు. ఊరు స్పష్టంగా కనిపిస్తొందక్కణ్ణుంచి. పొగమంచు నిండింది ఊరినిండా. ఆ ఊరికి గడీ ఒక కోటలాగుంది. గడిముందు ఒక పెద్ద పెంకుటిల్లుంది. అది పశువుల దొడ్డి! దానికి ముందరే రెండు పెద్ద వేపచెట్లున్నాయి. వాటిమీద అరుగులు కట్టివున్నాయి. అవి రెడ్డిగారి కచ్చేరీలు. అక్కడ కూర్చొనే వారు తగాదాలు పరిష్కారం చేస్తుంటారు. శిక్షలు విధిస్తుంటారు. గడి పక్కనుంచి వెళ్ళే తిన్నని బాటన వెళ్ళితే కుడివైపు ఒక పెంకుటిల్లుంది. అది సావిడి. అధికార్లు వస్తే దిగేచోటు. ఆ రాచబాటకు అటు ప్రక్కా ఇటు ప్రక్కా చిందరవందరగా గొందులున్నాయి. పైన చూచిన పెంకుటిల్లు తప్ప మిగతావన్నీ గుడిసెలే. అక్కడక్కడా చింతచెట్లూ, వేపచెట్లూ, రావిచెట్లూ ఉన్నాయి. మొత్తంమీద లంకలాంటి ఈ గడీ తప్పితే సుమారు మిగతా ఊరంతా పూరిగుడిసెలే - ఏ ఒకటో రెండో తప్ప. ఈ గడీ ఒక మహా వటవృక్షం. దీని నీడన ఏ గడ్డీ మొలవడానికి వీల్లేదు. ఒక ప్రాణికోసం కాకుంటే ఒక్క కుటుంబం కోసరమే ఈ వూరంతా వెలిసినట్లుంది. ఊరంతా రెడ్డిగారి దయా ధర్మాలమీద జీవించాల్సిందే. ఆయన పెడితే తినాలి. కొడితే పడాలి. ఆయన దొర - ప్రభువు! ఆయనదే శాసనం, మరే శాసనానికి ఆయన లొంగరు.

ఎంకటి వచ్చి స్నానానికి పిలుస్తే ఆలోచనల్లోంచి తేరుకొని గబగబా పండ్లు తోముకంటూ స్నానాల గదికి వెళ్ళాడు పాణి. గదికి తిరిగి వచ్చి బట్టలు వేసుకునేవరకు ఉపాహారపు పళ్ళెం తీసుకొని

వచ్చింది వనజ. అది చూచి ఆశ్చర్యపోయాడు పాణి. 'అంత తెల్లవారుజామున ఫలహారమా, వనజా!' అన్నాడు. చూస్తే వెన్నముద్ద, కొద్దిగా కారం, పెద్ద పెద్ద పూరీలు ఉన్నాయి.

"పట్నం చేరేటాల్కల్ల ఎంత పొద్దయితదో ఎరికేనా?"

"వనజా! నీ కెందు కింత శ్రమ?"

"కష్టమేమున్నది? నేనేమన్నా వండిన్నా? పెట్టినా? వండినోడు ఈరిగాడు. చెప్పింది దొరసాని, తెచ్చిందాన్ని నేను."

"వనజా! నువ్వెంత మంచిదానివి!"

వనజ కళ్ళు పెద్దవి చేసి చూసింది. "మల్లెప్పుడొస్తరు" అని అడిగింది.

"చెప్పాగా రాత్రి."

"జల్ది రాలేరా?"

"ఇంకా త్వరగానా?"

తలవంచుకొని గోళ్ళు గిల్లుకుంటూ "ఊ!" అన్నది.

"పిచ్చిదానా!" అని రెండుచేతుల్తోనూ బుజాలు పట్టుకొని "మూడురోజులేగా. నాలుగోరోజు ఇక్కడుంటా" అన్నాడు.

పాణి తింటుంటే వనజ నుంచుంది. మౌనంగా గడిచిపోయింది కాలం.

ఎంకటి వచ్చి "కచ్చడం తయారైంది. ఎల్తారా?" అన్నాడు. మెట్లు దిగుతే సవారి కచ్చడం సిద్ధంగా ఉంది. సవారి కచ్చడంలో మంచంమీద తెల్లని పరుపు పరచి ఉంది. రెండు పెద్దపెద్ద దిండ్లు పెట్టి వున్నాయి. చెప్పులు వదిలి బండెక్కి వెనక్కి తిరిగిచూస్తే వనజ నుంచొని వుంది. చాకలివాడు చెప్పులుతీసి బండ్లో మంచం క్రింద పెట్టాడు. గజ్జెలు ఘల్లుమని బండి కదిలింది. గేటు దాటేదాకా అక్కడే నుంచొని చూసింది వనజ.

బండి సాగిపోతూంది ఊళ్ళోంచి. కరణం ఇల్లూ, కోమట్ల ఇండ్లూ దాటింది. గుడిసెలవాళ్ళు జొన్నలుదంచుకుంటూ పాటలు పాడుతున్నారు.

"సువ్వన్న చుక్కల్లు రాజమామిళ్ళు - నా చేతిరోకండ్లు నల్లరోకండ్లు
చేయించు అన్నయ్యా చేవరోకండ్లు - వేయించు అన్నయ్యా వెండి పొన్నుల్లు
సువ్వని నే నొక్క పోటేసితేను - చుక్కలు పిక్కటిల్లు సూరన్న[80] కదలు
అస్పని నేనొక్క పోటేసితేను - ఆకసమ్ము కదలు ఆ రాజు కదలు
తమల పాకుల మీద వడ్లిండపోసి - రాచిలక పోచిలక వడ్లు దంతాము
రాచిలక దంచినవి రాసులడ్డాయి - పోచిలక దంచినవి పోగులడ్డాయి
రోకలి చిన్నాది, రోలు చిన్నాది - నాతోటి పోటేసే చెలియ చిన్నాది
రోకలికి రోటికి రెండు దండాలు - మమ్ముకన్న తల్లికి వెయ్యిదండాలు."

ఆ పాట పండితులు వ్రాసిపెట్టిందికాదు. ఎవరు వ్రాసిందో కూడ తెలియదు. పాడేవారికి సంగీతం రాదు. శాస్త్రం తెలియదు. అయినా ఆ పాట మార్గశిర మాసపు ఎండలా హాయిగా ఉంది పాణికి. పాట వినరాకుండా పోయి బండి ఊరుదాటితే బండి ముందుకు చూచాడు పాణి. బండి ముందు పరుగెత్తుతున్న ఒక మనిషి కనిపించాడు. అదొక అధికార చిహ్నం. అదొక లాంఛనం. ఎద్దులకంటే ముందు పరుగెత్తాలి వాడు. ఎద్దులు తరుముతుంటే పరుగెత్తాలి వాడు. ఆ ఎద్దులకు దొరికిన తిండి వాడికి దొరకదు. ప్రత్యేకంగా

సవారీ కచ్చడం కోసరమే పోషిస్తారు వాటిని. ఎప్పుడో నెల కొకసారి పనిపడుతుంది వాటితో. అలా తిని బలిసిన సవారీ ఎద్దులముందు ఈ మనిషి పరిగెత్తాలి.

"ఎందుకూ వాడలా పరిగెత్తడం?" అడిగాడు పాణి.

"దొరోరి బండి కాదుండి, మనిషి ఉరకకుంటే ఎట్లా? ఈ ఎడ్లేమన్న చెప్పిన మాటింటయనుకున్నా! బండీకిందెవరన్న పడి చస్తేట్ల?"

"వాడు పరిగెత్తకుంటే ఏమౌతుంది?"

"అమ్మో! బతుకుతాడుండి? తోల్లొల్లడుదొర! ఓసారేమైందనుకున్నరు. దొరను, దొర్సాన్నీ తీస్కపోతాన్న. ఇయ్యేం ఎద్దులుండీ. చచ్చింది కాని, దాని అమ్మ... జింకోలే ఉరికెడిదనుకోరి. ఇట్ల ముల్లు గగ్ర చూపిచ్చిన్నా చేతికి దొరక్కుండ ఉరికెడియండి మోటార్ గాడోలే[81]. చాకలైలగాడు ముంగలురుకుతాండు. జరదూరం పోయేటాల్కల్ల ఉర్కలేక చిన్నగ నడ్వసాగించాడనుకోరి. బండికి పరదలు[82] కట్టున్నయా, దొర చూడలేదుండి. లోపట్నుంచే అడిగిండుండి. "ఏమ్రా కచ్చడమేమో చీమనడ్కనడుస్తదీ" అని. "అయిలుగాడు నసుగుత నడుస్తాండు దొరా" అని చెప్పిన్నుండి. "ఉరకమను గాడ్దికొడుకును, ఏం చస్తాండా" అన్నడుండి దొర. "ఒరే అయిలుగా దొరురుకుమంటుండ్రా ఉరుకు" అని కూకేసిన్నుండి. జరదూరం ఉరికిండో లేదో మళ్ళ నిలబడ్డడుండి. ఇగ బండికూడ నిలబడ్డదనుకోరి. నీ బాంచను, బండి నిలపడంగనే పులై దిగిండనుకోరి దొర. నీకాల్మొక్త, కోపమొస్తే దొరమనిషి కాడుండి. శివమెక్కుతది. నాచేతినుంచి ములుగర్ర గుంజుకొని వానిమీదికి ఉరికిండనుకోరి. కడుపు కట్టుకుని కూకున్నోడల్ల నీబాంచనూ. దిగ్గునలేచి నిలబడ్డడుండి. "దొర కడుపుల్నొప్పి, నీగులాపోణ్నీ ఉరకలే"నని ఏడ్వసాగిండనుకోరి. దొరేమన్న ఇన్నడనుకున్నా! అబ్బ, ములుగర్ర తీసుకొని ఏం జబిరిండు, ఏం జబిరిండు[83]. ఇట్ల తోల్లాడొచ్చినయన్ని. ఆ డాడనే పడిపోయిండా, దొరొచ్చి బండి మల్పమన్నడుండి. బండి మల్పిన. మల్ల ఊల్లకే పోయినం ముంగల మనిషిలేక."

"అయిలుగాడే మైనాడు?"

"ఏమైతడుండి? నాలుగొద్దులు నవిసిండు[84] మల్ల బట్టలుత్కపోయిండు."

పాణికి చాల బాధ అయింది. బండి ముందు పరుగెత్తేవాణ్ణి పరిగెత్తొద్దందా మనుకున్నాడు. కాని, ఇవ్వాళ ఆపుతే ఆగిపోయేదా? అదొక శాసనం. అదొక అధికారం, అదొక ప్రభుత్వం. అది మార్చడం తనకు చేతనౌనా అనుకున్నాడు. వెనక్కు చూస్తే బెడ్డింగు, పెట్టె నెత్తిన పెట్టుకొని మరొక మనిషి పరుగెత్తుకుని వస్తున్నాడు. అది బండ్లో పెట్టకూడదూ?

మనిషి పరుగెత్తకుంటే ఏం అనుకున్నాడు.

అతనిమాట చెల్లుతుందా అక్కడ!

## 7

రెడ్డిగారు వంకరకర్ర పట్టుకొని పొలానికి వెళ్ళడానికి వరండాలోకి వస్తే గేటుదగ్గర నేలమీద కూర్చొని ఉన్న అహమ్మద్‌మియా లేచి నేలకు చేతులానించి ముఖానికి అంటించుకొని "దండంపెడ్త గులాపోణ్నీ" అన్నాడు.

"ఏమ్రా పుల్లిగ" అనబోయి "అహమద్‌మియాసాబ్ సలామ్" అన్నారు రెడ్డిగారు వెటకారంగా.

"ఏట్ల అహమద్ మియా, కాట్ల అహమద్ మియా యాడి అహమద్ మియా నుండి. పుల్లిగా

డనురి. నీ కాల్మొక్త. బుద్దిలేక తురకల్లి కలిసినం. పుల్లిగా డనురి నీ బాంచిను వాలిచ్చిన గుడ్డలన్ని కాలబెట్టినం, పేర్లు మార్చుకున్నం బాంచిను. నీ గులాపోల్లం ఎట్లనన్న మల్ల కులంల కలుపురి" అని నేలమీద పడి దండం పెట్టాడు. చివరి పదం అనేప్పుడు గొంతు జీరవోయింది.

"ఏమైందిర గట్లేడుస్తాను? తుర్కమురిపెం తీర్నాది? లంజకొడుకులు, అప్సర్ల[85] మైతమనుకున్నర్లే చావండట్లనే. ఆ తుర్కోల్లకాడికే పోయి ఫిర్యాద్ చేస్కోపో."

"అట్లంటే ఎట్ల బతుకటం నీ బాంచను. నీ పాదాలకాడ పడుండే టోండ్లం. ఎట్లనన్న చేసి మల్ల కులంల కలుపురి గులాపోణ్ణి. నా తోలొలిచి చెప్పులు కుడ్త."

"ఇంతల్నే ఏమైందిరా?"

"ఎట్ల చెప్పం దొర! తుర్కల్ల చేర్నం కాదుండి. ముత్తాలమ్మకోపమొచ్చి గూడెంల పది గొడ్లను, నలుగురు మనుషుల్ను మింగిందుండి..."

ఇంకేదో చెప్పబోతూండగానే "లగ్గమైనాదిర బిడ్డది" అడిగారు రెడ్డిగారు.

"హయ్యో నీ కాల్మొక్త లగ్గమాడిదుండి? లగ్గం చేసుకోమన్నరు కదుండి పిలగాణోలు, మేం తురకల్ల కలిసినమని"

"తుర్కపోరడు దొర్కలే యాణ్ణన్న?"

" అందర మొకటేనని నీతుల్చెప్పిండు కాదుండాయిన. తీర వచ్చ టార్కల తురకలు రానిస్తాన నుకున్రా మమ్మల! మదార్సాబు సుత అన్నడుండి. "హసే మీ రెక్కడి తురకల్రా? ఈకల్పెట్టుకుంటే నెమిలైతాద్రా కాకి? ఇటు కులపోల్లు రానీయ్యకుండ్రైను. అటు తుర్కోలు రానియ్యకుండైన్రుండి."

"బావుల్తవ్విస్తమన్నరు. బంతులు పెట్టమన్నరు కాదుర."

"నీ కాల్మొక్త. మాకాబాయిలొద్దు, ఆ బంతులొద్దు. మీ కాళ్ళకాణ్ణే పడుంటం, కులంల కలుపురి. కోమటాయన అప్పు పుట్టకనియ్యపోయే, కుమ్మరోడు కుండ లియ్యకపోయే! మంగలాయన గొరగడాయె, వడ్లాయన పనులు చెయ్యననె, కులపోరు పిల్లల్నియ్యమన్రి చేస్కోమన్రి, ఇగ ఊళ్ళెట్లుంటం గులాపోళ్ళం. ముత్తాలమ్మకు సుత కోపమొచ్చి మింగుతాందే, బోనాలు[86] పడ్తనంటే బైండ్లోడు[87] పట్టనియడాయె. బాద్రాయికి ఏటను[88] నరుకుతమంటే ఊళ్ళొల్లు నరక నియ్యరైరి. ఇగెట్ల బతుకుతముండి? ఎట్లనన్న చేసి కులంల కలుపురి, మీ బాంచోల్లమై పుడ్తం."

"అరే పుల్లిగా, తురుకోడు అందర్ని కలుపుతుంటడు. వాని కులమే అట్లరా. మరి మన బాపనాయ్న నిన్ను కులంల కల్పుకోటాన్ని ఒప్పుకుంటాడ్ర. అట్లనే చావురి. కోమటాయింతోన్చెప్పి బాకీ లిపిస్త పని పాటలోండ్లతోని పన్జెయ్యమని సెప్పుత ఎనకటెట్లున్నదో అట్లనే పడుండాలె. ఇన్నావా? తోకలేపిన్రో! ఏరికెనా?" అని మీసం మెలేశాడు.

"చచ్చినట్లు పడుంటం నీ బాంచను. ముత్తాలమ్మకు పూరా[89] అగ్గురమొస్తె గూడానిగ్గూడమె తింటది. కులంల కలుపురి నీ బాంచను గులాపోల్లమై పుడ్త" అని నేలమీదపడి మొక్కాడు.

"ఎట్ల చేస్తన్రా?"

"బస్తీలొకడు కండ్లబడిండుండి. తురకోల్లను తెలుగోల్లను చేసేటోల్లున్నరట. నీ బాంచను అని కాల్పట్టుకొని ఈడికి తోలమని చెప్పిన గులాపోణ్ణి. తోల్తనన్నడు గాని దొరోరు చెప్పుకుంటే తోల్తాడుండి? చీటిరాసి పంపురి కాల్మొక్త."

"ఆర్యసమాజ పోరున్నరు కాని, వీళ్ళు తురకల్ను చేస్తమంటే వాళ్ళు బాపన్లను చేస్తమంటరు.

చూస్తాలే."

"ఎట్లనన్న చెయ్యిరి నీ బాంచను. కొట్టెటోరు మీరే. పెట్టెటోరు మీరే" అని తల నేలకానించి దండంపెట్టి వెళ్ళిపోయాడు.

రెడ్డిగారు పొలానికి వెళ్ళారు.

## 8

పాండురంగపాణి హైదరాబాదు స్టేషనులో దిగాడు. ఏదో తురకదేశానికి వచ్చినట్టనిపించిందతనికి. ఎటు చూచినా తెలుగు అక్షరం కనిపించలేదు. పోర్టర్‌సైతం ఉర్దూలో మాట్లాడుతున్నాడు. అంతా షేర్వానీలు, రూమీ టోపీలే ధరించి ఉన్నందున తురకలెవరు? కానివారెవరు? గుర్తించడం కష్టంగా ఉంది. కూలివానిచేత పెట్టె, బెడ్డింగు మోయించుకొని బైటికివచ్చేవరకల్లా టాంగావాళ్ళు ఎగబడ్డారు. ఒకడు సామాను లాక్కుపోయి టాంగాలో పెట్టుకున్నాడు. లైసెన్సుకూలీ చేతిలో బేడపెడ్తే అది పారేసినంతపని చేసి "ఆధాయానేదో" అన్నాడు. పాణికి అదేమీ అర్థం కాలేదు. అతడు ఏక్, దో, తీన్ విన్నాడు కాని ఈ కొత్తపదం వినలేదు. మరొక అణా ఇచ్చి చూతాం అని కూలివాని చేతిలో మరొక అణా వేశాడు. అనుకున్నదానికంటే అర్ధణా ఎక్కువ ముట్టడంతో వాడు సలాం చేసి వెళ్ళిపోయాడు. టాంగాను వెతుక్కొని ఎక్కాడు పాణి. బండి సాగింది. విశాలమైన రోడ్డు, ఉన్నతమైన సౌధాలు, అందంగా ఉంది నగరం. అరబ్బులు, పఠాన్లు విరివిగా తిరుగుతున్నారు కత్తులు, కరార్లు ధరించి. అరబ్బులు పొట్టిగా ఉంటారు. చారల లుంగీలు ధరించిన పఠాన్‌లు చాలా పొడవైనవారు. పైజామా, మోకాళ్ళవరకొచ్చే కమీజా, పెద్ద తలపాగా ధరించి ఉంటారు. నల్లనిముసుగు వేసుకొని దయ్యాలవలె ఉన్నవారు-ఆడవారు-రోడ్లవెంట తిరుగుతున్నారు. అయితే ఎక్కడ చూచినా తెలుగు అక్షరం కనిపించలేదు పాణికి. తెలుగుదేశానికి తలమానికంలాంటి మహానగరంలో తెలుగువాడుగానీ, తెలుగుదనంగానీ, తెలుగు అక్షరంగానీ కనిపించలేదంటే బాధపడ్డాడు పాణి. తెలుగు తల్లిని సగానికి చీల్చి, బొట్టూ, తాళీ తీసివేసి, ముసుగువేసి, ఉర్దూ మాట్లాడమని హింసిస్తున్నట్లనిపించింది పాణికి. ఈ దవుర్జన్యాన్నీ, ఈ క్రౌర్యాన్నీ తెలంగాణాలోని కోటి తెలుగువాళ్ళు ఎలా సహిస్తున్నారా అనిపించిందతనికి. కొండా వెంకటప్పయ్య పంతులు, ఆంధ్ర మహాసభ గుర్తుకు వచ్చాయి. వెంటనే అతడు విన్న తెలంగాణా ఆంధ్రోద్యమ పితామహుడు మాడపాటి హనుమంతరావుగారి పేరు గుర్తుకు వచ్చింది.

టాంగావానికి తెలుగు వచ్చేమో తెల్సుకుందామని "నీ పేరేమి?" అని అడిగాడు పాణి.

"పెంటయ్య."

"తెలుగొచ్చా"

"తోడెం తోడెం[90] వస్తది"

"ఇక్కడెవరూ తెలుగు మాట్లాడరేం?"

"సర్కార్ ముసల్మాన్లది కాదుండి. తెల్గుంల బాత్‌చీత్[91] చేస్తే గైర్[92] మనిషనుకుంటరు."

"తురంకేస లుంటేనే తోడెం ఇజ్జతుంటది[93] కాకుంటే కొట్టి చంపుతరు తురకోండ్లు. తురకోండ్లల్ల ఇత్తెహాద్[94] శానుంటది. పొట్టెగాండ్లుబీ వచ్చి ఝుగ్డా[95] పెట్టుకుంటరు. ఒకదఫా[96] ఒక వాఖియా[97] గుజరాయించింది[98] అయ్యోరోడ్ల పొట్టెగాడు[99] బొట్టుగిన పెట్టుకొని పైదల్[100] పోతున్నాడు సీతరామ్‌బాగ్ కెల్లి. నేను సవారి దింపి వస్తున్న. మదర్సనుంచి వస్తున్న తుర్క పోరలు ఇట్కె పెడ్లల్తో కొట్టిను అయ్యోరోండ్ల పోరణ్ణి. పోరన్కి జఖమ్[101] అయింది. ఖాన్[102] బహాయించింది[103]. గిలగిల తన్నుకొని జమీన్[104] మీద

పడిపోయిండు. టాంగా అట్లనే నిలబెట్టినా, తుర్కపోరండ్ల పిఛా[105]చేసిన. పోరలుర్కబట్టిన్రు గని సడక్‌న[106] పోతున్న తుర్కోడు చూసిండు. "క్యోం మార్తాహై పోట్టాంకో" అన్నాడు. "ఖామాఖా[107] మారేసాబు[108] పొట్టెకో దేకో అంట ఆ పోరణ్ణి చూపిన ఇగ వాడు గరమైండనుకో[109]. గల్లా[110]పట్టి గుంజికొట్టిండు నన్ను. నేను భీ నాలుగు లగాయించిన[111] అస్పాస్లున్న[112] తురకోండ్లంత కూడిన్రు, జబిరిన్రు నన్ను. జఖమైంది నెత్తిన. దవఖాన్ల పడ్డా ఒక్క తెనుగోడు రాలేదు. ఇన్నవా?" అని తలగుడ్డ తీసి కుట్లుపడిన గుర్తులు చూపించాడు.

ఎంత దవుర్జన్యం! మత పిశాచం తాండవిస్తూందనుకున్నాడు పాణి. హోటలు రావడంతో దిగిపోయాడు. స్నానాదులు ముగించుకొని సుల్తాన్ బజార్లో ఉన్న మాడపాటి వారింటికి వెళ్ళాడు పాణి. ఏవో కాగితాలు చూసుకుంటున్నారు. హనుమంతరావుగారు. పాణి నమస్కారానికి ప్రతినమస్కారం చేసి "రాండి. కూర్చోండి" అని కుర్చీ చూపించాడు.

కుర్చీలో కూర్చుంటూ "ఇవ్వాళ సుదినమండీ, మీ దర్శనం అయింది. మాది బెజవాడ, నా పేరు సారంగపాణి, నైజాంలోనే ఒక పల్లెలో సంగీతం చెప్పుకుంటున్నాను. ఇదే మొదటి తడవ హైద్రాబాదు రావడం. ఇదేదో తురకదేశంలా కనిపిస్తూంది. తెలుగువారుగాని, తెలుగుదనంగాని మచ్చుకైనా కనిపించదు. మీ పేరు విన్నాను కాబట్టి దర్శనం చేసుకోవడానికి వచ్చాను" అన్నాడు.

"సారంగపాణిగారూ, తెలుగు మాట్లాడేవారంతా ఒకే సంతతికి చెందినవారు. వారి ఆచారవ్యవహారాలు, నాగరికత, సంస్కృతి, స్వభావం అన్నీ ఒకలాంటివే. అయితే రాజకీయ కారణాలవల్ల తెలంగాణాలోని తెలుగువారు చీలిపోయారు. తెలంగాణం అనే ప్రాంతంలో ఉన్న తెలుగువారిని ఆరువందల సంవత్సరాలనుండి తురుష్కులు అవిచ్ఛిన్నంగా పాలిస్తున్నారనే విషయం తాము గుర్తుంచుకోవాలి. రెండవ ప్రతాపరుద్రుని తరవాత ఈ ప్రాంతాన్ని పాలించిన హిందూరాజు లేడు. ఇంతకాలంగా ఉర్దూయే రాజభాషగా ఉంటూ వచ్చింది. ప్రభుత్వం వారిది కావడం మూలాన వేషభాషల్లో మార్పురావడం సహజం.

"కొంత పశ్చిమాన మహారాష్ట్రుల్తోనూ, కొంత పశ్చిమాన కర్ణాటకుల్తోనూ సంపర్కం ఉంది మాకు. వారి ప్రభావం కూడా మా వేషభాషల మీద పడింది. మహారాష్ట్ర ప్రభావంగల నిజామాబాదు భాష ఇలా ఉంటుంది:

"ఇదేమా మాయి. రొండు దివ్యలు ఆయె సాళెకు పోవు. ఏనుగు సొండెము ఏదిరా? కాకకు మాశీకి భేటీ కాలేదు" - అంటే, ఇదేమిరా నాయనా, రెండు దినములాయెను బడికిపోవు.. ఏనుగుతొండము ఏదిరా? చిన్నాయనకు మేనత్త దర్శనము కాలేదు.

"ఇక కర్ణాటక ప్రభావంగల మహబూబు నగరపు భాష, "మాసణ్ణ పిల్లకు పెసర బేడలు పట్టవు. దొడ్డ పిల్ల బేకైనంత తింటది." అంటే "మా చిన్నపిల్లకు పెసరపప్పు ఇష్టంలేదు. పెద్దపిల్ల పొట్టపగల తింటుంది" అని అర్థం.

'రాజకీయభాష ప్రభావం పడిన భాష : "ఈ మొకద్దమాల చలాయించిన కార్రవాయంత జాలీది సాహేబుజిల్లా జాయె మౌఖకుపోయి తహకీ కాతుచేసి కైఫియతు రాసినాడు కదాకే పరీఖు దావాబిల్కులు నాజాయజు" అంటే "ఈ వ్యవహారములోనడచిన చర్య అంతా తప్పు స్పష్టి జిల్లా తాలూక్దారుగారు ఆ స్థలమునకు పోయి విచారణ చేసి నివేదిక వ్రాసినది ఏమనగా, "కక్షిదారు చేసిన వాదము పూర్తిగా అక్రమమైనది" అని అర్థం".

"అయితే తమ తెలుగు కొంత కాలానికి ఉర్దూగా మారేట్లుంది. ఆంధ్రోద్యమం ఎలా ఉందండీ?"

"రాజ్యం తురుష్కులది. ఉర్దూను అభివృద్ధి పర్చడం వారి లక్ష్యం. అందుకే 3-10-1918వ

ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రారంభించబడింది. ఇక్కడ నాల్గవ తరగతి వరకు మాత్రమే తెలుగు, ఏడవ తరగతి దాకా తెలుగు రెండవ భాషగా ఉంటుంది. ఆ తరువాత చదువంతా ఉర్దూలోనే. విద్యావంతుల సంఖ్య వెయింటికి 82. అందులోనూ తురకల్లో 59 మంది కాగా, హిందువుల్లో 23 మంది. ప్రజాహిత కార్యాల్లో అభిరుచి కలవారంతా మహారాష్ట్రులే.

"తెలుగు వారిలో విద్యాధికుడు ఎక్కడైనా వెక్కిరించినట్లు కనిపించినా, హైదరాబాద్ తన నగరమనీ, తెలుగు తన మాతృభాషా అనీ సాధారణంగా భావించడు. అతని వేషభాషల్లో ఆంధ్రత్వం వెదకాల్సి ఉంటుందని చెపితే సరిపోతుంది. తెలుగువారికి తమ భాషను గుర్తుకు తేవాలనే ఉద్దేశ్యంతో 1-9-1901 నాడు రెసిడెన్సీబజార్‌లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం స్థాపించబడింది. అందుకు కారకులు నాయని వెంకటరంగారావు బహద్దుర్‌గారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, రావిచెట్టు రంగారావుగారు.

"11-11-1922న కార్వే పండితుని అధ్యక్షతన నిజాం రాష్ట్రసంఘ సంస్కార మహాసభ సమావేశమైంది. అధ్యక్షులు కొంత ఇంగ్లీషులోనూ, కొంత మహారాష్ట్రంలోనూ మాట్లాడితే తెలుగువాళ్ళమైన మాకు మనస్తాపం కలిగింది. శ్రీ అల్లంపెల్లి వెంకట్రామారావుగారు ఒక ఉపన్యాసం తెలుగులో ఇవ్వపోగా, సభాసదులు, ముఖ్యంగా మహారాష్ట్రులు - చప్పట్లు చరిచి ఉపన్యాసకుడు ప్రసంగం అపుచేసి కూర్చొనేట్లు చేశారు. తెలుగువాళ్ళు సభ ముగియకముందే వెళ్ళిపోయారు. తెల్లవారి ట్రూపు బజారులో టేకుమాల రంగారావుగారి ఇంట్లో పదకొండుగురం ఆంధ్రులం సమావేశమై నిజాం రాష్ట్రాంధ్రజన సంఘం స్థాపించాం. నిజాం రాష్ట్రంలోని తెలుగువారిలో పరస్పర సహానుభూతి కలిగించి, వారి అభివృద్ధి కోసం ప్రయత్నించడం, సంఘాలను స్థాపించడం దాని ముఖ్య ఉద్దేశ్యాలు."

"అయితే రాజకీయ లక్ష్యాలేం లేవన్నమాట."

"నిజాం రాష్ట్రపు రాజకీయాలు విచిత్రమైనవి. ఇక్కడ పోలీసులు రాక్షసుల్ని తలతన్నినవారు. 1919లో ఒక ఫర్మానా[113] ద్వారా నిజాం నవాబు ఎగ్జిక్యూటివ్ కౌన్సిలును విస్తరింపజేస్తే అందుకు కృతజ్ఞత తెలియజేయడానికి జరిగిన సభలే ఈ రాష్ట్రంలో మొట్టమొదటి సభలు, భారతదేశంలో వ్యాపించిన ఖిలాఫత్ ఉద్యమం హైదరాబాదుకు కూడా వ్యాపించి 20, 25 వేల మందితో బహిరంగసభలు జరగడం ఇక్కడ మామూలైపోయింది. హిందూ ముస్లిముల ఐక్యం బలపడ్డం చూచి ప్రభుత్వానికి కన్నుకుట్టింది. హిందువులతో కలిశారనే నేరానికి కొందరు ముస్లిం యువకుల్ని అరెస్టు చేసి మన్ననూరు పంపడం జరిగింది."

"మన్ననూరంటే?"

"నిజాం రాష్ట్రంలో రాజకీయ దోషులను విచారణ లేకుండా ఉంచే ప్రాంతం. అది మహబూబ్‌నగరం జిల్లా అమరాబాద్ కొండల ప్రాంతంలో ఉంది."

"తరువాత?"

"ఖిలాఫత్ సమావేశాలను నిషేధించడమేకాక, ఒక ఫర్మానా ద్వారా బహిరంగసభలు జరుపరాదని ఆదేశించబడింది. హైదరాబాద్ రాజకీయ సంస్కరణల సంఘంవారు నగరంలో మహాసభ జరుపుకోడానికిగాను అనుమతినికోర్తే పదిసంవత్సరాల వరకు అవునని కాని, కాదని కాని జవాబు రాలేదు ప్రభుత్వం నుండి 1931లో. ఆ సభలు బెరార్‌లోని అకోలాలో జరిగాయి.

"తర్వాత ప్రభుత్వపు పాక్షిక విధానాన్ని బట్టబయలు చేయాలనే ఉద్దేశంతో కాశీనాథరావు

వైద్యవంటి ప్రముఖులు హిందూ స్టాండింగ్ కమిటీ స్థాపించారు. 1932లో ఈ రాజ్యంలోని హిందువులకు తీవ్రమైన అన్యాయం జరుగుతూందని తెలియజేస్తూ కరపత్రాలు అచ్చువేసి పంచిపెట్టారు. జనాభా లెక్కల్ని చూపి హిందువుల సంఖ్య ఈ రాజ్యంలో తగ్గుతూందని నిరూపించారు. ఈ సంఖ్యలు గమనించండి:

| | | | | |
|---|---|---|---|---|
| 1901లో | జనాభాలో | హిందువుల | శాతం | 88.6 |
| 1911లో | ,, | ,, | ,, | 88.9 |
| 1921లో | ,, | ,, | ,, | 85.4 |
| 1931లో | ,, | ,, | ,, | 84.0 |

"ప్రస్తుతపు నిజాం 1911లో గద్దెనెక్కాడు. అప్పట్నుంచి మాతాంతరీకరణం ఎక్కువకావడమేకాక, ఉత్తరదేశం నుండి ముస్లిం దిగుమతి కూడా ఎక్కువకాసాగింది. ఉద్యోగాలకు సంబంధించినంతవరకు 1931 లెక్కల ప్రకారం సైన్యంలో 51,149 మంది తురకలుంటే 6,495 మంది హిందువులున్నారు. ఉద్యోగాల్లో 58,188 మంది మహమ్మదీయులుంటే, 16,873 మంది హిందువులున్నారు. ఈ హింగూ ఉద్యోగస్థుల్లో వంశపారంపర్యంగా వచ్చే వతన్‌దార్లయిన గ్రామాధికార్లు కూడా చేరి ఉన్నారు. వారిని మినహాయిస్తే హిందూ ఉద్యోగస్థుల సంఖ్య నామమాత్రం అవుతుందని భయపడి ప్రభుత్వం వారినికూడా ఈ సంఖ్యలో చేర్చింది. టైమ్స్ ఆఫ్ ఇండియా వంటి పత్రికలు ప్రభుత్వ పాక్షిక విధానాన్ని గురించి సంపాదకీయాలు రాశాయి."

'అయితే తమకా ఉద్యమాలతో సంబంధం లేదా?' పాణి ప్రశ్నించాడు.

"నన్ను ఆ ఉద్యమాలలో పాల్గొనమన్నారు. కాని నేను అంగీకరించలేదు. ఎంచాతంటే అవి మతపరములైన ఉద్యమములు. మతపరాలైన ఉద్యమాలంటే మహాత్ముడు హర్షించడు. ఆయనకు నచ్చని పని చేయడం నా అభిమతం కాదు. అందుకే ఆంధ్ర జనసంఘాన్ని మతపరంగాకాక భాషాపరంగా ఏర్పాటు చేశాం."

"ఆంధ్రోద్యమం విషయం మాట్లాడుతూ మతోద్యమం వైపు మళ్ళాం. ఆంధ్రజన సంఘాన్ని గురించి శలవిచ్చారు కారు."

"ఆంధ్రజన సంఘాలు నగరంలో ఉపన్యాసాలు, సమావేశాలు ఏర్పాటు చేసేవి. దీనివల్ల తెలంగాణాలో జాగృతి కలిగింది. అనేక చోట్ల ఆంధ్రజన సంఘాలు ఏర్పాటైనాయి. వీటి అన్నింటికి ఒక కేంద్ర సంఘం ఉండాలనే ఉద్దేశంతో 1923లో హనుమకొండలో జరిగిన ప్రతినిధుల సభలో 'ఆంధ్రజన కేంద్ర సంఘం' స్థాపించడం జరిగింది. గ్రంథాలయాలు, పాఠశాలలు, వర్తక సంఘాలు స్థాపించడం, లఘు పుస్తకాలు ప్రకటించడం ఈ సంఘపు లక్ష్యాలు."

"రాజకీయాల జోలికి పోకుండా మడికట్టుకొని కూర్చున్న మీ ఉద్యమాన్ని ప్రభుత్వం సాఫీగా సాగనిచ్చిందా?"

"బ్రిటిషిండియాలోని ప్రజలు మహాత్ముని నాయకత్వాన స్వరాజ్య సాధనకు పోరాటం సలుపుతూ, ద్వంద్వ పరిపాలన సాధించి, రాష్ట్రాలలో ప్రజామంత్రివర్గాలు స్థాపించకోబోతున్న సమయంలో నిజాం రాష్ట్రంలోని ప్రజలలో ఎట్టి రాజకీయ చైతన్యంలేదని ఒప్పుకొనక తప్పదు. ఒప్పుకునేప్పుడు సిగ్గుతోచక మానదు. కాని రాజకీయాల జోలికి పోకుండా మడికట్టుకున్నా మమ్మలను ప్రభుత్వం ఎన్ని హింసలు పెట్టిందో తెల్సుకుంటే ఆశ్చర్యపోతారు. అంత జాగ్రత్తగా ఉద్యమం నడుపుతూ ఉండినప్పటికి పాలకోడేటి వేంకట రామశర్మ లాంటి కొందరు తెలుగు సోదరులే "అగ్నికి కట్టెలకు" ఎట్టి సంబంధమో, ఆంధ్రజన

సంఘమునకు రాజకీయములకు అట్టి స్నేహము" అని నీలగిరి పత్రిక వంటివాటిలో వ్రాశారు. దాంతో ప్రభుత్వాధికారులకు అనుమానం కలిగి కార్యకర్తలను ఎన్నో చిక్కులపాలు చేశారు.

"సూర్యాపేటలోని ఆంధ్రవిజ్ఞానప్రకాశినీ గ్రంథాలయాన్ని దర్శించిన జిల్లాతాలూక్దారుగారు ప్రభుత్వానుమతి లేదనే నెపంతో గ్రంథాలయాన్ని మూసివేయించారు. అక్కడి కార్యకర్త వ్రాస్తే నేను హోమ్ సెక్రటరీ అయిన సర్ అక్బరు హైదరీకి వ్రాశాను. "గ్రంథాలయాలు స్థాపించడానికి ఈ కార్యాలయం నుండి అనుమతి పొందాల్సిన అవసరంలే"దని వారు వ్రాసిం తర్వాత ఆ గ్రంథాలయం తిరిగి తెరువబడింది.

"కరీంనగరంలోని సిరిసిళ్ళలో ఉన్న గ్రంథాలయాన్ని చూసి అక్కడి తాసిల్దారు "సర్కారు వారి దస్తరములలో వ్యవహార మంతయు ఉర్దూలో ఉండగా చచ్చిపోయిన తెలుగును బైటికి గుంజవలసిన పనిలేదు" అన్నారు.

'వరంగలుజిల్లా మడికొండ గ్రామంలో నడుస్తున్న ఆంధ్ర గ్రంథాలయం స్థాపనకు ప్రభుత్వాజ్ఞ అవసరమని పోలీసు పటేలు పట్టుపట్టాడు. కార్యదర్శి అవసరం లేదన్నారు. అప్పుడు అదాలతు (కోర్టు) నుండి కార్యదర్శి పేర ఒక లేఖ వచ్చింది' అని డ్రాయరు తెరచి ఒక లేఖ అందించారు హనుమంతరావుగారు పాణికి.

సారంగపాణి, కష్టంగా ఇలా చదివాడు:

· 'ప్రతిరోజా సదరు లైబ్రరీకి పుస్తకములు చదువుకొనగలందులకు వస్తూ వున్నారు. మరిన్నీ ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, ముషీర్ దక్కన్ వగైరా పత్రికలు వస్తూ వున్నవి. హాలు సదరు లైబ్రరీ ఖాయం చేయుటకు మీరే యేమక్మా[114] నుండి అయినా హుకుం[115] పొంది వున్నారా? అగరు[116] పొందకున్నట్లయితే ఫౌరన్[117] పొందవలసింది. కెంకె అక్సరు[118], ముజహబీ[119] వార్తలతో జగడాలు అవుతూ ప్రాణహాని కూడా కలుగుతూ ఉన్నది కాబట్టి మరియొక హుకుం పంపువరకు గ్రంథాలయము మూసి ఉంచవలెను.'

"ఈ లేఖ సర్ అక్బరు హైదరీ ఉత్తరువు తరువాతదా, అంతకు ముందే జారీ చేయబడిందాండి?"

"సర్ అక్బరు హైదరీ లేఖ 8-10-1929 ఫసలీన జారీచేయబడగా ఈ లేఖ 24-1-1934 ఫసలీన జారీచేయబడింది. ఈ ఉత్తరువు అక్రమమైందని హోమ్ సెక్రటరీకి వ్రాశాను. దానికి ఇంతవరకూ జవాబు రాలేదు. ఇలాంటి అడ్డంకులు ఎన్నో వస్తున్నా, పట్టుదలా, ధైర్య సాహసాలు గల కార్యకర్తలు ఉద్యమం కొనసాగిస్తూనే ఉన్నారు."

ఇంతలో రెండు కప్పులలో చాయ్ వచ్చింది.

"ఎందుకండీ ఈ శ్రమ?"

"శ్రమ ఏముందండీ? తెలుగును గురించీ, తెలుగువారిని గురించీ ఇంత శ్రద్ధగా తెల్సుకోవాలనుకునేవారే కరువు ఈ రాజ్యంలో. సుదీర్ఘమైన నీ సంభాషణ మీకు విసుగు కలిగించవచ్చు. టీ కొంత వేడి నిస్తుంది. ఉత్సాహం కలుగజేస్తుంది."

"అదేమిటండీ, అలా అంటారు? మీరు చెప్పే విషయాలు విసుగు కాదు, ఆసక్తి కలిగిస్తున్నాయి. చాయ్‌కంటే మీ మాటలే వేడినిస్తున్నాయి. సభల విషయం శలవిస్తు ఉంటిరి" అన్నాడు. పాణి చాయ్ చప్పరిస్తూ.

గుక్కెడు చాయ్ మింగి హనుమంతరావుగారు ప్రారంభించారు:

"మొదటి మూడు సభలకు ప్రభుత్వం అనుమతించింది. అవి హైద్రాబాదు, నల్లగొండ, మధిరలలో

జరిగాయి. 1925లో నాల్గవ వార్షిక మహాసభ సూర్యాపేటలో చేయాలని తలపెట్టాం. సభలు జరగాల్సిన తేదీ నాలుగురోజులుందనగా ప్రభుత్వానుమతి లేక సభలు జరగడానికి వీల్లేదని జిల్లా పోలీసు సూపరింటెండెంట్ ఉత్తరువు జారీ చేశారు. దీనిని కోర్టుకు లాగడం మంచిదని అమరవాది వెంకటనర్సయ్యగారు నల్లగొండ జిల్లా కోర్టులో అర్జీ దాఖలు చేయగా, ఇట్టి సభకు ప్రభువువారి ఫర్మానా 11 మొహర్రం, 1310 హిజ్రీ ప్రకారం బాబెహుకూమత్[120] సెలవు కావలెను అని తీర్పు ఇచ్చారు. హైకోర్టుకు అప్పీలు చేస్తే ఎవరైనను ప్రభువువారి ఫర్మానాకు విరుద్ధంగా సభ జరిపించిన ఎడల అట్టి ప్రవర్తనము శాసన విరుద్ధ మనపించుకొనును" అని తీర్పు ఇవ్వబడింది.

"1927లో బ్రిటిషు ప్రభుత్వం రెవిన్యూ పోలీసుశాఖమంత్రి లెఫ్టినెంటు కర్నలు ట్రెంచ్‌ను నియమించింది. వారినుండి అనుమతి పొంది 1928 వ సంవత్సరంలో సూర్యాపేటలో వైభవంగా సభలు జరిగాయి. తరువాత ఉద్యమ వ్యాప్తిని గమనించి కార్యకలాపాల పరిధి పెంచి నిజాం రాష్ట్రాంధ్ర మహాసభ ఏర్పాటు చేయాలని సంకల్పించబడి, 1930లో జోగిపేటలో సురవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన ప్రథమ నిజాం రాష్ట్రాంధ్ర మహాసభ జరిగింది. 1931లో బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతన దేవరకొండలో రెండవ వార్షికోత్సవ సభలు జరిగాయి. ఆ సభల్లో ఆంధ్రజనుల ఉత్సాహం వెల్లివిరిసింది. ఆంధ్రమహాసభ తమ సంస్థేనని ప్రజలు భావించసాగారు. మరుసటి సభకు అనుమతించవసిందిగా ప్రభుత్వాన్ని కోరితే ప్రధానమంత్రి మహారాజా కిషన్ పర్షాద్ బహద్దూర్ నుండి "మహాసభ సమావేశపర్చుటకు వీల్లేదు" అని ఆజ్ఞ వచ్చింది. అట్టి నిషేధాజ్ఞల్ని గురించి పునరాలోచించాల్సిందని విన్నవించుకోగా కర్నల్ ట్రెంచ్‌గారు నాకు దర్శనమిచ్చి అనుమతించడానికి దిగువ షరతులు విధించారు:

1. ప్రభుత్వం వారి పాలసీని గురించి చర్చించరాదు.
2. అట్టి చర్యలు జరుపబడవనుటకు హామీగా రెండువేల రూపాయలు జమానతు యివ్వవలెను.
3. అట్టి చర్చలు జరిగినవా, లేవా అను దానిని నిర్ణయించువారు ప్రభుత్వమువారు.

"జమానతు చెల్లించమనీ, సభలకు అనుమతించాల్సిందనీ వేడుకోగా కర్నలు ట్రెంచ్‌గారు నాకూ, బూర్గుల రామకృష్ణారావుగారికి దర్శనమిచ్చి లక్షప్రశ్నలడిగి అనుమతి ఇవ్వాల్సిందని బాబెహుకూమత్‌కు సిఫార్సు చేస్తామన్నారు. అనేక షరతులు పెట్టి అనుమతి ఇచ్చారు. ఖమ్మంమెట్టులోని సనాతనులు కొందరు మా సభలు సనాతనాచారాలకు భంగం కలిగిస్తాయని, సభలు జరక్కుండా చేయడానికి అనేక అడ్డంకులు కలిగించారు. అయినా సాధారణ ప్రజలు ఉత్సాహంతో సహకరించారు. చారిత్రాత్మకంగా జరిగాయి ఖమ్మం మెట్టులో తృతీయాంధ్ర మహాసభలు - 1934లో.

"ఇలా ఏదో సాధ్యమైనంతవరకు తెలంగాణాలోని ఆంధ్రులకు సేవచేస్తున్నాం. రాజకీయమైన ఈ హద్దులు కలకాలం నిలిచేవికావు. మహాత్ముని నాయకత్వాన కొనసాగుతున్న మహోద్యమం తెల్లదొరతనాన్ని గడగడలాడిస్తున్నది. భారతదేశం బానిస బంధాల్ని త్రెంచుకొని త్వరలోనే స్వతంత్రం అవుతుంది. ఈ నిజాంనవాబు పెత్తనం ఊడుతుంది. ముక్కోటి తెలుగు జనం ఒక్కటై - హైద్రాబాదు రాజధానిగా విశాలాంధ్ర ఏర్పడుతుంది. ఆ మంగళ ముహూర్తం చూడ్డానికి జీవిస్తున్నా. జీవించి ఉన్నట్లయితే విశాలాంధ్ర ఏర్పడిం తర్వాత ఒకే రాష్ట్ర ప్రజలంగా మళ్ళీ కల్సుకుందాం" అని ముగించారు, మాడపాటివారు.

"తాము పెద్దలు, మనశ్శుద్ధి, వాక్శుద్ధి కలవారు. మీ వాక్యం తథ్యం అవుతుంది. ఆ శుభముహూర్తం

చూచే భాగ్యం కలుగుతే తప్పక మీ దర్శనం చేసుకుంటాను. ఇంత వివరంగా తెలియజేసిన తమకు కృతజ్ఞతలు. మళ్ళీ ఎప్పుడైనా హైద్రాబాదు వస్తే దర్శనం చేసుకుంటాను. శలవు" అని లేచాడు పాణి.

"తప్పక విచ్చేయాలి" అని లేచి గుమ్మందాకా వచ్చి సాగనంపారు ఆంధ్ర పితామహులు.

సారంగపాణి రోడ్డువెంట వెళుతుంటే ఒక విచిత్ర సంఘటన కనిపించిదతనికి.

సైకిలుమీద వెళ్తున్నాడొకడు. పోలీసువాడు వాణ్ణి ఆపాడు. అడిగాడు : "సైకిలుకో లైట్ కహా హై[121]!" అని. "దిన్‌మే, లైట్ క్యా సాబు[122]" అన్నాడు బెంబేలుపోయి సైకిలువాడు. "సైకిలు కో లైట్ రహనా, దిన్ క్యా రాత్ క్యా[123]" - అలా అనడమూ, సైకిలు లాక్కోవడమూ ఒకేసారి చేశాడు పోలీసు. సైకిలువాడు ఏదో కోపంగా అన్నాడు. పోలీసువాడు వాణ్ణి నెట్టాడు. అతడు రోడ్డుమీద పడిపోయాడు. సైకిలు ఎక్కి వెళ్ళిపోయాడు పోలీసువాడు.

అది అతి సాధారణ విషయంగా భావించి జనమంతా రాకపోకలు సాగిస్తుండగా పాణికేమో ఒళ్ళుమండింది.

కాని, ఏం చేస్తాడు ? ఇదేం తన దేశమా?

## 9

'వనజా' మంజరి పిలిచింది.

పరుగెత్తుకొని వచ్చింది వనజ.

"గజ్జెల చప్పుడైతాందిఽకప్పుడ మొస్తాందెమో చూడు."

వనజ పరుగెత్తింది. బంకుల్లో రెడ్డిగారిని చూచి ఆనకట్టను తాకి ఆగిపోయిన నదిలా నిల్చిపోయింది.

అప్పటికే "హూ" అన్నారు రెడ్డిగారు.

రెండు చేతులు నలుపుకొంటూ గోడకానుకొని నుంచునింది వనజ.

గేట్లోంచి బండి వచ్చేసింది. దాని వెనుకే వీణ మోసుకొని ఒక మనిషి వచ్చాడు. సారంగపాణి బండి దిగాడు. చాకలి చెప్పులు క్రింద వేశాడు. చెప్పులలో కాళ్ళు పెడుతూనే నమస్కరించాడు రెడ్డిగారికి పాణి.

"ఏం పంతులూ! గాజుబిందెలు తెచ్చినవా?" అని అడిగాడు రామారెడ్డిగారు.

"తెచ్చానండీ" అని వెనక్కు చూచాడు పాణి. మనుషులు కనిపించలేదుకాని, అతని వెంటనే ప్రవేశించిన యెండపొడ కనిపించింది.

గమనించాడు ఎంకటి. "ఎ్రా మనుషులు? యాడచస్త్రాను? బిర్న[124] రమ్మను" అన్నాడు అక్కడనే కూర్చుని ఉన్న ఒకన్ని చూచి. వాడు తలగుడ్డ చేతిలో పట్టుకొని పరిగెత్తాడు. కొద్దిసేపట్లో అయిదుగురు మనుషులు రెండు రెండు గాజుబిందెలు పట్టుకొని ప్రవేశించారు. వారివెంట వచ్చిన జనం గేటు ముందు ఆగిపోయారు, పామును చూచిన మనుషుల్లా.

" ఏం రోగాలు పుట్టినైరా చచ్చుకుంటు నడుస్త్రాను" ఎంకడు అరిచాడు.

"కనుపడ్డోడల్ల బిందెల్ని చూస్తాంటే ఆగమం...." రెడ్డిగార్ని చూచి మాట మింగేశాడు బిందెలు తెచ్చిన వారిలో ఒకడు.

ఒక్కొక్కడూ మెట్లెక్కి రెండు బిందెలు, రంగు రంగులవి బల్లమీదపెట్టి మెట్లుదిగి వస్తున్నాడు.

రెడ్డిగారు లేచి చేతితో బిందెల్ని పట్టుకొని తిప్పితిప్పి చూస్తూ "పంతులూ! భలేటోనివయ్యా! నేననుకున్న రంగులే తెచ్చినవు. చూడు, నీలిరంగుదెంత బాగున్నదో! ఓహో, గులాబి రంగుది ఇంకా బాగున్నది, బంగారురంగుది తేలే? అదంటే నాకు శానా ఇష్టం" అన్నాడు.

'అన్నీ ఒకేరంగులైతే బాగుండదని రంగురంగులవి తెచ్చానండి.' బంగారు రంగుది .." అంటూంటడగానే బంగారురంగు బిందెలు తెచ్చినవాడు ఒకటి బల్లమీదపెట్టి, మరొకటి బల్లమీదపెట్టబోయి చేయిజారడంతో విడిచిపెట్టాడు.

ధన్‌మని పగిలి ముక్కలు ముక్కలైంది గాజుబిందె.

రెడ్డిగారి గుండెసైతం ముక్కలు ముక్కలైంది.

ఉగ్రలైపోయారు రెడ్డిగారు.

లాగి చెంపమీదకొట్టారు జారవిడిచినవాణ్ణి.

ఆ దెబ్బకే క్రిందపడిపోయాడు వాడు.

రెడ్డిగారు కోపంతో ఉగ్రులై ఒక్క తన్ను తన్నారు.

ఫుట్‌బాల్లా రెండుగజాలన్నర అరుగునుంచి క్రిందపడ్డాడు మనిషి

వెంటనే లేచాడు. 'దొర! పిల్లలుగలోన్ని, బత్కనీరి' అని వెనక్కు తిరిగి పరిగెత్తాడు వాడు.

అక్కడ నుంచున్నవారంతా బొమ్మలైపోయారు. పాణిలో ఉత్సాహం చచ్చి, ఉద్రేకం పొంగి మాయం అయింది. బుసలుకొడుతూ గడీలోనికి వెళ్ళిపోయారు రెడ్డిగారు. గోడకు ఆనుకొని నుంచున్నదల్లా నిట్టూర్పువిడిచి వెళ్ళిపోయింది వనజ. సారంగపాణి తన గదికి వెళ్లిపోయాడు తలవంచుకొని. ఎంకటి మనుషుల్తో ఒక్కొక్క పెట్టె, ఒక్కొక్క సామాను మోయించుకొని కెళ్ళి సారంగపాణి గదిలో కొన్ని, గడీముందున్న వసారాలో కొన్ని పెట్టించాడు. గడీ మొత్తంలోనూ చీమ చిటుక్కుమంటే వినిపించేటంత నిశ్శబ్దం ఆవరించింది. పట్నం నుంచి పాణి వచ్చాడంటే, సామానులు తెచ్చాడంటే గడీ మొత్తం ఉత్సాహంతో పొంగిపొర్లింది. పాణి సహితం తానెలా గాజుబిందెలు ఎన్నుకున్నదీ, చీరల కోసం ఎక్కడెక్కడ తిరిగిందీ రెడ్డిగారికి వివరించి చెప్పాలనుకున్నాడు. అతని ఉత్సాహం చచ్చి ఊరుకుంది. తువ్వాలు తీసుకొని స్నానాలగదికి వెళ్ళాడు. తిరిగి వచ్చేవరకు, ఉపాహారపు పళ్లెమూ, మీగడ పాలగ్లాసూ కావిడిపెట్టెమీదపెట్టి వెళ్ళిపోయింది వనజ. అది తినడం కూడా ఇష్టం లేకపోయింది పాణికి. మంచంమీద మేనువాల్చాడు. అతని మెదడులో ఏవేవో మసలసాగాయి. బండమనిషి. ఈ దెబ్బలు తిన్న మనిషీ మనుషులేనా? వట్టి రాతి మనుషులా? అసలు ఈ దొరకు ఎక్కడైన పిసిరంత మనసుందా? ఇతడూ రాతిమనిషేనా? గాజుబిందె అందమైంది. రెడ్డిగారికి చాల ఇష్టమైంది. పట్నం నుంచి తెప్పించాడు. అవి చూసి మురిసిపోయారు. అలాంటిది పగిలిపోతే కోపం వచ్చేది నిజమే. రౌద్రం పొంగేది నిజమే. కాని, ఎదుటివాడు మాత్రం చెయ్యాలని చేశాడా? చేయిజారి పడిపోయింది. అబ్బ, ఎంతదెబ్బ కొట్టాడు! ఇంత ముసలితనంలోనూ ఎంతబలం వుందీ! ఏనుగులూ తిని, ఏనుగంత బలం గలవాని దెబ్బ భరించగలడా తిండికిలేక డొక్కమాడేవాడు? ఈ క్రౌర్యం సంపదతో వస్తుందేమో! లేక అధికారాన్ని అంటిపెట్టుకొని వుంటుందో?

'శుచీనాం శ్రీమతాంగేహే యోగ భ్రష్టోభిజాయతే'

సంపదలు యోగభ్రష్టుడైన వానికి అబ్బుతాయట. యోగభ్రష్టుడు ఇంత క్రూరుడు కాగలడా? కృష్ణభగవానుడు చెప్పింది తప్పనుకున్నాడు పాణి.

ఈ ఊళ్ళో ఉండేవాళ్ళలో ఇద్దరు ముగ్గురు మాత్రమే మనుషులనీ మిగతావారంతా దొరవారి దొడ్లోవున్న పశువులనీ నిశ్చయించుకున్నాడు పాణి.

అడుగుల చప్పుడు విని లేచి కూర్చున్నాడు.

రామారెడ్డిగారు గదిలో ప్రవేశిస్తూ "పంతులూ! బలే బిందెలు తెచ్చినావయ్యా. అయిదురంగు బిందెలు ఒక్కచోట పెట్టే ఎంతబాగుంటుందనుకున్నా! ఒక మంచిబిందె పగలకొట్టిండు లంజకొడుకు. మళ్ళీ పట్నం పోయినప్పుడు తెస్తలె ఇంకొకటి" అని అక్కడే తగిలించి ఉన్న కెమేరాను చూచి, "ఓ! తస్వీర్లు గుంజెడిది తెచ్చినావు? నీకు తస్వీర్లు[125] తియ్యస్తదా?" అని అడిగాడు.

ఇంతకుముందే రుద్రుడైన రామారెడ్డిగారు గడియ తరువాత సౌమ్యమూర్తిగా మాట్లాడుతుంటే ఆశ్చర్యమనిపించింది పాణికి. తాను తన్నింది ఒక జంతువును అన్నంత ఇదిగా మరిచిపోయాడాయన.

"అవునండీ, ఫొటోలు తీయగల్గుదు" జవాబు చెప్పాడు.

"ఏదీ ఇట్లతే" అని తిప్పి చూచి "ఎంతైంది?" అని అడిగాడు.

"నూటాయాభై."

"శానబాగున్నది. గాజుబిందెల తస్వీర్లు గుంజుతావు?"

"తీస్తా"

"అయితేరా" అని ముందు నడిచారు రెడ్డిగారు.

ఆయన బంగళాలోంచి వెళ్ళేమెట్లు దిగుతుంటే అనుసరించడానికి సంకోచించాడు పాణి. అతడు ముందా మెట్లు దిగలేదు. పాణి రావడం లేదని గమనించి వెనక్కు తిరిగి "రావయ్యా పంతులూ" అని పిల్చుకొని వెళ్ళారు రెడ్డిగారు.

మెట్లుదిగితే పెద్దహాలుంది. ఒక్కసారి 100, 200 మంది కూర్చోగల హాలది. క్రింద చలవరాయి పరచివుంది. మూడుచోట్ల ఫరష్‌మీద పూలమొక్కల నగిషీలున్నాయి. గోడకు అంటి ఒక అడుగువరకు నల్లరాయి పరచి ఉంది. గోడలు నున్నగా ఎత్తుగా ఉన్నాయి. కప్పుకు తగిలించి నాలుగు రంగు రంగుల గాజుబుడ్లున్నాయి. నిలువెడు నిలువెడు చిత్రపటాలున్నాయి పది. వాటిలో చాలా పురాణగాథలకు సంబంధించినవే ఉన్నా అర్ధనగ్నమైన అతివల చిత్రాలూ లేకపోలేదు. దర్వాజామీద శకుంతల దుష్యంతునికి తామరాకుమీద ప్రేమలేఖ వ్రాస్తున్నట్లూ, ప్రక్కన చెలికత్తెలున్నట్లూ ఉన్న రవివర్మ చిత్రం ఉంది. పటం క్రింద అందుకు సంబంధించిన శ్లోకం 'తవనజానే మృదయం' ఉంది వెనక్కు తిరిగి చూస్తే ఆ దర్వాజాకు ఎదురుగా ఉన్న దర్వాజామీన శాకుంతలానికి సంబంధించిన మరొక రవివర్మ చిత్రం వుంది. అది విశ్వామిత్రుడు మేనకను వదిలిపోవడానికి సంబంధించింది. ఆ హాలుమాత్రం చూచినవారికి రెడ్డిగారు గొప్ప కళా ప్రియులని, రసికులనీ, అర్థం అవుతుంది. ప్రతి చిత్రాన్ని సాంగోపాంగంగా చూడాలనుకున్నాడు పాణి. కాని రెడ్డిగారు వెళ్ళిపోయారని గమనించి బంకులోకి వెళ్ళిపోయాడు.

బల్లపీటమీద రంగురంగుల గాజుబిందెలు తొమ్మిది ఉన్నాయి. నేలమీద పగిలిపోయిన గాజుబిందె బాపతు ముక్కలు పడివున్నాయి.

'తొమ్మిదొద్దు. ఒకటి తీసేసి ఎనిమిదింటి తస్వీరు గుంజు' అన్నారు రెడ్డిగారు.

ఎంకటి అది విని బంగారు రంగు గాజుబిందెను రెండుచేత్తుల్లోనూ జాగ్రత్తగా పట్టుకొని మరో బల్లమీద పెట్టాడు. రెడ్డిగారు చూస్తూ నుంచున్నారు. పాణి పోజ్ చూసి క్లిక్ మనిపించాడు. ఫ్లాష్ చమక్కుమంది. మెరుపు మెరిసినట్లనిపించింది రెడ్డిగారికి.

"అయిపోయినాది?"

"ఆ, అయిపోయింది."

'ఏదీ తస్వీరు?' చేయి చాచారు రెడ్డిగారు.

'అప్పుడే ఎట్లా? ఇందులో ఒక రీలుంటుంది. దానిమీద పన్నెండు బొమ్మలొస్తాయి. అన్నీ అయిపోయింతర్వాత కడుగుతే బొమ్మలొస్తాయి.'

'అయితే, పన్నెండు గుంజు.'

'మీరు నుంచోండి, ఫోటో తీస్తా.'

'ఇట్లనా? పోషా[126] కేసు కాస్త' అని లోనికి వెళ్లిపోయారు రెడ్డిగారు.

ఇంతలో వనజ వచ్చింది 'గిదేంది?' అంటూ.

'నుంచో బొమ్మతీస్తా' అన్నాడు పాణి.

నుంచుంది వనజ. కెమెరాలోంచి చూచి -

'కాస్త కుడికి తలవంచు. ఆ ఆ చాలు. ఒక్క చిరునవ్వు' అన్నాడు పాణి. వనజకు నవ్వే వచ్చేసింది. నవ్వేసింది., కెమెరా క్లిక్ మనడమూ, ఫ్లాష్ చమక్కుమనడమూ జరిగిపోయాయి.

"వచ్చిందా బొమ్మ?"

"ఆ"

వనజ మంజరి దగ్గరికి పరుగెత్తింది. " దొరసానీ! పంతులు తస్వీర్ల గుంజే పెట్టె[127] తెచ్చిండు. నా తస్వీరు గుంజిండు. మీ తస్వీరు తీయించుకోరి. అట్ల నిలబడ్డనా? అది 'టిక్' మన్నది. ఒక్క మెరుపు మెరిసింది. బొమ్మొచ్చిందన్నడు పంతులు" అని చెప్పేసింది గబగబా. మంజరి గుండెలో ఒక కోర్కె మెరిసింది. తానూ బొమ్మ తీయించుకోవాలనుకుంది. తండ్రి దగ్గరికి వెళ్ళింది. అద్దంలో చూచుకొని ముస్తాబు అవుతున్న రెడ్డిగారు కూతుర్ని గమనించలేదు. అద్దంలో నీడ కనిపిస్తూనే ఉంది.

'నాయ్నా!' మంజరి పిలిచింది.

వెనక్కు తిరిగి చూచి 'ఏంది బిడ్డా?' అని అడిగాడు అత్తరు పూసుకుంటూ.

"నాయ్నా. నా బొమ్మ తీయించవా?"

"మా అమ్మవు కాదు. ఎందుకు తీయించ బిడ్డా! తీయిస్త. తయారుకా" అన్నారు కూతుర్ను దగ్గరికి తీసుకొని తల నిమురుతూ.

"మా నాయ్న మంచోడు" అంటూ గంతులేస్తూ వెళ్ళిపోయింది మంజరి.

షేర్వానీ గుండీలు పెట్టుకుంటూ బైటికి వచ్చేవరకు వనజ ఎదురైంది.

"పెద్దొర్సాని తస్వీరు దిగుతదట" అన్నది.

"తయారు కమ్మను" అని చెప్పి వెళ్ళిపోయారు రెడ్డిగారు.

గడప దాటగానే అన్నాడు పాణి 'ముప్పయి ఏండ్ల యువకునిలా ఉన్నారండీ' అని.

పొంగిపోయారు రెడ్డి. "ఇట్ల నిలబడనా?" అనడిగారు.

"ఎట్లయినా నుంచోండి. పూర్తిగా తీయనా?"

" ఊ తియ్యి."

"కొద్దిగా తల పైకెత్తండి. ఆ ఆ, చాలు, ఊహు - కొద్దిగా దించాలి. ఆ చాలు."

"రెడీ" క్లిక్.

రీలు తిప్పుతూ "ఆగండి, మరొకటి. ఈ తడవ బస్ట్ తీస్తా" అన్నాడు.

రెడ్డిగారు నుంచున్నారు.

"క్లిక్"

పక్కగా నుంచుని ఒక పోజు తీశాడు.

చేతులు కట్టుకొని మెట్లక్రింద నుంచున్న వాడిమీద పడింది రెడ్డిగారి దృష్టి. "ఏమ్రా? ఏమో వచ్చినవు?" అని అడిగారు.

"కరణం దొర పంపిండు. పంతులు పట్నం పోయి ఏం తెచ్చిండట, పట్టుక రమ్మన్నడు."

"పంతులు! ఆ సామాను ముంగల పంపు" అన్నారు రెడ్డిగారు.

"చిత్తం" అని ఎంకటిని తీసుకొని వెళ్లిపోయాడు పాణి. ఒక సూట్‌కేసు, ఒక వయోలిన్ కేసు కరణానికి పంపి, పెట్టెల ముందు కూర్చున్నాడు, ఎవరివి వారికి పంపించడానికి. గులాబీలబుట్ట కనిపిస్తే వనజ కోసం చూచాడు. కనిపించలేదు. పిలిచాడు. గులాబి బుట్ట చూచి ఎగిరి గంతేసింది. బుట్ట పట్టుకొని పరిగెత్తింది, పాణి పిలుస్తున్నది కూడా గమనించకుండా మంజరి దగ్గరికి.

"చూసినా ఎన్ని గులాప్పూలో?"

వాటిని చూచి పొంగిపోయింది మంజరి. అన్ని గులాబీలు ఒక్కసారి ఏనాడూ చూళ్ళేదామె. "ఎంత బాగున్నయె పూలూ! యాడివి?" అడిగింది.

"పంతులుతెచ్చిండు పట్నం కెల్లి."

తనకు గులాబీ లిష్టమని పంతులు కెలా తెల్సో అర్థం కాలేదు మంజరికి.

"తలలో ముడువవే తస్వీర్ల వస్త" వన్నది.

వనజ సూదీ దారం తీసుకొని దండ గుచ్చసాగింది.

పూలు దోసిల్లో తీసుకొని ముక్కుదగ్గర పెట్టుకొని వాసన చూచింది మంజరి. "అబ్బ! ఎంతబాగున్నయే" అన్నది. దండమీదనుంచి దృష్టి మరల్చి చూచింది వనజ. మంజరి ఒక్కొక్కపూవె తీసి వేళ్ళ సందున పెట్టుకుంటూంది. తనలో తాను నవ్వుకుంది వనజ.

"ఇగొ పంతులు పంపిండు" అని ఒక దాసీది ఒక సూట్‌కేసు మంజరి ముందుపెట్టి వెళ్ళిపోయింది.

మంజరి పూలను వదిలేసింది. ఆతురతతో సూట్‌కేసు తెరిచింది. ఘుమ్మని పరిమళం వచ్చింది-వనజ సైతం దండ వదిలిపెట్టి వచ్చేసింది.

ఒక పెద్ద డబ్బా తీసింది మంజరి. అది యార్డ్లీ పేస్ పౌడరుది. ముక్కుకు దూరంగా పెట్టుకొని వాసన చూచింది.

"వనజా ఇందేందే?" అడిగింది మంజరి.

వనజ కూడా అలాగే చేసింది. అర్థం కాలేదు. బోర్లించింది. పౌడరు రాలింది.

"బూడిద! ఎంత వాసనున్నదీ!" అన్నది.

"ఓల్డుని బ్రిలియంటైన్" సీసా మూత తీసి వాసన చూచింది మంజరి. ఏమీ అర్థం కాలేదు. అది వనజ కందించింది. స్నో సీసా తీసింది. మూత తీసి వాసనచూస్తే చల్లని వాసన వచ్చింది.

"వెన్న" తనకు తెలియకుండానే అనేసింది.

ఈవినింగ్ ఇన్ పారిస్, చానలు నెం. 5, ఊటీ, తాజా సెంట్లు చూచారు. లేత సుగంధం హాయి అనిపించింది.

తరువాత లిప్‌స్టిక్, నైలుపెయింట్ వగైరాలన్నీ చూచారు. కాని ఇద్దరికీ ఏమీ అర్థం కాలేదు.

"పంతుల్నడిగొస్త" అని డబ్బాలన్నీ పట్టుకొని పాణి గదిలో ప్రవేశించింది వనజ.

"వనజా ! ఏం అలా పట్టుకొచ్చావ్?" అడిగాడు పాణి.

"ఇయన్ని ఏందో తెలవటం లేదట. ఏం చేయాల్నో అడిగి రమ్మన్నది చిందొరసాని"

"ఒహో అదా!" అని చేతులు దులుపుకొని కుర్చీలో కూర్చొని, వనజను కూర్చోమన్నాడు. వాటన్నింటిని ఒళ్ళో పెట్టుకొని కూర్చుంది వనజ.

ఒక్కొక్కటే తీసి దాన్ని గురించి చెప్పసాగాడు పాణి.

" ఇది బ్రిలియంటైన్. చూశావా వాసన?" అని వాసన చూసి "ఎంత బిరుసు జుట్టయినా చెప్పినమాట వింటుంది. అరచేతికి తీసుకొని నెత్తికి రాసుకోవాలి. జుట్టు ఎలా చెపుతే అలా వింటుంది."

"చిందొర్సానికి బిరుసు జుట్టని మీ కెట్లెరిక?"

పాణి ఆశ్చర్యపోయాడు. "నాకు తెలీదు" అన్నాడు.

"మరిదెట్లతెచ్చిన్రు?"

"ఆడవాళ్ళంతా వాడ్తారు. మగవాళ్ళు కూడా వాడ్తారు. ఇదిగో, నేనూ తెచ్చుకున్నా."

మిగతావాటి విశేషాలన్నీ తెలియపర్చి, వాటిని వాడే పద్ధతి చెప్పి వనజను పంపించేశాడు పాణి.

వనజ దూరంగా ఉండగానే అన్నది మంజరి - "వనజా! చూడు చీరెంత బాగున్నదో!" అని "అబ్బ నీలిరంగు నాకెంతో ఇష్టం" అన్నది రంగూన్ బ్యూటీ చీర చూపుతూ. "అంచు అసలే లేదు. అక్కడక్కడ మెరుపు చుక్కలున్నాయి. ఇది కట్టుకుంటే నేనెట్లుంటనో" అని చేతిమీద చీర వేసుకొని ముఖంలోకి చూస్తే వనజ ముఖంలోని రక్తం దిగిపోయి ఉంది.

"ఏమొ అట్లున్నవు"

ఈలోకంలోకి వచ్చింది వనజ. " ఏంలేదు" అన్నది.

"చూడు ఈ చీర నాకెట్లుంటదో?" మళ్ళీ అడిగింది.

"కట్టుకుంటే మబ్బుల్ల మెరుపోలె ఉంటరు."

ఆ చీర అక్కడ పడేసి మరొకటి తీసింది. అది గులాబీ రంగుది. మొత్తం విప్పింది, తనకు చుట్టుకుంది.

"వనజా! చూడు ఈ లేతరంగెంత బాగున్నదో!"

లేని సంతోషాన్ని తెచ్చిపెట్టుకోడానికి ప్రయత్నించింది వనజ. "శాన బాగున్నది. నీలిచీరె యింకా బాగున్నది" అన్నది.

మంజరి చిన్నబుచ్చుకుంది. "అట్లయితే నువ్వే తీసుకో" అని వనజ మీద పారేసింది.

వనజ కేమీ అర్థం కాలేదు. మంజరి ముఖం చూసింది. అందులో కోపమూ, ప్రసన్నతా రెండూ కనిపించలేదు.

"నాకెందుకండి, దాసిదాన్ని! మీకైతేనే బాగుంటుంది. చీరే గులాపూవ్వులల్ల ఏస్తే యాడున్నదో సుత కండ్లపడదు చూడురి" అని చీర గులాబీ పూలల్లో వేసింది.

"అవునే వనజా! పూలల్ల కల్సిపోయింది రంగు" అని గులాబీలనూ, చీరనూ చూసింది. ఆ చీర తీసి వనజ మెడలోవేసి "ఈ చీరె ఇనాం[128]" అన్నది మంజరి.

చకితయై చూచింది వనజ.

రామారెడ్డిగారు ఫోటో దిగిం తర్వాత దుస్తులు మార్చడానికి తన గదికి వెళ్ళారు. అద్దంలో చూచుకున్నప్పుడు మంజరి ఫోటో దిగుతానన్న మాట జ్ఞాపకం వచ్చింది. మంజరి ఫోటో ఎవరుతీస్తారు? దొరసాని ఫోటో? పాణిచేత తీయించరాదు. ఫోటో తీయించకుంటే మంజరి చిన్నబుచ్చుకుంటుంది. ఎలా కుర్చీలో కూలబడి ఆలోచించసాగాడు. పాణి ఫోటో ఎలాతీశాడు? కెమెరా మెడకు తగిలించుకుని 'క్లిక్' అనిపించాడు. తాను అలా చేయలేడా? ఆ అదేమంత కష్టం? కాని తానొక ప్రభువు. ఫోటో తీస్తాడా! ఆడవారికి ఫోటో తీయడం నేర్పుతే! ఎవరికి నేర్పాలి? వనజకు. వనజ దాసి. ఆడవారి ఫోటోలు తీస్తుంది. ఆహా ఆ తోలుపట్టా మెడకు తగిలించుకొని 'క్లిక్' మనిపించడంలో ఏదో తమాషా ఉందనిపించింది. తానే అనిపిస్తే సరి. కాని ఆ విషయం ఎవరికి తెలియనీయరాదు. రహస్యంగా ఉంచాలి. అవును, రహస్యంగా ఉంచాలి. తానే ఫోటోలు తీయాలి.

తామే ఫోటోలు తీయాలనే నిర్ణయం జరిగింతర్వాత పాణి గదికి వెళ్ళారు రెడ్డిగారు, పుస్తకం చదువుతూ మంచం మీద పడుకున్న పాణి రెడ్డిగారిని చూచి నుంచున్నాడు.

గదిలో అడుగుపెడుతూనే " పంతులూ, పెద్ద తిప్పలే[129] తెచ్చిపెట్టినవు గద" అన్నాడు.

సారంగపాణి సుమారు ఉలిక్కిపడ్డాడు. 'ఏమైంది దొరవారు' అని అడిగాడు

"ఏం లేదుగని చిందొరసాని, పెద్దొరసాని తస్వీర్లు దిగుతమంటాన్రు. ఎట్లనా అని అలోచిస్తాన్న."

పాణి గ్రహించాడు. అంతఃపురంలోకి తాను వెళ్ళరాదు. వారికి ఫోటోలు కావాలి. 'ఆలోచించేదేముందండి, మీరు తీయండి.'

తన మనసులోని మాట గ్రహించాడనుకున్నాడు రెడ్డిగారు.

'నాకు తియ్యొస్తాది?'

'ఎందుకు రాదు?' అని కెమెరా దొరవారి మెడలోవేసి క్రింద గ్రౌండ్‌గ్లాస్‌లోకి చూడమన్నాడు పాణి.

'ఏం కనిపిస్తూంది?'

'కిటికీ'

'క్లిక్ మనిపిస్తే కిటికీ ఫోటో వస్తుంది' అని ఫోటో తీసే పద్ధతంతా చెప్పాడు పాణి. తన ఫోటో సైతం తీయించుకున్నాడు. కెమెరా రెడ్డిగారికిచ్చి 'తీసికెళ్ళండి ' అన్నాడు పాణి.

కెమెరా తీసుకొని వెళ్ళిపోతూ 'పంతులు! కరణంతో గిట్ల అనేవు నేను తస్వీర్లు తీస్తనని' అన్నారు.

'అబ్బే నాకెందుకండీ!'

'గడీల కూడ ఎవ్వరికీ తెల్వవద్దు'

'సరేనండి'

రెడ్డిగారు వెళ్ళిపోయారు. పాణి కరణం ఇంటికి బయల్దేరాడు. కరణం ఎవరితోనో మాట్లాడుతూ కూర్చున్నాడు సావిట్లో. పాణి చేసిన నమస్కారాన్ని అందుకొని "పంతులూ, వెంకట్రావును మరచిపోయినట్లున్నదే!" అన్నాడు.

'లేదండీ, రాగానే గాజుబిందెల గొడవ జరిగిందా?' అణుకువగా జవాబు చెప్పాడు పాణి.

'ఏందేంది? గాజుబిందెలేంది!' అడిగాడు కరణం. తెలిసీ తనచేత చెప్పించాలని చూస్తున్నాడు కరణం అని గ్రహించాడు పాణి. ముక్తసరిగా చెప్పేశాడు.

'లంజకొడుకులు. అంత ఖీమతీ[130] గల గాజు బిందెలు ఎహొత్యాలుగ[131] పట్టుకోవద్దు? మస్తి[132]

కండ్లకెక్కింది గాడ్డికొడుకులకు. వానికి ఆయుస్సున్నది కాబట్టి బతికిపోయిండు. కోపమొస్తే దొర పులైత డనుకో. ఎంటపడి ఎందుక్కొట్టలేదో ఆశ్చర్యంగున్నది' అని సారంగపాణి వైపు చూచాడు, అతని వ్యాఖ్యానం ఆశిస్తూ.

పాణి జవాబు చెప్పలేదు.

'పెట్టెటోడు కొత్తె పడకుంట తప్పుతాదుండి!' అన్నాడు అక్కడున్న వారిలో ఒకడు.

ఆ మాట నచ్చలేదు కరణానికి.

'అచ్చ. మళ్ళరాండ్రి' అన్నాడు అక్కడున్న వారి నుద్దేశించి.

లేచి నుంచున్నాడు కరణం.

అంతా లేచి నుంచున్నారు. దండాలు పెట్టారు. వెళ్ళిపోయారు.

"పంతులూ! ఏన్నొద్దులు పోయినవు?"

"మూడురోజులే కదండీ!"

"నీకట్లనే అనిపిస్తది. తాయా రెంత యాది చేసిందనుకున్నావ్?"

"పంతుల్ను కదండీ"

"ఏం పంతులువో ఏమో? ఆ మరచిన. తస్వీర్ల గుంజేపెట్టె తెచ్చినవట గద. తేకపోయినావు? మా తస్వీర్ల గుంజితే తప్పా? ....."

రెడ్డిగారు తీసుకున్నారనే మాట నోటిదాకా వస్తే మింగేసి "దాన్ని అన్‌లోడ్ చేయాలండీ" అన్నాడు.

"అంటే?"

"రీలు తీసి వేరే రీలు వేయాలి."

"రేపు తెస్తవా? తాయారు తస్వీరు దిగుతదట."

"అలాగేనండి"

కరణం జీతగాణ్ణి పిలిచాడు. పంతులు వచ్చాడని తాయారుకు చెప్పమన్నాడు. వాడు తిరిగివచ్చి " రమ్మంటాంది" అన్నాడు.

ఇద్దరూ గదిలోకి వెళ్ళారు. తాయారు పాణి తెచ్చిన పసుపుపచ్చ చీర కట్టుకుంది. జ్యోతిలా బొట్టు పెట్టింది. గులాబీల పరిమళం గుప్పింది. అప్పుడనుకున్నాడు పాణి - దుస్తులు మనిషికి అందాన్ని తెచ్చిపెడతాయని.

తాయారు నమస్కరించింది. పాణి ప్రతినమస్కారం చేసేప్పుడు తాయారు పెదవులమీద అణచిపెట్టుకుంటున్న చిరునవ్వు గమనించకపోలేదు.

"ఇంకా స్నానం చెయ్యలేదు వస్త" అని వెళ్ళిపోయాడు కరణం.

"తాయారు! చీర నచ్చిందా?"

"మీకు పసందైతే నాకెట్ల పసందు కాదు?"

"ఆడవాళ్ళను మెప్పించడం ..."

" ఈ చీరల ఎట్ల కొత్త[133]" తలవంచుకొని అడిగింది.

"అవిటిఅనేగాని రంభలా ఉన్నావు."

అవిటి అనేమాట తాయారును బాధ పెట్టిందనే విషయం గమనించిన పాణి మాట మార్చటానికి,

"మిగతా సరుకులన్ని బాగున్నాయా?" అని అడిగాడు.

"శాన బాగున్నె. కాని మంజరి కేం చీర తెచ్చి(న్రు?"

"మంజరికా? ఆకాశం రంగుచీర, నీలంది,"

"మంజరి ఛాయకు అతికినట్లుంటది."

"మంజరి ఏ చాయ?"

"చూడనేలేదులే? అయినా దొరసానులు కండ్లబడ్తారు?"

"మంజరి ఏం చాయో చెప్పావు కాదు?"

"చామనచాయగుంటది. ఏలెడు జుట్టూ, అదీ, కండ్లు నెత్తినుంటయు దొరబిడ్డనని."

"పాఠం చెప్పుకుంటావా కొత్త ఫిడేలు మీద?" విషయం మార్చడానికి అన్నాడు.

"రేపు" అన్నది వంకర చూపు చూచి.

"సరే వస్తా" అని లేచాడు పాణి.

"జర లేపురి" అన్నది చేయి చాచి.

చుర్రుమంది పాణికి. కాని అణచుకొన్నాడు. చెయ్యి ఊత ఇచ్చాడు. లేస్తూ కళ్ళలోకి చూసింది తాయారు. చూపు దించుకున్నాడు పాణి.

దాసీదైనా వనజ ఇంతకంటే వేయిరెట్లు మేలు అనే ఊహ మెరుపు కొట్టినట్లయింది పాణికి.

గదికి వెళ్ళేసరికి కెమెరా అక్కడ తగిలించి ఉంది. గబగబా రీలుతీసి డెవలప్ చేశాడు. ముందు మంజరి నెగెటివ్ కత్తిరించి చూచాడు. వనజ చెప్పింది నిజం. ఎంత దట్టంగానూ, చిక్కగానూ ఉన్నాయి వెంట్రుకలు? చాలా పెద్దగా ఉన్నాయి కండ్లు. కోలముఖం. మాంసిలములైన కపోలాలు. కుడిచెక్కిలిమీద ఏదో మచ్చ. తుడిచి చూచాడు. అలాగే వుంది. చిన్న చుబుకం. పల్చని పెదవులు. ముక్కుకంటే కొద్దిగా పొడవుగా ఉన్న చెవులు, వాటికి ఏడురాళ్ళ దుద్దులు.

ఎంత సొగసు!

ప్రింటు చేశాడు. పూర్తిగా ఆరకముందే మళ్ళీ చూచాడు.

ఎంత సోయగం ఉంది కళ్ళల్లో!

అన్నింటిని ప్రింటు చేశాడు.

వనజ ఫోటో తీసి చూశాడు.

రెంటినీ ఒకచోట పెట్టి చూచాడు. పోల్చి చూచాడు!

ఇద్దరి కళ్ళలోనూ సామ్యత కనిపించింది.

అది ఆశ్చర్యం కలిగించిందతనికి.

ఒక దాసీదానికీ, దొరబిడ్డకూ రూపంలో పోలిక లేమిటి? మంజరి మెడ పొడవు. వనజ మెడ కురచ. ఫోటోనుబట్టి చూస్తే మంజరి వనజ కంటే పొడుగ్గా వుండాలి. పుటాలు పెట్టిన బంగారంలా మంజరి ఉంటే - పుటం పెట్టని బంగారం లాంటిది వనజ. తాయారు గుర్తుకు వచ్చింది. చేయి ఊత ఇచ్చి లేపమనడం, కళ్ళల్లోకి చూడ్డం గుర్తుకు వొచ్చింది.

"పట్టి ముడి ఇనుము" అనుకున్నాడు.

తలుపు తట్టిన చప్పుడైతే ఆలోచనల దారం తెగింది. తలుపు తీసి చూస్తే రెడ్డిగారు!

"ఏం పంతులు! తస్వీర్లు వచ్చినయా?"

"రండి కూర్చోండి. కొద్దిగా తడిగా ఉన్నాయి. అయినా చూడొచ్చు" అని రెడ్డిగారి ఫోటో అందించాడు.

దీక్షగా చూచారు రెడ్డిగారు. 'శాన బాగున్నది' అనే మాట స్వతహాగానే నోటినుంచి వచ్చింది.

తనను పూర్తిగా పటంలోకి దించేసినట్లుంది. మళ్ళీ మళ్ళీ చూసుకున్నారు అద్దంలో చూసుకున్నట్లు. సాక్షాత్తు తన ప్రతిమ కాగితం మీదికి వచ్చింది. ఎంత విచిత్రం!

"ఇదిగో , మీదే మరోపటం" అందించాడు పాణి.

అది బస్టు - చాల చక్కగా వచ్చింది. చూచారు రెడ్డిగారు. రెండు పటాల్ని ఒకేచోట చేర్చి చూచుకున్నారు. మురిసిపోయారు. పెద్దతనం అడ్డురాకుంటే ఎగిరి గంతేసేవారే!

"పంతు లెంత మంచివాడు! చక్కని సంగీతం వినిపిస్తాడు. మంచి గాజుబిందెలు తెచ్చిపెట్టాడు. ఎంత మంచి బొమ్మలు తీశాడు. ఇంకెన్నో కొత్త విషయాలు చెపుతాడు! చాలా తెలివైనవాడు. గడీలో ఉండదగినవాడు. వెళ్ళనీయరాదు" అనుకున్నారు.

"ఇవికూడా చూడండి" అని మిగతా ఫోటోలు అందించాడు పాణి. ఒక్కొక్కటే తీసి చూచారు రెడ్డిగారు. వనజ ఫోటో చక్కగా వచ్చింది. లావుగా, పొట్టిగా, చిక్కుజుట్టు, చిన్నకళ్ళు కనిపించాయి. రోజా చూస్తూనే ఉన్నాడావిణ్ణి. కాని పటంలో చూచేవరకు వయసు తిరిగివచ్చినట్లనిపించింది.

"ఇంత చిన్నగున్నయి పెద్దగ కావా?" రెడ్డిగారు.

"అవుతాయి కాని, నాకు చేయడం చేతకాదు. పట్నం పంపించాలి, పెద్దగై వస్తాయి."

"అట్లనా! అయితే పంపు" అని కాస్త ఆలోచించి, "నాలుగు దివాలైనన్క పంపు, అందరూ చూస్తరు" అన్నాడు.

"అవి మీరు చూడొచ్చు. పంపేవి వేరే వున్నాయి."

"అట్లయితే సరి. దొరసాన్లకు చూపించుకొస్త" అని లేచి "కరణం మింటికి పోయినావా?" అని అడిగారు.

"అవునండీ, వెళ్ళానండీ!"

"తస్వీర్ల సంగతి గిట్ట ఎల్లిందా?"

"అబ్బే, లేదండీ......" అని ఏదో చెప్పబోతుండగానే గది దాటి వెళ్ళిపోయారు రెడ్డిగారు.

రెడ్డిగారు వస్తారని ఎదురు చూచాడు పాణి. చాలా రాత్రి అయింది. రెడ్డిగారు వచ్చే సమయం కూడా దాటిపోయింది. ఇక రారని నిశ్చయించుకొని ఫిడేలు శ్రుతిపెట్టి ఆలపించసాగాడు. వనజ భోజనపు పళ్ళెంతో ప్రవేశించింది.

మెరుగులు పెట్టిన బంగారంలా కనిపించింది.

గులాబీ రంగుచీర కట్టుకుంది. అది పాణి మంజరికోసం తెచ్చింది. కాటుక తీర్చటంలో కళ్ళు తూపులుగా మారాయి. అసలే ఎర్రని పదవులు మరీ ఎర్రగా కనిపించాయి. బొట్టులోకూడ ఏదో నవ్యత గోచరించింది. అది అతని కంట్లో వచ్చిన మార్పో, బొట్టులో వచ్చిన మార్పో చెప్పడం కష్టం.

ఫిడేలు పట్టుకొని అలాగే లిప్తపాటు ప్రతిమగా మారిపోయాడు పాణి. తరువాత తేరుకున్నాడు.

'వనజా! ఎంత అందంగా ఉన్నావో తెలుసా?' అన్నాడు మంచందిగుతూ

పళ్ళెం కావిడి పెట్టెమీద పెట్టింది.

'పట్నంకెళ్ళి తెచ్చిం చీరే' అని కొంగుచూపి, 'చిందొరసాని ఈనాం ఇచ్చింది' అన్నది.

ఆవిడ కళ్ళల్లో ఆనందం తాండవించింది.

"వనజా! మంజరి ఎంత మంచిది! నిన్ను పూర్తిగా తామరపూవును చేసింది. జుట్టెలా ఉందో తెలుసా!"

కళ్ళు పెద్దవిచేసి చూసింది.

"తుమ్మెదల్లా."

తలవంచుకుంది. " సర్లేరి. అన్నం తినురి."

కుర్చీ జరుపుకొని కూర్చున్నాడు. "ఏమిటిది యిన్ని పిండి వంటలు! తినగలనా?' అన్నాడు.

"ఇగ దినాం పిండొంట లొస్తయి. దొర చెప్పిండు. ఇయ్యి తినలేరా? మా అమ్మ అనేది-వయస్సులున్నోరు రాళ్ళు తిని రాళ్ళు అరిగించుకోవాల్నని" అని గిన్నెడు నెయ్యి గుమ్మరించింది వనజ.

కమ్మని వాసన గుప్పుమన్నది. తలెత్తి చూశాడు పాణి. చిలిపితనం కనిపించింది వనజ కళ్ళల్లో. ఒక్కొక్కటే వేసి అన్నీ తినిపించింది వనజ ఆ మాటా ఈ మాటా చెప్పి. తనకు తెలియకుండానే అన్నీ తినేశాడు పాణి. చేయి కడుక్కుని తాంబూలం అందుకుంటూ వనజను కుర్చీలో కూర్చుండబెట్టి 'తాయారు ఏమందో తెలుసా? మంజరి నల్లగా కాకిలా ఉంటుందని' అన్నాడు.

'కుంటిది- ఓర్చలేదు. మంజరి పుఠమేసిన బంగారుమోలే ఉంటది. ఎంత మెచ్చుకున్న దనుకున్నరు నిన్ను.'

'ఎందుకు'

"మబ్బురంగు చీర తెచ్చినందుకు. ఆ చీరె కట్టుకుంటే మబ్బుల్ల మెరుపోలె ఉన్నదనుకోరి చిందొరసాని."

"ఫోటోలు చూశారా?"

"అంటే?"

"తస్వీర్లు."

"ఓ. చూసినం. చిందొరసానైతే అయ్యిపట్టుకొని జింకోలె ఎగిరిందనుకోరి."

"వనజా! ఒక్క మాటడగనా?"

"అడుగుర్రి." ఆతురత కనబర్చింది.

"మంజరి కళ్ళలో నీ పోలిక లెందుకున్నాయి?"

వనజ తడబడింది. ఉత్సాహం చచ్చింది. గుండె దడదడలాడింది. కళ్ళులోంచి రక్తం దిగిపోయింది. కొత్త గులాబీ చీరమీద బాష్పబిందువులు టపటపా రాలాయి.

అలా అడిగి తప్పుచేశా ననుకున్నాడు పాణి. అతని మనస్సు బాధపడింది వనజను బాధ పెట్టినందుకు. "పోనీ వనజా! నీ కన్నీరు చూడలేను" అన్నాడు.

పెద్దగా ఏడ్పు వచ్చింది వనజకు. పైటకొంగు నోట్లో పెట్టుకొని గదిలోంచి పరిగెత్తింది.

"వనజా!....వనజా!....." అంటూ మెట్లదాకా వెళ్ళాడు పాణి. కాని వనజ అందలేదు.

సారంగపాణి బాధ ఆశ్చర్యంగా పరిణమించింది. మంజరిని గురించి అడుగుతే వనజ కెందుకో దుఃఖం! వనజ దాసీది. మంజరి దొరకూతురు. వీరిద్దరి పోలికల సామ్యం ఏమిటి? ఇందులో ఏదో రహస్యం

ఉంది. బైట పెట్టరాని, విడదీయరాని రహస్యం యేదో ఉంది. అంతా విచిత్రం!

రాజభవనాలు కుట్రలకు ఆలవాలాలు. అవినీతికి ఆకరాలు. అక్కణ్ణుంచే నీతీ, శాసనమూ పుట్టాయి.

సీజరు భార్యను శంకించడానికి వీల్లేదు!

## 10

పట్నం నుంచి ఎవరో వచ్చారని చెపుతే బయటికి వచ్చారు రామారెడ్డిగారు.

అప్పటికి సాయంకాలం అవుతూంది.

వచ్చినతను తనను తానే పరిచయం చేసుకున్నాడు, ముందు రెడ్డిగారికి నమస్కరించి -

"నా పేరు నరేందర్. హైదరాబాద్‌లో ఆర్యసమాజంలో పనిచేస్తుంటాను. బహదూర్ యార్‌జంగ్ మతాంతీకరణం చేసి రాజ్యమంతా తురకల్తో నింపేయాలనుకున్నాడు. అలా తురకలైన వారందర్నీ శుద్ధిచేసి తిరిగి హిందువులుగా చేయాలని ఆర్యసమాజం నిర్ణయించింది. వారి ఆదేశం మేరకు నేను బయల్దేరాను. పెద్దవూరు, చిన్నవూరు, వావిలపల్లి, నర్సాపురం, ఆలేరు మున్నగు ప్రాంతాలకు వెళ్ళి మతం మార్చుకున్నవారి నందర్నీ హిందువులను చేశాను. మీ గ్రామంలో బహద్దుర్ యార్‌జంగ్ స్వయంగా వచ్చి మతం మార్చాడని తెలిసి ఇక్కడికి వచ్చాను. మీరు నాతో సహకరించాలి, హిందూమతాన్ని రక్షించాలి."

ఉపన్యాసం విని సుమారు ఉక్కిరిబిక్కిరైనారు రెడ్డిగారు. ఏమనాలో తోచలేదు ముందు. బుర్ర గోక్కున్నారు. చుట్ట వెలిగించారు.

"హిందూమతం అతి సనాతనం అయింది. పశ్చిమదేశాల ప్రజలకు బట్ట సహితం కట్టుకోవడం తెలియని కాలంలో ఆర్యావర్తమైన ఈ దేశంలో గొప్ప నాగరికత వెలిసింది. అపౌరుషేయమైన వేదం కంటే మిన్న అయిన గ్రంధం లేదు. మన మతాన్నీ, మన ధర్మాన్నీ వదిలి మనం భ్రష్టులం అవుతుంటే - వాటితో విదేశీయులు లాభం పొందుతున్నారు. మనం మేల్కొనకుంటే మన మతం ఈ రాజ్యంలో లేకుండా పోతుంది. కాబట్టి, మీరు ఈ విషయంలో నాతో సహకరించాలి. వేద మతాన్ని కాపాడాలి."

రెడ్డిగారు ఆయన చెప్పిందేమీ విన్నట్లు లేదు.

"అచ్చా! మీరేం చేస్తరు?" అడిగారు.

"శుద్ధి చేస్తాం."

"అంటే!"

"హోమంచేసి తురకలుగా మారినవారిని మళ్ళీ హిందువుల్ని చేస్తాను"

"ఊహు. అయితే ఏం లాభమైతది"

అలాంటి ప్రశ్నను ఎదుర్కోవడానికి సిద్ధంగా లేడు నరేంద్రజీ. లాభమంటే ఏమిటో అతనికి అర్థంకాలేదు. కాస్త ఆలోచించి "దొరవారూ ! తరకలు కాకుండా వుంటేనే ఈ మాల మాదిగలు మీ చేతుల్లో ఉంటారు. తురకలైతే రాజులమైపోయామనుకుంటారు. మీ మాట వినరు, వెట్టిచేయరు. ఆ విధంగా మీకు నష్టం కలుగచేస్తారు" అన్నాడు.

"హు. మీకు రామారెడ్డి సంగతి ఎరికే లేనట్లున్నది. నా పేరు చెప్పితే ఉచ్చపడ్తది లంజకొడుకులకు. ఇంక నా మాట ఇనరనుకుంటాన్నారు? వాండ్లు తురకోండ్లయిన, బాపనోండ్లయిన, నేను ఎట్ల దున్నమంటే అట్లు దున్నాలే - ఎరికేనా?" అన మీసం మెలేశారు రెడ్డిగారు.

'మీ అధికారం తక్కువగా ఉన్నదని కాదు నేననడం. ఇవ్వాళ నీ బాంచను, నీ కాల్మొక్తనని చేసేవాడు, రేపు మీకు భయపడి చేస్తాడు. మీరొక దెబ్బ కొట్టినా, తన్ను తన్నినా పోలీసుల వద్దకు వెళ్ళాడనుకోండి. వాడిమాటే వింటారు పోలీసులు కాని, మీమాట వినరు. అప్పుడు పరిస్థితి ఎలా ఉంటుందో ఆలోచించండి. మీ అధికారానికి భయపడి ఈ కొత్త తురకలిలా ఉన్నారు కాని వేరే చోట్లలో ఎన్ని మోరాలు చేస్తున్నారో తెల్సునా! తురకలు కాగానే బావులు ముట్టుకుంటున్నారు. ఊళ్ళోవాళ్ళేమైనా గడిబిడిచేస్తే బావుల్లో ఆవు మాంసం వేస్తున్నారు. చచ్చిన జంతువుల్ని మేం తీసెయ్యమంటే బ్రాహ్మణులు తీసుకోవాల్సి వస్తున్నది.

"సత్యాపురం వెళ్ళాను, మహబూబ్ రెడ్డిగారి దగ్గరికి. వారు పూర్వపు మాదిగవాణ్ణి పిలిపించారు. వాడు వచ్చి, ఎందుకు పిల్చారని అడిగాడు. చచ్చినగొడ్డును తీసికెళ్ళమన్నారాయన. వాడేమన్నాడో తెలుసునా? "ఏమయ్యో రెడ్డాయనా! చచ్చినగొడ్లం తీస్కపోవడాన్ని తురకల్ల కల్సినమనుకున్నావా? సర్కారు మాది, ఎరికెనా నీకు?" అని.

"మహబూబ్ రెడ్డిగారు కొద్దిగా కోపంచేస్తే, "ఏం చేస్తవయ్యానువ్వు? నేనేం మాదిగోణ్ణనుకున్నావా? తురకోణ్ణి" అని వచ్చి మా పక్కనే కుర్చీమీద కూర్చున్నాడు. మహబూబ్ రెడ్డిగారు ఎంత పెద్ద జమిందారో మీ కెరుకే కదా? అంతవాడూ ఏమీ చేయలేకపోయాడు. తెగబడ్డవాణ్ణి ఏం చేస్తాం చెప్పండి? అలాంటి వారందరికీ నచ్చచెప్పి హిందువుల్ని చేశాను. ఇప్పుడు రెడ్డిగారెలా చెపితే అలా వింటున్నారు పనిపాటలవాళ్ళు" అని రెడ్డిగారు ముఖంలోకి చూచాడు నరేంద్రజీ.

మహబూబ్‌రెడ్డిగారి పేరు విని కొద్దిగా కరిగారు రామారెడ్డిగారు.

"సరేగాని, మీరేమో జంధ్యమేసి, మంత్రంచెప్పి, బాపన్లను చేసి నెత్తికెక్కించుకుంటరట కద?"

"అదేం లేదు. వారిని శుద్ధిచేసి వారి పూర్వపు పేర్లు వారికి పెట్టాను అంతే."

"అచ్చ. అట్లయితే సరేగాని ఏం కావాల్నంటరు?"

"హోమంచేయడానికి స్థలం కావాలి. సమిధలు, నెయ్యి కావాలి."

"ఇదిగో చూశ్రినా, ఈడ జాగెవ్వడియ్యడు. నెయ్యి ఎవ్వడియ్యడు. అవ్వేమిలేకుండ చేస్తమంటరా - రేపొద్దుగాల చేసి గమ్మున బైటపడురి. గడీల కొచ్చినట్లు ఎవ్వరికి ఎరికే కావద్దు. రాత్రికి వంటకు గుళ్ళ ఇంతేజామ్ చేసుకోరి. మీ ఇష్టం."

"మంచిదండీ. అలాగే ఏర్పాటు చేసుకుంటా, మరి శలవా?"

"అచ్చా, పోయిరాండ్రి, ఈడకొచ్చినట్లు ఎవరికన్న ఎరికే కానిచ్చేరు. ఖాస్కర్[134] కరణాన్కి"

"అలాగేనండీ" అని నరేంద్రజీ నేరుగా హరిజనవాడకు వెళ్ళాడు. అప్పటికి పూర్తిగా సాయంకాలం అయింది. చంద్రుడు ఉదయించాడు కూడ. ఆయన స్వయంగా వెతుక్కుంటూ పుల్లయ్య గుడిసెకు చేరి పిలిచాడు. అతడు గూడానికి రావడమే ఆశ్చర్యమనిపించింది అందరికీ. అందరూ దర్వాజాల్లో వచ్చి నుంచొని చూడసాగారు. పుల్లయ్య బైటికి వచ్చాడు. నేలకు తల ఆనించి దండం పెట్టాడు. నరేంద్రజీ రాకకుగల కారణం తెలియజేశాడు.

"దొరా! నువ్వు దేవునోలె వచ్చినవు. మా దొరతో చెప్పినం నిన్ను పిలిపించమని. మమ్మల్ను కులంల కలుపురి, నీ బాంచను" అని మళ్ళీ దండం పెట్టి "మా గూడెంల కొచ్చిన్రు ధర్మదొరలు. మంచమేస్తె కూర్చుంటారా? జర సేపట్ల అందర్ని పిల్చుకొస్త" అన్నాడు.

"పుల్లయ్యా! నేను బ్రాహ్మణ్ణి. అయినా, మనమంతా ఒకటే. ఒకే మతానికి చెందినవాళ్ళం - హిందువులం. మీ మంచంమీద కూర్చోవడం కాదు, మీ ఇంట్లో తింటాను. దప్పికగా వుంది కాసిన్ని నీళ్ళివ్వు.

తరవాత మంచం వెయ్యి. కూర్చుంటా. అందర్నీ పిలువు - ఈ రాత్రికి మిమ్మలను హిందువులనుచేసి వెళ్ళిపోతా" అన్నాడు నరేందర్‌జీ.

పుల్లయ్య ఉక్కిరిబిక్కిరైనాడు. ఆనందం పట్టలేకపోయాడు. గొంతులోంచి మాటసైతం పెకల్లేదు. వెంటనే గుడిసెలోకి పరిగెత్తి ముంతతో నీళ్ళు తెచ్చిచ్చాడు. ఆ తరువాత మంచం వేశాడు. నరేంద్రజీ మంచంమీద కూర్చున్నాడు. పుల్లయ్య అందర్నీ పిలవడానికి వెళ్ళాడు.

క్షణంలో గూడెమంతా ఒకచోట కూడింది. ఈ సంస్కరణ చూడడానికి అన్నట్లు చంద్రుడు పైకి వచ్చి వెన్నెల విరిశాడు.

నరేందర్‌జీ వాళ్ళకిలా చెప్పాడు:

"సోదరులారా!

"మనంతా హిందువులం. మనందరికీ ఒకడే దేవుడు. వేదకాలంలో కులాలు లేకుండే. 'మనమంతా ఒకేచోట తినాలి. ఒకేచోట కూర్చోవాలి' అంటుంది వేదం. "నజ్యేష్ఠాసో నకనిష్ఠాసో" అంటుంది. అంటే మనలో ఒకడు పెద్దవాడుకాని, ఒకడు చిన్నవాడుకాని లేడని అర్థం. కులాలు కొందరు స్వార్థపరులైనవారు- ముఖ్యంగా బ్రాహ్మణులు సృష్టించినవి. అంటరానివాడూ అంటవచ్చినవాడూ అనేది యే శాస్త్రంలోనూ, ఏ వేదంలోనూ చెప్పబడలేదు. అవి మానవులు సృష్టించినవి. దేవుడు మనందరికి తండ్రి, అతని దృష్టిలో అందరూ సమానులే. మన మతం ఈనాటిది కాదు. కొన్నివేల సంవత్సరాల నుండి వస్తున్నది. మతం మార్చడంవల్ల కలిగే ప్రయోజనంలేదు. తురకల్ను చేసి మిమ్మల్నందర్నీ ప్రభువుల్ను చేస్తామని చెపుతారు. కాని, తిండిలేక మాడే తురకల్లేరా? ముసల్మానులంతా ఒకటే అని చెపుతారు కదా! మన హుజూర్ కొడుక్కు మీ కూతుర్ను చేసుకుంటాడా? ఆయన వచ్చి మీతో కూర్చొని తింటాడా? పోతే, మనలో కులాలు ఉన్నాయని వెక్కిరించేవారి మతంలో కులాలు లేవా? షియాల పిల్లలను సున్నీలు చేసుకోరు. సున్నీ వాడెవడైన మంచినీళ్ళడుగుతే షియా వాడు ఉమ్మి ఇస్తాడు. మహమ్మదు చివరి ప్రవక్త అని నమ్మేది ఇస్లాం. మెహద్వీ తెగకు చెందినవారు మహమ్మద్ తరువాత వాడు అయిన మెహదీని ప్రవక్తగా భావిస్తారు. వారి తెగకు చెందినాడే బహద్దూర్ యార్ జంగ్. వాస్తవంగా అతడు ముసల్మాను కాడు. అలాంటివానికి మిమ్మల్ని ముసల్మానులను చేసే హక్కు ఎక్కడిది? వర్గద్వేషాలు వాళ్ళలో మనలోకన్నా ఎక్కువ ఉన్నాయి. వాటినన్నింటినీ కప్పిపుచ్చి, అమాయకులైన మిమ్మల్ని మోసగిస్తున్నారు. వారిచ్చే భూములవల్ల మీరు ధనవంతులౌతారా? మనం కష్టం చేయాలి. భాగుపడాలి. చారెడు నేల చెక్కకోసం తండ్రి తాతల్నుంచి వచ్చే మతాన్ని వదులుకుంటామా? మన దగ్గర కొన్ని దురభ్యాసాలున్నాయి. వాటిని మనం వదులుకోవాలి. తాగుడు మానెయ్యాలి. దానివల్ల ఎంత డబ్బు పాడౌతుంది? శరీరం ఎంత పాడౌతుంది? ఆలోచించారా? మాంసాదులు తినడం మానివేయాలి. రోజూ స్నానం చెయ్యాలి. శుచిగా, శుభ్రంగా ఉండాలి. చదువుకోవాలి. మీ పిల్లలకు చదువు చెప్పించాలి. అలా అయితే మీ అంతట మీరే బాగుపడతారు. చెప్పండి. ఇప్పుడు హిందువులవుతారా?" అని అడిగాడు నరేంద్రజీ.

"అవుతం" అన్నారు అంతా ఒకే గొంతుతో.

"అయితే స్నానాలు చేసి రండి" అన్నాడు నరేంద్రజీ.

అంతా వెళ్ళిపోయారు. అందరూ శ్లాఘించారాయన్ను.

స్నానాలుచేసి వచ్చేశారంతా. ఒక ముంతలో మంచినీరు తెప్పించాడాయన - హోమంచేసే అవకాశం లేదు కాబట్టి. తన సంచీలోంచి ఒక సీసా తీశాడు. అది చూపించి, "ఇది గంగాజలం. కాశీనుంచి తెప్పించాను.

దీనిని మీ నీళ్ళల్లో కలిపేస్తున్నాను" అని సీసామూత తీసి ముంతలో పోసేశాడు. "ఇప్పుడీ నీరు మంత్రం చదువుతూ మీమీద చల్లుతాను. మీరు పవిత్రులైపోతారు. గంగాజలం ప్రభావం తెలుసునా? ఎన్ని పాపాలు చేసినా హరిస్తుంది. ఇక నుంచి మీరు శుచిగా బ్రతకాలి. కల్లు, సారాయి త్రాగరాదు. మాంసం తినరాదు" అని నీరు చేత్తో తీసుకొని గాయత్రి చదువుతూ అందరిమీదా మూడుసార్లు చల్లాడు.

తలలువంచి చల్లించుకున్నారంతా.

"ఇప్పుడు మీరంతా హిందువులైపోయారు. ఇక మీకు తురక పేర్లు లేవు. మీ మీ పేర్లు చెప్పండి" అని అందరి పేర్లూ వ్రాసుకున్నాడు, ఉమూర్ మతహాబీ[135] కి పంపడానికి.

"నేను 'హిందూధర్మకీ' అంటాను. మీరు 'జే' అనాలి" అన్నాడు. తరువాత -

'హిందూ ధర్మకీ' అన్నాడు నరేంద్రజీ.

మిక్కిలి ఉత్సాహంతో గొంతులు చించుకొని 'జై' అన్నారు అంతా. అలా మూడుసార్లు అనిపించాడు.

'కల్లు, సారాయి త్రాగము, మాంసము తినము' అనిపించాడు మూడుసార్లు.

ఆ రాత్రి గూడెంలోనే పడుకొని, తెల్లవారి రామారెడ్డిగార్ని కలిసి వెళ్ళిపోయాడు నరేంద్రజీ.

## 11

**మా**మూలుగా వెళ్ళినట్లే కరణం ఇంటికి వెళ్ళాడు సారంగపాణి. అక్కడ అతనికో లంబాడీ తండాకు తండా కనిపించింది. తల గుడ్డలూ, మోకాలివరకు పంచలూ, మొలకు హోలీ బేడల మొలతాళ్ళు కలిగిన మగవాళ్ళు కర్రలు పట్టుకొని కూర్చున్నారు. ఒక్కొక్కని ముందు ఒక్కొక్క సద్దిమూటా, కొందరి చెవులలో ఆకు చుట్టలుండగా, కొందరు చుట్టలు కాలుస్తూ తుపుక్కు తుపుక్కున ఊస్తున్నారు. ఆడవారు అద్దాలు తాపిన ఎర్రని పరికిణీలూ, వీపు కనిపించే అద్దాలు తాపిన రవికలూ తొడుక్కున్నారు. తలమీద అద్దాలు తాపిన ఓణీలు వేసుకున్నారు. మెడలలో హోలీ రూపాయల దండలూ, పగడాల్లాంటి ఎర్రని పూసల దండలూ వేసుకున్నారు. మోచేతులవరకు అంగుళం కంటే ఎక్కువ వెడల్పున గాజులు వేసుకున్నారు. ఆడవాళ్ల సైతం నేలమీద కూర్చొని కొందరు పిల్లలకు పాలిస్తున్నారు. కొందరు తలలు దువ్వుకుంటున్నారు, కొందరు పేలు చూపించుకుంటున్నారు. నగ్నంగా ఉన్న పిల్లలు అటు, ఇటూ పరిగెత్తుతూ గెంతుతూ ఆడుకుంట్గున్నారు. పాణిని చూచి అంతా లేచి నుంచున్నారు. దండాలు పెట్టారు. ఆశ్చర్యంగా చూచాడు పాణి.

"గీ కరణపాయిన తండ్రి మా అయ్య తాన జమీ[136] నిప్పిస్తనని పైకం తీసుకున్నడండి. మా అయ్య తిరిగిండు, తిరిగిండు,చచ్చిండు. పెద్ద కరణపోడు కూడ చచ్చిండుండి. చిన్న కరణపోనికి హుకూమత్ వచ్చింది. ఏండ్లనుంచి తిరుగుతూన్నముండి. జమీన్ లేదు. గిమిన్ లేదు. ఇగ్గో ఇయ్యాలంటడు అగ్గో రేపంటడు. ఆ జమీన్ నారయ్యగారికి అమ్ముకున్నడు. పైకం తిన్నడు. ఎంత తిరిగినా మాట్లాడడు. ఎన్నిసార్లు అడిగినా మాట్లాడడుండి. ఇంట్లనే ఉంటడు. లేడనిపించుకుంటడు. గరీబోల్లం మా నోళ్ళల్ల మట్టికొట్టి ఏం బాగుపడ్తడండి? పిల్లలు పుట్టకుండ్రైనా" అని ఒకడనగానే, ఒక ఆడది లేచి రెండుచేతులెత్తి గట్టిగా శపిస్తూన్నట్లు 'పురుగులు పడి చస్తడు' అన్నది. మళ్ళీ మొదటివాడు అందుకొని 'అరే అయ్యా! నువ్వే చెప్పా నాయం. పైకంపాయె, ఇన్నేండ్ల ఫసల్[137] పాయె, దున్నుకోటాన్కి జమీన్ లేకపోయె. ఎట్ల బతుకుతముండి? కరణం

ఇంట్ల ఉన్నాడేమో జరచూసి చెప్పండి' అన్నాడు.

సారంగపాణికి అంతా విచిత్రం అనిపించింది. అతడేమీ మాట్లాడలేదు. ఇంట్లోకి వెళ్ళిపోయాడు. మంచంమీద కూర్చొని చుట్ట కాలుస్తున్న కరణం వెంకటరావు కనిపించాడు. 'కరణంగారూ!' అన్న సారంగపాణి మాట పూర్తికాకుండానే 'ఉష్, అవతల లంబాడీలున్నారు. జర తగ్గి మాట్లాడు' అని పిలిచి మంచంమీద కూర్చోబెట్టాడు. "లంబాడీలున్నరు చూశావు-ఏం జెప్పనులే. ఇంటిమీదికి బందిపోటోలే వచ్చిపడ్డారు. బైటి కెళ్తే ప్రాణాలు తీసెటట్టున్నరు. వాళ్ళమ్మల ..... వాళ్ళక్కల...... వీళ్ళయ్య మా నాయన కిచ్చిండట, నూరో, ఇన్నూరో రూపాయలు భూమి ఇప్పించమని. ఆయన్నే అడుక్కోవాల్నుండె. ఏమంటావ్? వాడు చచ్చె, వీడు చచ్చే. ఇప్పుడు నాదగ్గరేమున్నది చెప్పు? నాకేదో తక్లీపొచ్చింది[138]. జమీ నమ్ముకున్న నారయ్యకు. నారయ్య పైక మిచ్చిండు. అయిపోయింది. ఇప్పుడీ లంబాడీలు జమీనియ్యనంటే ప్రాణాలు తీసెటట్టున్నరు. జమీనియ్యకుంటే నారయ్య పైకమియ్యమంటడు. జమీన్ వదలనంటడు. ఎట్లచావమంటవు చెప్పు?" అని తన కథ చెప్పాడు పాణికి కరణం.

సారంగపాణికి అంతా అయోమయంగా తోచింది. మాట్లాడకుండా పారం చెప్పడానికిగాను, ఇంట్లోకి బయల్దేరాడు. చెయ్యిపట్టుకొని మంచం మీద కూర్చోబెట్టాడు కరణం. "పంతులూ! ఇయ్యాళ్ళ పాటమొద్దు గీట మొద్దుగాని నేనున్ననని మాత్రం వాళ్ళకు ఎరికె కానియ్యకు" అని రెండు చేతులూ పట్టుకొని, "ఇగో, ఇవ్వి చేతులు కావు కాళ్ళనుకో, జర పాణం, మానం దక్కించు" అన్నాడు.

పాణికి అసహ్యంగా అనిపించింది. ఇంత పెద్ద మనిషి ఇలా అంటాడేం? వాళ్ళకు ముఖం చూపిస్తే తంతారని దాక్కుంటాడా? ఎంతకాలం దాక్కోగలడు? అనుకొని, 'సరేనండి, నాకేంపని? నే వెళుతున్నా'నని వెళ్ళిపోయాడు పాణి.

అతడు కనిపించగానే లంబాడీలంతా అడిగారు ముక్తస్వరంతో : "ఏమ్రా అయ్యా! కరణం లేడా?" అని. 'గుంజుండి ఇవతలికి' అన్నదొక గొంతు. లంబాడీ భాషలో తిట్టాయి కొన్ని గొంతులు.

'బిడ్డను గుంజుండి' అన్నదొక గొంతు.

పాణి ఒళ్ళు మండిపోయింది. ఆ మాట విని కరణం బయటికి పరిగెత్తి వస్తాడనుకొని వెనక్కు చూచాడు. కరణం రాలేదు. ఉద్రిక్తులై ఉన్నారు లంబాడీలంతా. తనను తంతారేమో అనుకొని 'నాక్కనిపించలేదు' అని వెళ్ళిపోయాడు.

'నక్కుంది నక్క. ఎందరి పొట్టలు కొడతాడో! ఇంకెన్ని బంగ్లలు కడ్తడో!!' అన్నగొంతు ఒకటి వినిపిస్తే 'నక్క కాదు పందిరా, పంది' అన్నది మరొక గొంతు.

పాణి నారయ్య ఇంటికి బయలుదేరాడు. ఊరంతా నిశ్శబ్దంగా ఉంది. ఒక తలుపూ తెరచిలేదు. వీధిలో తానుతప్ప ఒక్కమనిషి కనిపించలేదు. జనం తలుపుల సందులోంచి వీధిలోకి చూచి ఏవేవో గుసగుసలు చెప్పుకుంటున్నారు. పాణికిదంతా ఏమీ అర్థంకాలేదు. నారయ్య ఇంటి ముందుకు వెళితే ఎప్పుడూ తెరచి ఉండే తలుపు మూసి ఉంది. తలుపు తట్టాడు. జవాబు రాలేదు. పిల్చాడు. సీతవచ్చి తలుపుసందులోంచి చూచింది. పంతులేననే విషయం ధ్రువపర్చుకొని గడియతీసి ఒంటితలుపు ఓరగా తీసింది. ఏదో ప్రళయం వస్తుందని బెదిరినవారిలా ఉన్నారంతా. చీమ చిటుక్కుమంటే ఉలిక్కిపడి వీధిలోకి చూస్తున్నారు. కాళ్ళకు కండువా చుట్టుకొని కూర్చున్న నారయ్య సైగచేసి పాణిని పిలిచి తన పక్కన బల్ల పీటమీద కూర్చో బెట్టుకొని మెల్లగా చెవులో చెప్పినట్లు అడిగాడు:

'కర్ణపోరింటికి పోయొచ్చిన్రా'

'వెళ్ళొచ్చా' అన్నాడు మామూలు స్వరంతో పాణి.

'గోడలకు చెవులుంటాయి. జర చిన్నగ మాట్లాడురి' అని, 'ఆడ లంబాడీ తండున్నదా?' అని అడిగాడు.

"ఉన్నది."

"వాండ్లెందుకొచ్చిన్రో ఎరికెనా?"

"లంబాడీలు చెప్పారు. కరణంకూ... ..." అని మాట మింగేశాడు పాణి.

"కరణం ఇంట్లున్నడన్నమాట. ఉండే లేడనిపించిండు. నా తాన రెండువేలు తీసుకున్నాడు. ఏమన్నంటే జమీన్ నీకు పట్టా కాలేదని బెదిరిస్తడు. అప్పుడు నూరు, ఇప్పుడు యాభయి, ఇంకో అయిదు నూర్లు తిన్నడు. ఇగో ఇప్పుడు, అగో అప్పుడు అంటాడు. పట్టా చేయించడు. లంబాడీ కులం బందిపోటుకులం. కరణం కండ్లపడకపోతే నా ఇంటిమీద పడతరేమోనని బుగులుగున్నది. ఎటన్న పరార్[39] అయిదమంటే ఆడదాన్ని, పిల్లల్నొదిలి ఎట్లపోదును చెప్పురి? తిక్కపుట్టె ఊరిమీదపడి దోచుకుంటరేమో లంబాడోళ్ళని ఊరంత పాణాలు బిగబట్టుకొనినున్నది. దేవుడెట్ల రక్షిస్తడో?" అని రెండుచేతులూ ఎత్తి నమస్కరించాడు.

"డబ్బు తీసుకున్నట్లు కరణం ఏమైనా రశీదు ఇచ్చాడా?"

"రశీదు? కాట్లబూడిద. కరణాన్ని రశీదడిగి బతుకుతమా ఊళ్ళ?"

"రశీదు లేకుంటే చిక్కేనే? దొరవారితో చెబితే?"

"కరణం పగబడ్తడు, కరణం పగ పాము పగ."

పాణి ఆలోచించసాగాడు. వెంకట్రావు ఎంత దుర్మార్గుడు! భూమి ఆశచూపి ఇద్దరి దగ్గరా డబ్బు కాజేశాడు. అంతేకాక, డబ్బు తిన్నట్లు దాఖలా ఎక్కడా లేకుండా చేశాడు. అంతేకాక, అందర్నీ చేతుల్లో పెట్టుకొని నాటకం ఆడుతున్నాడు. రామారెడ్డిగారే నయం. తన అధికారాన్ని రక్షించుకోవడానికి చచ్చేట్లు కొడ్తాడేగాని పరుల సొత్తు అపహరించడానికి ప్రయత్నించడు. దొర అధికారానికి వణకిపోతారు జనం. కరణం కుట్రకు భయపడతారు జనం. ఇద్దరికీ భయపడుతూ బ్రతుకుతుంటారు జనం అనుకున్నాడు.

సీత అతని ముందు పాలగ్లాసు పెట్టి దూరంగా నుంచుంది.

"ఎందుకండీ ఇప్పుడు పాలు? ఇప్పుడే ఫలహారం చేసి వచ్చాను."

"తాగుండి పంతులూ, పంతులని తెచ్చింది."

పాలు తాగేసి "పాఠానికి" అంటూండగానే "ఇయ్యాళేం పాఠముండి? ఊరంతా ఉడికిపోతాంది. బతికి బాగుంటే రేపు పాఠం" అన్నాడు నారయ్య.

"సరే, అయితే వస్తా."

"ఎప్పుడేమొస్తదో, ఈణ్ణె ఉండరాదురి ఇయ్యాళ?"

"నాకేం భయమండీ? ఏమన్నా పెళ్లామా పిల్లలా నాకు?" అని లేచి నుంచున్నాడు.

కాళ్ళకు చుట్టుకున్న కండువా విప్పి బల్లదిగి "సరేగాని, జర పదిలంగా పోండ్రి" అని సాగనంపి వెంటనే తలుపేసుకున్నాడు నారయ్య.

గడీ గేట్లో అడుగు పెట్టినవాడల్లా జడుసుకొని వెనకడుగు వేశాడు పాణి.

ఆరడుగుల నల్లటి బొగ్గులాంటి మనిషి పెద్ద దుడ్డుకర్ర పట్టుకొని గేటుపక్కన నుంచొని కనిపించాడు పాణికి. బుర్రమీసాలూ, వెడల్పయిన ముఖం, కండలు తేలిన శరీరం. అతడు మదార్‌సాబ్. రెడ్డిగారి రక్షక

బృందానికి నాయకుడు. పాణిని చూసి సలాంచేశాడు మదార్‌సాబ్. ప్రతినమస్కారం చేసి గేట్లో అడుగు పెట్టాడు పాణి. గుర్రాల కొట్టం ముందు చుట్టలు కాలుస్తూ, కర్రలు పట్టుకొని, దొంతుకూర్చున్న పదిమందీ లేచినుంచొని పాణికి నమస్కరించారు. ప్రతినమస్కారం చేసి తనగదికి సాగిపోతున్న పాణిని ఎంకటి పిలిచాడు, "దొర పిలుస్తాండు" అని. ఎంకటి ముందునడుస్తుంటే పాణి వెనక సాగిపోయాడు. పెద్దహాలు చివర గుమ్మందగ్గరికి రాగానే అక్కడే ఉండమని ఎంకటి లోపలికి వెళ్ళాడు. ఆ తరువాత క్షణానికి మంజరి గదిలోంచి వచ్చి మెరుపులా మాయమైంది- సారంగపాణి వైపు ఒక చూపు విసిరి. తాను సరిగా ఊహించాననుకున్నాడు పాణి. మంజరిది పసిడిఛాయే. బాగా పొడవైన మనిషి. ఎంత దృఢమైన శరీరం!

ఎంకటి వచ్చి పిలిచాడు. పాణి అనుసరించాడు యాంత్రికంగా. పెద్ద కమానులో ఉన్న గోడలో ఒక దర్వాజా ఉంది. ఆ తరువాత హాలుంది-చిన్నది. దానికి కుడివైపు ఒక గదీ, ఎడమవైపు ఒక గదీ, ఎదురుగా ఉన్న దర్వాజాలోంచి అవతలికి వెళ్ళేదారీ ఉన్నాయి. ఎడమచేతి వైపున్న గదిలోకి ప్రవేశపెట్టాడు పాణిని ఎంకటి.

అదీ పెద్దగదే! నేలమీద చక్కని తివాచి పరచి ఉంది. శుభ్రంగానూ, ఎత్తుగా ఉన్న గోడలకు నాలిగింటికీ నాలుగు జపాను ఆడబొమ్మలు తగిలించి ఉన్నాయి. కిటికీ పక్కగా ఒక పెద్ద ఎత్తయిన పందిరి మంచం ఉంది. దాని నాలుగు కోళ్ళపైనా నగిషీపని చేయబడి, కోళ్ళ చివర్న సింహాల ముఖాలున్నాయి. పందిరి స్తంభాల నాలిగింటిపైనా చిలకల బొమ్మలున్నాయి. మంచానికి తలవైపూ, కాళ్ళవైపూ, నిలువుటద్దాలున్నాయి. వాటికింద మంచపు ఈ చివరనుండి ఆ చివరవరకూ చిన్న చిన్న చతురపు పింగాణీరాళ్ళూ, మధ్య మధ్యన అద్దాలు ఉన్నాయి. మంచంమీద ఎత్తైన పరుపూ, తెల్లటి దుప్పటీ, రెండు కాళ్ళవైపునా, రెండు తలవైపునా నాలుగు పెద్దపెద్ద దిండ్లున్నాయి.

రెడ్డిగారు రెండు దిండ్ల నానుకొని కాళ్ళు చాచుకొని కూర్చొని ఉన్నారు. పక్కనే ఎత్తు స్టూలుమీద వనజ కూర్చొని మొక్కజొన్న గింజలు ఒలిచిపెడ్తోంది. గింజలు నోట్లో పోసుకొని, వెండిపళ్ళెంలోని వెన్న కలిపిన పచ్చిమిరపకాయల కారం వేలుతో తీసి నాలుకకు రాచుకుంటున్నారు రెడ్డిగారు. పాణిని చూచి "రా పంతులూ!" అని అక్కడే ఉన్న ఎత్తు స్టూలు చూపించారు. పాణి రెండు మెట్లెక్కి దానిమీద కూర్చున్నాడు. ఒక దాసీది వెండిపళ్ళెంలో వెన్న కలిపిన కారం తెచ్చిపెట్టి వెళ్ళిపోయింది. వనజ ఒకసారి పాణికీ, ఒకసారి రెడ్డిగారికీ గింజలు ఒలిచిపెడ్తోంది. వనజ ముఖంలో పూర్వపు ఉత్సాహం, చిలిపితనం కనిపించలేదు పాణికి. అందుక్కారణమేమో అర్థం కాలేదతనికి.

"పంతులూ! కరణం ఇంటికి పోయినావా?" రెడ్డిగారడిగారు.

"వెళ్ళానండీ."

"కతంత తెలిసినాది?"

"విన్నానండి"

'పారం చెప్పినవు కుంటిదానికి?'

'వద్దన్నారండీ.'

"ఎవ్వరు? కరణమేనా? ఇంట్ల ఉండే లేడనిపించుకుంటడ్లేవాడు!"

నసిగాడు పాణి.

'నీ చేతులు పట్టుకున్నాడేమో చెప్పొద్దని. అందితే జుట్టు పట్టుకుంటడు, లేకుంటే కాళ్ళు. ఏమనుకున్నవ్?'

పాణి మాట్లాడలేదు. ముసలివాడు ఘటికుడే ననుకున్నాడు.

'గడీ ముంగలి మనుషుల్ను చూసినావా?'

'చూశానండీ!'

'ఎందుకు పెట్టిన్ననుకున్నవ్?'

తెలీదన్నట్లు చూశాడు పాణి.

'కరణం దొరక్కుంటే లంబాడోల్లు ఊరిమీద పడితే పడవచ్చు. చూచినవుగద మనుషుల్ను. ఒక్కొక్కడు పదిమందికి జవాబు చెప్పుతడు. ఆ''

వాళ్ళను తల్చుకుంటేనే ఒళ్ళు జల్లుమంది పాణికి.

'అవునండీ!' అన్నాడు పాణి.

'మన్సు బాగాలేదు. ఒక పాట పాడరాదు?'

ఫిడేలు -' అంటుండగనే ఎంకటి తెచ్చి అందించాడు.

'ఈరేయి నన్నొల్ల నేరవా నా రాజ!' ఎంకిపాట పాడాడు పాణి. కళ్ళుమూసుకొని తన్మయులై విన్నారు రెడ్డిగారు.

వనజ రెండు బాష్పబిందువులు రాల్చింది. ఆమెలోని మార్పుకు కారణం పాణికి అర్థంకాలేదు.

గుమ్మం పక్కన నుంచొని నాగుపాములా తలవూపుతూ ఆమూలాగ్రం పాటవిన్న మంజరిని ఎవరూ గమనించలేదు.

× × ×

సూర్యుడు నూమిళ్ళచాటుకు చేరాడు. ఇంకా పూర్తిగా సాయంకాలం కాలేదు. అయినా ఊళ్ళో ఎక్కడా ఎండపాడలేదు. పశువులు ఇళ్ళకు తిరిగి వచ్చేవేళ అయినప్పటికీ అవి వస్తున్న జాడ కనిపించలేదు. వీధులు నిర్మానుష్యంగా ఉన్నాయి.

కరణం ఇంటిముందరి లంబాడీగుంపు అల్లాగే ఉంది. వాళ్ళు అక్కడే భోజనాలు చేశారు. రాత్రికి రొట్టెలు వండుకోవడానికి ఏర్పాట్లు చేసుకుంటున్నారు. రెండు మూడు పొయ్యిలు సైతం పెట్టుకున్నారు. పచ్చని పచ్చజొన్నపిండి మూటలు విప్పుతున్నారు ఆడవారు.

అమాంతం వారిలో ఏదో సంచలనం బయల్దేరింది. అంతా ఒక్కసారి కర్రలు పట్టుకొని లేచారు 'కరణం-కరణం' అని. కరణం వెంకట్రావు మీసం మెలేస్తు ఠీవిగా వసారాలో అడుగుపెడ్తూ- 'ఏందిర దొంగలంజ కొడుకుల్లారా! ఇంటిమీద హమ్లా[140] చేస్తానికి వస్తారు?' అని సుమారు గర్జించినట్లు అనేశాడు.

"నీ పానాలు తింటం" అని కర్రలతో అతనిమీదికి దూకబోయారు లంబాడీలంతా.

వెంటనే ఆకాశంలోకి తుపాకులు పేల్చిన ధ్వని వినవచ్చింది. లంబాడీలు బెదిరి అటువైపు చూచారు. సాయుధులైన పోలీసులు కనిపించారు. కర్రలు అక్కడే పారేసి కాలికి బుద్ధి చెప్పారు లంబాడీలు. పోలీసులు వెంటబడి తరిమి ఆరుగురిని పట్టుకున్నారు. అయినా నలుగురు పారిపోయారు. మరికొందరు పోలీసులు ఆడవారిని లాఠీలతోనూ తుపాకి మడమలతోనూ బాదారు. 'యాడియే' అంటే 'యాడియే' అని మొత్తుకున్నారు నేలమీద పడిపోయిన ఆడవారు. పారిపోవడానికి ప్రయత్నించిన ముగ్గురు వయసులో ఉన్న ఆడవారిని రెక్కలు పట్టి లాక్కొచ్చారు పోలీసులు బండబూతులు తిడుతూ.

కరణపు వాకిలి యుద్ధం ముగిసింతర్వాత రణరంగంగా ఉంది. కర్రలన్నీ చెల్లాచెదురుగా పడివున్నాయి. కాళ్ళతొక్కిడికి పగిలిపోయిన ఎర్రని గుడ్డల మూటలలోంచి పచ్చని జొన్నపిండి నేలమీదపడి

పడివున్నాయి. కాళ్ళతొక్కిడికి పగిలిపోయిన ఎర్రని గుడ్డల మూటలలోంచి పచ్చని జొన్నపిండి నేలమీదపడి చెదిరిపోయింది. లంబాడీల చేతుల గాజుముక్కలూ, మెళ్ళోంచి తెగి జారిపడిన పూసలు చల్లినట్లు పడి ఉన్నాయి. పారిపోతుంటే జారిపోయిన పైపంచల బారు కొంత దూరందాకా కనిపిస్తూంది.

కచ్చడపు బండినుంచి అమీన్‌సాబ్ దిగ్గానే ఒక మస్కూరు పరిగెత్తి కోమటింట్లోంచి చాకలివానితో మంచం తెప్పించివేశాడు. బక్కగా పొడుగ్గా ఉండి ఖాకీ యూనిఫారంలో ఉన్న అమీను, తన చేతిలోని కత్తి కర్ర మంచం మీద పెట్టి కూర్చొని 'అరే మస్కూర్, నీళ్ళ ఘడా ఏది బే?' అన్నాడు.

'సర్కార్! ఇప్పుడే తెస్త, నీ బాంచను' అని పరిగెత్తాడు మస్కూరు. క్షణంలో కుమ్మరివానితో నాలుగు కుండలు పటించుకొని వచ్చాడు. కుమ్మరి వంగి అమీనుకు సలాం చేశాడు. కుండలు పెట్టడానికి సావట్లోకి వెళ్లుతుంటే 'ఏంబే? మస్తీ ఎక్కిందిబే నీకి, సర్కారు వస్తరని ఎర్కైభీ ఘడాల్పెట్టవ్! చమ్డ ఒలిపిస్తా[141]' అని ఉరిమాడు అమీను.

"మస్కూరొయ్ని రాంగనె పట్టుకొస్తనే ఉంటిని గులాపోణ్ని."

"ఆ. జవాబ్భీ చెప్పుతవ్‌బే బద్మాష్!" అని లేచి కర్ర తీసుకొని బాదాడు కుమ్మరిని. దెబ్బలు తప్పుకోడానికి చేయి ఎత్తేవరకూ చేయిజారి పడిపోయి పగిలిపోయాయి కుండలు.

"ఘడాల్ఫోడ్తావురే. బువ్వతిన్లే?" అని మరి నాలుగు బాది "బేగారోల్లకు భీ మస్తీ ఎక్కొందిరే" అని, "పో, మల్ల పొయ్యి ఘడాల్తేపో మాకీ...." అని మంచంమీద కూలబడ్డాడు అమీను. కుమ్మరి కుండలు తేవడానికి వెళ్ళిపోయాడు.

అక్కడ నుంచొని ఉన్న మస్కూర్ను చూచాడు అమీను. "అబే తెరీమాకీ ... బహన్‌కీ ... ఖందిళ్ళు[142] కావాలెవద్దుబే. నిల్బడీ తమాషా చూస్తున్నావుబే. ఖందిల్ తెస్తవా లాతు[143] లింటవ్‌బే" అని కేకలు వేశాడు.

మస్కూరువాడు పరిగెత్తాడు. వాని స్థానంలో మరొకడు వచ్చి నుంచున్నాడు. అమీను ఒక్కసారి నలువైపులా పరికించి "అబే బన్యాగాడింక[144] రాలే. పిల్వుపో బన్యాగాణ్ని" అన్నాడు, చార్మినార్ సిగరెట్టు ముట్టిస్తూ. ఆ మస్కూరువానికి చెవుడు. కర్ర గద్దున క్రింద పెట్టుకొని వాడలాగే నుంచున్నాడు. మళ్ళీ అమీను "బన్యాగాణ్ని పిలుస్తవా, చమ్డాతీయమంటవా?" అని గర్జించి కర్ర పట్టుకొని లేచాడు.

అప్పుడుగాని వినిపించింది కాదు మస్కూరుకు. వాడు కర్ర పట్టుకొని పరిగెత్తాడు. ఈలోగా నాలుగు కోడిపిల్లల్ని పట్టించుకొనివచ్చాడు నిజామొద్దీను. "ఏమ్! నిజామొద్దీన్ సాబ్! ఇంత ఊర్లె నాల్గె ముర్గి[145] పిల్లలున్నాయి? ఔర్ చార్ ముర్గిపిల్లలన్న కావాలె" అన్నాడు అమీను. కోడి పిల్లల్ను పట్టుకొచ్చిన మస్కూరు వాటిని చావట్లో పెట్టి, "యాణ్ణుంచి తెమ్మంటరుండీ?" అని అమీనుకు వినబడకుండేట్లు మెల్లగా అడిగాడు నిజామొద్దీన్ను. "మాదిగిండ్లకు పోయి ఇంటికో కోడిపిల్లను పట్టితే" అని ఆదేశించాడు నిజామొద్దీన్. "అట్లనే చెయ్యి. ఆర్యసమాజంల కలుస్తారు, లంజాకొడుకలు" అన్నాడు అమీను. ఆ మాట విని సాగిపోతున్న మస్కూర్ను చూచి 'అరె! ఇంక ఈణ్నే ఉన్నావు, ఉరుకు' అని గద్దించాడు నిజామొద్దీన్. మస్కూరు ఉరికాడు. ఇంతలో కోమటి వెంకయ్యను ప్రవేశపెట్టాడు మొదటి మస్కూరు. ముడతలు పడిన శరీరం, పీక్కుపోయిన కండ్లు, గిర్దావర్ క్షౌరపు తలగల కోమటి ఆఖరు దమ్ము బీడిపీకి, క్రింద పడేసి కాలుతో నలిపి, అమీనుకు సలాంపెట్టి మంచంకోడు పట్టుకొని క్రింద కూర్చున్నాడు.

'పిలిచిన్రట?' అడిగాడు వెంకయ్య.

'సర్కారొచ్చిన ఖబర్[146] మాలూమ్‌కాలే[147]. చాలీస్‌మంది పోలీసులున్నరు. నేనున్న. పటేల్ పట్వారీలున్నరు. ఇయ్యాళ్ళ బిర్యానీ ఉడకాలే, బిర్యాని' అన్నాడు అమీను.

'ఉప్పు మిర్చకాయలమ్ముకునేటోడ్ని. నాతాన యాడున్నదుండి అంత సామాను? ఉన్నకాడకిస్త'

'ఏమన్నవ్? ఉన్నకాడ్కి ఇస్తవ్‌లే. ఇల్లు లూటీ చేయిస్త లూటీ, లంబాడోల్లతోటి. నీతాన లేకుంటే మంగాకే దేవ్[148]. ఏమన్న హమేషా[149] వచ్చేటోళ్ళమా మేం. ఏమంటవ్?'

'గట్టనే లేరి' అని విసుక్కుంటూ లేచాడు కోమటి. 'సర్కారువాళ్ళు వచ్చినప్పుడల్లా పట్టిందంతా పుణ్యానికివ్వాలి నేను. ఒక పైసియ్యరు గాడిదకొడుకులు. పనేమో పట్వార్ది. దొరదిచేస్తడు' అని గునుసుకుంటూ వెళ్ళిపోయాడు.

పగ్గాల్తో కట్టి లంబాడీల్ని పట్టుకొని వచ్చారు పోలీసులు.

'లూటీచేయటాన్కి వస్తర్చేగాంవ్‌మిద్కి[150] నిలబెట్టి బందూఖ్[151]తో కాలుస్త ఏమనుకున్నారో. ఖాబ్‌ఖాకె[152] తన్నులేక మస్తి ఎక్కిందిరా మీకీ!' అని పళ్ళు కొరికాడు అమీను.

లంబాడీల్లో ఒకడు "గీ కరణపాయ్ను ..." అని ఏదో చెప్పబోతే "మూ బంద్‌కర్ [153]'బాత్ భీ కర్తారే" అని ఉరిమాడు అమీను.

చేత్తో నోరు మూసుకున్నాడు లంబాడీ.

"మొగోల్లను ఖంబాలకు[154] కట్టురి. ఆడోల్లను క్రమాల[155] పారెయ్యిరి" ఆదేశించాడు అమీను.

"గుంజలాణ్నుంచి ..." అనే మస్కూరు మాట పుర్తికాకుండానే "ఇండ్లయి ఉఖ్డాయించుకొచ్చి[156] పాతుబే" అని ఉరిమాడు అమీను.

ఆ మాట విని నలుగురు మస్కూర్లు పదిమంది మాదిగల్ని తీసుకొని పరిగెత్తారు.

కరణం సలాంచేసి ప్రవేశించాడు. "ఆవ్ పట్వారీ సాబ్! బైరో" అని కుర్చీ చూపించాడు అమీను.

కరణం కుర్చీలో కూర్చుంటూ ఒక చార్మినార్ సిగరెట్ తాను తీసుకొని పాకెట్ అమీనుకు అందించాడు. అమీను సిగరెట్ నోట్లో పెట్టుకోగానే కరణం నోట్లో పెట్టుకొని అగ్గిపుల్ల గీకి అమీను సిగరెట్టుకు అంటిస్తే "షుక్రియా[157]" అన్నాడు అమీను. ఆ తరువాత తన సిగరెట్ కాల్చుకున్నాడు కరణం.

"జనాబ్! ఇయ్యాళ్ళ ఈ ఊర్ని కాపాడిన్రు మీరు. పొద్దుననంగ వచ్చిన్రు లంబడోళ్ళు. ఇస్తే ఊళ్ళ వెయ్యి రూపాయలు వసూలుచేసి ఇయ్యి, లేకుంటే ఊళ్ళడాకా[158] చేస్తం అని కూచున్నరుండి. ఆ ముచ్చట ఈ ముచ్చట చెప్పి ఆగబట్టిన ఇప్పటిదాకా. ఇగ లంబడోల్లున్నరు, మీరున్నరు," అన్నాడు అమీను వైపు చూస్తూ కరణం. చివరి కొక విషపు చూపు విసిరాడు లంబాడీల వైపు.

లంబాడీల ఒళ్ళు మండింది. అసలు విషయం దాచి తమను బందిపోటు క్రింద లెక్కకడ్తున్నారు. నోరు మెదుపుతే అమీనుకు కోపం వస్తుంది. నిజంగానే తుపాకుల్తో కాల్చి చంపినా చంపొచ్చు అనుకొని కిక్కురుమన లేదెవ్వడూ.

కనిపించిన పందిరి స్తంభాన్నల్లా ఊడ పెరికి పట్టించుకొని వచ్చారు మస్కూర్లు. కరణం లేచి "లోతుకు తవ్వి పాతండి. ఊడపీక్కొని పారిపోతరు" అని గుంజలు పాతాల్సిన చోటు చూపించి వచ్చి కూర్చున్నాడు అమీను దగ్గర.

"పారీపోతార్ జాన్తెనై[159], జలాదేతూ[160]" అని పిస్తోలు చూపించాడు అమీను లంబాడీలకు.

నిజామొద్దీన్ సావిట్లోంచి బయటకువచ్చి "కోమటోని కాణ్నుంచి ఇంక సామానురాలే, వంటెట్లయితదనుకున్నడో. జల్దిపొయ్యి పట్టించ్కరాపో" అని ఒక మస్కూరకు ఆదేశించి, "కుమ్మరి మల్లిగాడు పెళ్ళాంత కులుకుతాండా? బేగారి[161] చేస్తడో, ఇనాం గుంజుకోవాల్నో అడిగి గుంజుకరా. వాని అమ్మ మిండడు నూర్తడా కారం మసాలాలు" అని మరొక మస్కూరుతో చెప్పి లోపలికి వెళ్ళిపోయాడు వంట

మాదిగవాళ్ళు లోతుగా తవ్వి స్తంభాలు పాతారు. కరణం వెళ్ళి వాటిని ఊపిచూచి "గట్టిగనే ఉన్నాయి" అని చేతులు దులుపుకుంటూ వచ్చి అమీను దగ్గర కూర్చున్నాడు. 'పగ్గాలు పెట్టి గట్టిక్కట్టుండి. కదలొద్దు బద్మాషులు' అని ఆదేశించాడు కరణం.

పోలీసులు ఆరుగుర్ని ఆరు స్తంభాలకు విరిచికట్టారు. అలా కట్టేప్పుడు ఒకని ఒంటిమీద కండువా కనిపించింది అమీనుకు. 'అబే బేవకూఫ్[162] కండువెందుక్కరావాన్కి, నికాల్‌దేవ్[163]' అని ఆదేశిస్తే పోలీసు అదికాస్తా లాగేసి ఒంటిమీదనుంచే పగ్గంవేసి కట్టేశాడు.

కరణం లేచి ఒక్కొక్క స్తంభం దగ్గరికి వెళ్ళి "కరణం వెంకట్రావంటే ఏమనుకున్నారు? లూటి చేయటాన్కి వస్తర్లే లూటీ. ఈ దెబ్బకు మీ అయ్య యాదికి రావాలే" అన్నాడు. అందరూ తలలు వంచుకున్నారు. కాని, ఘుఫ్లొత్ భీక్యా నేలమీద తుపుక్కున ఊసి "థూ! నీదొక మడిసి జలమా?" అన్నాడు. కరణం అమీన్‌వైపు చూచాడు. అమీను పరిగెత్తుకొని వెళ్ళి "క్యాబోల్తారే" అని వాణ్ణి ఈ చెంప, ఆ చెంప శక్తి ఉన్నంతసేపు బాది "పీటో[164]" అని ఆదేశించి వగరుస్తూ మంచంమీద పడిపోయాడు.

పోలీసులు కర్రల్తో బాదసాగారు లంబాడీల్ని. కొంతసేపు ఓర్చుకున్నారు కాని, తరవాత భరించలేక కేకలు పెట్టసాగారు "మల్లగిట్ల చెయ్యం సర్కార్! నీకూ సలాం పెడ్తం విడిచిపెట్టురి" అని. "అప్డే అయిపోయినాద్బె. ముంగల చూస్త తమాషా" అని గర్జించి చేత్తో సంజ్ఞచేశాడు పోలీసులకు ఆపమన్నట్లు అమీను. పోలీసులు బాదడం ఆపేశారు. దెబ్బలకు లంబాడీల చర్మం ఒక్కొక్కచోట చిట్లి రక్తం కారసాగింది. తుడుచుకోవడానికి వీల్లేకుండా చేతులు మీదినుంచే పగ్గాలువేసి కట్టేశారు. మెడదగ్గిర్నుంచి పాదాలదాకా కట్టివేశారు. కాలుసైతం కదిపేట్టు లేదు. గాయాలూ, గుండె రెండూ మండుతున్నాయి. రోషం కళ్ళద్వారా నిప్పులు కురిపిస్తూంది. ఆ సమయంలో వదుల్తే పదిమందిని పొట్టపెట్టుకొని చచ్చేవారు.

గడీలోంచి రెండు పెట్రొమాక్సులైట్లు పట్టుకొని మదారసాబ్ వచ్చి, అమీనుకు సలాంచేసి, వాటినక్కడ పెట్టి "సర్కార్!దొర సలాం చెప్పమన్నడు. దావత్[165]కు ఇయ్యాళొస్తరో రేపొస్తరో అడిగి రమ్మన్నడు" అని అడిగాడు.

అమీను సిగరెట్ పొగ ఊదుతూ "దొరకు వాలేకుంసలాం చెప్పు. ఇయ్యాల లంబాడోల్ల లగ్గం పట్టాలే. మస్తి బడ్‌గయా. బన్యాగాడు సొదలు పంపిండు. ఈడనే దావతైతాంది. రేపు పగటాళ్ళ దావత్కు ఆడికే వస్తమని అరజ్[166] చెయ్యి" అన్నాడు.

"జీ హుజూర్! అట్లనే అరజ్ చేస్త" అని వెళ్ళిపోయాడు మదార్ సాబ్ .

నాలుగు కల్లుకుండలు గౌండ్లవాండ్లతో పట్టించుకొని వచ్చాడు ఒక మస్కూరు. "కలాలోండ్ల[167]కు మస్తి ఎక్కింది. హడ్డీ నరమ్ చేస్తా[168]" అన్నాడు అమీను. అలా ఎందుకన్నదీ అర్థంకాలేదు వారికి. మాట్లాడకుండా వెళ్ళి కల్లుకుండలు పెట్టి వచ్చేశారు వారు.

"ఏంబే మాట్లాడరు. మస్తి ఎక్కిందా కండ్లకు?" అని ఉరిమాడు అమీను.

"ఏం మాట్లాడం దొరా! మీరా సర్కారోరు. మేం బాంచోళ్ళం. పెడ్తే తింటం, కొడితే పడ్తం" అన్నాడొకడు. "అట్లను. కండ్లక్కనపడ్తలే, నలభై మంది జవాను లున్నరని! ఔర్ చార్ ఘడే లావ్[169]" అన్నాడు అమీను.

"ఆట్లనే బాంచను"

వెళ్ళిపోయారు గౌండ్లవారు. ఇంకో మస్కూరు గంపనిండా సారాయి సీసాలు తెప్పించి సావడిలో బెట్టించాడు. "మంచిదేనా? నీలు కలిపిన్రా?" అని అడిగాడు అమీను, సారాయి సీసాలు తెచ్చినవాణ్ణి.

"నిప్పువంటిది దొరా! నీలు కలుపుతాం సర్కారుకు?" అన్నాడు వాడు.

ఒక బ్రాహ్మడు పొడుం పట్టుపట్టి పైనున్న చిన్న పంచతో ముక్కు తుడుచుకొని అమీను దగ్గరికి వెళ్తే సలాంచేశాడు అమీను. "పుత్ర పౌత్ర, ధన ధాన్యాభివృద్ధిరస్తు" అని దీవించాడు బ్రాహ్మడు. "మేం వచ్చి ఇంతసేపైతే ఇప్పుడొస్తవులె. బాపనోండ్లకు భీ హవా[170] తగిలినట్లున్నది" అన్నాడు అమీను వికటంగా. "ప్రభువులు మీరే అట్టంటే ఎట్లా? మీ ఛత్రచ్ఛాయన జీవిస్తున్నాం. పేదవాణ్ణి కదా! పొరుగూరికి సత్యనారాయణ వ్రతం చేయించటానికి పోయిన. ఊళ్ళోకి రాగానే తాము విచ్చేశారని తెలిస్తే, బియ్యం వగైరాలు యింట్లో పెట్టి దర్శనం చేసుకోవటానికి వస్తూనే ఉన్నా" అన్నాడు బాపండు.

"రీక్ హై. చెయ్యి చూస్తవా?" అని చేయి చాచాడు అమీను.

"మహాప్రభో! కండ్లు కనబడవు. చత్వారం. ఉదయమే వచ్చి చెప్తుతా జరిగింది జరిగినట్లు! శలవా?" అని అడిగాడు బాపడు.

"అచ్చా జావ్ ... ఆ అచార్లు[171] పంపు. బాపనోండ్ల అచార్లు బలే మజాగుంట్రై" అన్నాడు అమీను.

"చిత్తం. అట్లాగే" అని, "ఏదీ వదిలిపెట్టడు తురకవాడు" అని గునుసుకుంటూ వెళ్ళిపోయాడు బాపడు.

సావిట్లో ఎవరూ లేకపోవడం చూచి "లేస్తామా?" అన్నాడు కరణం.

"అచ్చా" అని లేచాడు అమీను.

ఇద్దరూ లోపలికి వెళ్ళిపోయారు. కొన్ని కల్లుకుండలూ, సారాయి సీసాలు బైట పెట్టారు పోలీసులకోసం. అంతా వాటిమీద పడ్డారు.

రాత్రి పదిగంటలదాకా తాగారంతా - కొందరు లోపల, కొందరు బయట. ఎక్కడి సీసాలు అక్కడే, ఎక్కడి కుండలక్కడే పడివున్నాయి. అమీనూ, కరణమూ బయటకువచ్చి మంచాలమీద కూలబడ్డారు సిగరెట్లు పీల్చుతూ.

"ఇంతైతే లంబాడి దయ్యాల్నేమి అనకపోతిరి" అంటించాడు కరణం.

"ఖైర్[172], వాండ్ల బాప్ దాదా యాదికొచ్చేటట్లు చేస్త. దేఖో[173]" అని, "కౌన్ హైరే వహా[174]?" అన్నాడు.

"జీ సర్కార్" అని ఒక పోలీసు వచ్చి సలాం కొట్టాడు.

"ఔరతోంకో పకడ్‌లావ్[175]!"

"అచ్చా సర్కార్" అని వెళ్ళిపోయాడు.

అందెల మోతతో లంబాడీ ఆడవాళ్లంతా వచ్చేశారు. అమీను ఆదేశం మేరకు సావడిముందు వారందర్నీ వరుసలా నుంచోపెట్టారు పోలీసువారు-తూలుతూనే.

అమీన్ ఒక్కొక్కదాని దగ్గరికి వెళ్ళి "చూచినవా, నీ మొగుని గత్ ఏమైందో? కరణంమీది కురుకుతర్లే కరణం మీదికి" అంటూ సాగిపోతున్నాడు.

"ఓహొ బుల్బుల్! ఎంత ఖూబ్సూరత్‌గున్నవే[176]. రాపోదాం" అని చేయిపట్టుకొని లాగాడు లక్ష్మిని అమీను. మరోచేత్తో లాగి లెంపకాయకొట్టింది లక్ష్మి.

నిశ్చేష్టుడై నుంచుండిపోయాడు అమీను. మైకం సగం దిగింది.

"మస్తీ ఎక్కింది. నా లచ్చిమిని పడ్తావుబే" అని గింజుకొని అటూ ఇటూ ఊపి స్తంభాన్ని ఊడలాక్కొని సింహంలా లంఘించాడు భీక్యా అమీను మీదికి. వెనక్కు పరిగెత్తాడు అమీను. పదిమంది పోలీసులు వాణ్ణి

పట్టుకొని ఎదురుగా ఉన్న చింతచెట్టుకు కట్టేశారు.

"కరణపోని నెత్తురు చూస్త, నా లచ్చిమిని గుంజిపిస్తాడు?" అని పండ్లు పంటపట కొరుకుతున్నాడు భీక్యా.

అమీను ఉగ్రుడైపోయాడు. "కమ్రేమే ఫేంకో[177]" అని ఆదేశించాడు.

ఇద్దరు పోలీసులు వచ్చి లక్ష్మిని పట్టుకున్నారు. విదిలించికొట్టింది. ఇద్దరూ పడిపోయారు. పారిపోవడానికి ప్రయత్నించింది. అమీను ఒక్క గంతువేసి ఆమె చేయి పట్టుకున్నాడు.

భీక్యా వాగుతూనే వున్నాడు. కట్లు తెంచుకోవడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు.

లక్ష్మి అమీను మీదికి చెయ్యెత్తింది. మరో చేత్తో పట్టుకున్నాడు అమీను. నలుగురు పోలీసులు వచ్చి గదిలోకి లాక్కుపోతున్నారు లక్ష్మిని. లంబాడీ ఆడవాళ్ళంతా లాక్కుపోయేవాళ్ళమీద పడిబాదారు. గిచ్చారు. కొరికారు. వెనకనుంచి పోలీసులు వాళ్ళమీద పడి లాఠీల్తో బాది లాక్కుపోయారు.

లక్ష్మిని గదిలో పడేశారు.

ముక్తకంఠంతో "లచ్మీ!" అని కేకవేశారు లంబాడీలంతా-మగా ఆడా అంతా.

చింతచెట్టుకు కట్టిన భీక్యా "లచ్చిమీ!" అని ఊరు బద్దలయేంత కేకపెట్టాడు.

అమీను గదిలో ప్రవేశించాడు. గది తలుపు వేయబోయాడు, కిందపడి ఉన్న లక్ష్మి కాళ్ళను నేలకు బలంగా ఆనించి కూర్చొని రెండు చేతుల్తోనూ ఒక తలుపును బలంగా పట్టుకొని మరొక తలుపుతో కలవనీయకుండా ఉంచడానికి ప్రయత్నిస్తూంది.

బూటుకాలుతో లక్ష్మి చేతులమీద తన్నాడు అమీను. పట్టు విడిపోయింది. తలుపు పడిపోయింది. గడియవేశాడు అమీను.

బయటినుంచి భీక్యా కేకలూ ఆడవారి అరుపులూ వినవస్తున్నాయి.

"అబ్ కహా జావోగే బుల్బుల్[178]?" అని ఎదురుగా గోడకుకర్చుకొని వగరుస్తున్న లక్ష్మి మీదికి ఉరికాడు అమీను. పెట్రోమాక్సు వెలుగుకు మెరిసిపోతూంది లక్ష్మి. పిచ్చివాడైపోయాడు అమీను. కామం కళ్ళల్లో బుసలుకొట్టింది. లక్ష్మి వక్షం పట్టుకోవడానికి ప్రయత్నించాడు. దెబ్బతిన్న బెబ్బులిలా రెండుచేతులతోనూ నెట్టేసింది లక్ష్మి.

"ధన్"మని పడిపోయాడు అమీను.

పరిగెత్తి అమీను మీద కూర్చుంది లక్ష్మి. రెండుచేతులూ మెడమీద పెట్టి నొక్కసాగింది.

ఉక్కిరిబిక్కిరైనాడు అమీను. పిస్తోలు తీసి లక్ష్మి గుండెలో షూట్ చేశాడు ఒకటి, రెండు, మూడు గుండ్లు కాల్చాడు.

"కెవ్వు"మని కేకపెట్టి క్రిందపడిపోయింది లక్ష్మి. ఆవిణ్ణి వెనక్కు నెట్టి తలుపుతీసి బయటపడ్డాడు అమీను- "చినాల్ కహీకి" అంటూ బట్టలు దులుపుకుంటూ.

నిషా దిగిపోయింది. కళ్ళల్లో రక్తం తొణికిసలాడింది. కరణం కనిపిస్తే "పట్వారీ చెయ్యబట్టే ఇదంతా" అంటూంటే అమీను నోరు మూశాడు కరణం. "ఇగ్గో మీకు సలాం చేస్త. కాళ్ళు పట్టుకుంట. గీ లంబాడోల్ల ముందర పరువు తియ్యకండి" అని చెయ్యిపట్టి ఇంటివైపు తీసికెళ్ళాడు అమీన్ను - ఇద్దరు పోలీసుల్ను వెంటరమ్మని సంజ్ఞచేస్తూ.

"యాడియె" అని పెద్దగా ఏడుస్తూ గదిలోకి ఉరికారు లంబాడీ ఆడవాళ్ళంతా. కట్టుపడ్డ మగలంబాడీలంతా పెద్దగా విలపించారు.

భీక్యా గొంతు చీల్చుకొని తిడ్తున్నాడు.

నెత్తుటి మడుగులో కొన ఊపిరితో ఉంది లక్ష్మి. చుట్టూ చేరారు లంబాడీలు. "అమీను పెళ్ళాం ముండామొయ్య. కరణం నోట్లో మన్నుపడా" అని తిడ్తూ కన్నీరు కారుస్తూ ఏడవసాగారు. లక్ష్మి చెయ్యెత్తి ఆగమన్నట్లు అందరికీ సంజ్ఞ చేసింది. ఓణీలతో కళ్ళు తుడుచుకొని మౌనం వహించారు ఆమె చెప్పేది వినాలని.

" బద్లా, బద్లా, బద్లా[179]" అని ప్రాణం వదిలేసింది లక్ష్మి.

లంబాడీలంతా గొల్లుమన్నారు.

కట్టుబడిన లంబాడీలు అశ్రుతర్పణం చేశారు.

తోళ్ళు లేస్తున్నదీ లెక్క చేయకుండా విడిపించుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు భీక్యా.

ఈ గడబడకు చుట్టుపక్కల ఇళ్ళవాళ్లేకాక, గ్రామం మొత్తం మేల్కొంది. కాని, ఒక్కరూ తలుపు తీయలేదు, ఒక్కరూ బయటికి రాలేదు.

× × ×

కరణం ఇంటికి చేరి ఇద్దరూ మంచాలమీద కూలబడ్డారు, సిగరెట్ పొగ వదుల్తూ.

"నువ్వు శాన బద్మాష్ ఉన్నవ్, ఇంటిమీదిగ్గిట్ల లంబాడోల్లొచ్చిన్రో లేదో పోలీస్ను పిలిపిస్తవ్, ఖతల్[180] చేయిస్తావు" అన్నాడు అమీను.

"నేను ఖతల్ చేయమన్నానా? నువ్వు దాన్ని గుంజినవ్. అది రానంటే ఖతల్ చేసినవు. ఖతల్ చేసింది నువ్వు-బాజాబ్తా ఖతల్ ముకదామా[181] నడుస్తుంది. పోలీసైతే యెక్కువనా?"

ఖతల్ ముకద్దమా అనేవరకు గుండె జల్లుమన్నది అమీనుకు. తాను ఊరికి వచ్చింది నిజంగా ఖూనీ చేయడానిక్కాదు. కరణాన్ని అతని అధికారాన్నీ కాపాడ్డానికి. వచ్చినందుకు కేసు సరిగ్గానే ఉంది. లంబాడీలు కరణం ఇంటిమీద దాడికి సిద్ధంగా ఉన్నారు. తను వారిని పట్టుకున్నాడు. వాళ్ళను నాలుగు బాది బుద్ధిచెప్పి పంపిస్తే కరణం ఊరిమీద ఇంటికి రూపాయి చొప్పున వసూలు చేసి పెడ్తానన్నాడు. వదిలి పెట్టినందుకు లంబాడీల దగ్గర్నుంచీ తృణమో పణమో పణమో రాల్తుందనుకున్నాడు. కాని అంతా ఉల్టా[182] అయింది. లక్ష్మిని పట్టుకున్నప్పుడు కూడా తానిలా చేయాలనుకో లేదు. అది ఊరికే సిగ్గుపడి ఊరుకుంటే తానట్టే గడబిడ చేసేవాడుకాదు. లెంపకాయ తగలడంతో పట్టుదల హెచ్చింది. అదనా[183] లంబాడీవాళ్ళు పోలీసుల మీదపడి కొడ్తారా? దాన్ని చెరిస్తే ఎవరి తాతకు చెప్పుకుంటారో చూతాం అనుకున్నాడు. అబ్బ, ఎంత బలముంది దానికి? అలా నెట్టితే ఎంత దూరంలో పడ్డాడు తాను! క్షణం ఆలస్యం అవుతే గొంతునులిమి చంపేదే. అల్లా దయవల్ల తటాల్న పిస్తోలు జ్ఞాపకం వచ్చింది. అలాకాకుంటే ఇప్పటికి తాను చచ్చి ఉండేవాడు. అసలు తనదే తప్పు, కరణం మాటమీద ఆడవాళ్లను పిలిపించకుండా ఉండాల్సింది. ఇప్పుడేమో దీన్ని ఖూనీ కేసు చేస్తానంటున్నాడు కరణం. వాస్తవంగా ఇది ఖూనీ కేసే. కరణాన్ని ఏదో చిక్కులో పెట్టి తప్పుకోవాల - అనుకున్నాడు.

"ఖతల్ ముకద్దమలే ఖతల్ ముకద్దమా. ఖతల్ చేసింది నువ్వా నేనా? దాన్ని పట్టుకొని గుంజాతవ్. అది కొరకుతే నాకాణ్ణించి పిస్తోలు గుంజుకుని కాలుస్తవు. అమీనుసాబ్ పిస్తోల్ల కాలుస్తవులె. నీ పట్వారీ గిరి యాడుంటదో చూస్త. ముంగల గిరఫ్తార్[184] చేసి హవాలాత్ల[185] పెడ్త. ఊళ్లనుంచే గవా[186] పుట్టిస్త" అని వికటంగా నవ్వాడు అమీను.

ఆ నవ్వు సావిట్లోంచి వస్తున్న రోదన ధ్వనుల్ను చీల్చుకొని కరణం గుండెకు కన్నం వేసింది.

కత్తిపోటుకు రక్తం చుక్కలేకుండా అయింది కరణం ముఖం.

అమీన్ గట్టివాడు. అదీకాక తురకవాడు. సర్కారుకు వాడు చెప్పిందే వేదం. నిజంగానే అరెస్టు చేసినా చేయొచ్చు. తాను జేలుకు వెళ్ళితే తనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పేవారు ఊళ్ళో బోలెడుమంది. 'పట్వారి గేదె చస్తే ఊరంతా చూడడానికి వచ్చారు. కాని పట్వారీ చస్తే ఒక్కడూ రాలేదు' అనే ఉర్దూ సామెత గుర్తుకు వచ్చిందతనికి. అదీకాక దొర, అమీను కలిసి సాక్ష్యం బనాయించినా బనాయించవచ్చును. వాస్తవానికి ఆ భూమి లంబాడీల పేరనేవుంది. దాన్ని నారయ్యకి అమ్మడం మోసం. దగా క్రింద మరొక కేసు తయారుకావచ్చు. తాను సర్వనాశనం అవుతాను అనుకుంటూ ఉండగానే-

'అరే పట్వారీ జభీ భూల్‌గయారే[187]. కలాల్ను[188] ఖతల్ చేయించి మామిడి తోట్ల దఫన్[189] చెయ్యాలే. నా మీద్కే లేస్తవులే. చూస్కో నిన్ను దఫాయిస్తా[190].

కరణానికి కంపరం పుచ్చుకొన్నది. ఆ కేసు అయిపోయి చాలాకాలం అవుతే కావచ్చు. బైటపడ్తే అదీ ప్రమాదమే. తాను సర్వనాశనం అయ్యే రోజు వచ్చిందనుకొని అమీను జుట్టు పట్టుకుంటే ప్రయోజనం లేదనుకున్నాడు.

'సర్కార్! తాగిన నిషాల అన్నదానికి ఇంత చేస్తారు? మీరు సర్కారు, నేను పట్వారిని, పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం వేస్తరా. ఇప్పుడంత చెయ్యి జారిపోయింది. లంబాడీల్ను రిహా[191] చేస్తిరా, మీకూ ఖత్రే, నాకూ ఖత్రేనే. లంబాడీలు ఊరి మీద హమ్లు చెయ్యటానిక్కి వచ్చిన్రు. డాకా చెయ్యడానికి వచ్చిన్రు. గ్రామం హిఫాజత్[192] కొరకు పోలీసు వచ్చింది. బెదిరించడానికి గాలిలోకి బందూఖ్‌లు కాల్చింది. లంబాడీలు వెనక్కు తిరిగి పోలీసుమీద బందూఖ్‌లు కాల్చిన్రు. పోలీసు హిఫాజత్ కోసం తిరిగి బందూఖ్‌లు కాల్చిన్రు. ఫరారైతున్న లంబాడీదానికి ఎదురుంగొచ్చిన గోలీ తగిలింది. లంబాడీ చచ్చింది. గట్లంటే మీకు ఖత్ర[193] లేదు, నాకు ఖత్ర లేదు. అట్లయిందని గవా[194] పుట్టిస్త. మా ఇంట్ల పాత బందూకులున్నయి. ఇస్త ముకద్దమ[195] గట్టిపడ్తది. ఏమంటరు?' అన్నాడు కరణం.

"ఊరిమీది కెందుకొచ్చిన్రు. జమీన్ పంచాయత్‌ల కద?"

"యాది భూంపంచాయతుండి? భూమి లంబాడోల్ల పేరనే ఉన్నది."

"నారయ్యగారు కాస్తు[196] చేస్తున్నడు కాదు?"

"నారయ్య దున్నుకుంటే నా ఇంటి మీదెందుకు పడాల్నండి? కాబట్టి ఇది డాకే. జర దొరను కట్టుకోవాలె."

"అచ్చా! ఖరారబోలా[197]. లావ్[198] లంబాడొండ్ల హహలా[199] చేసి పొద్గాల లంబాడోల్ను పట్కపోత. రఖమ్[200] ఎంతిస్తనంటవు?"

"ఇంటికి రూపాయి, నాలుగు నూర్లిస్త."

" నై బస్ నై హోతా"[201]

"నేనొక నూరిస్త."

"హజారు[202] కావాలె."

"హజారు ఎట్ల హుజూర్! సాత్ సౌ[203] ఇస్త."

"హజారు కంటె ఏక్ పైసా కమ్‌నై"- లేచి నుంచున్నాడు అమీను.

"అచ్చా[204]"

× × ×

లోకానికి తెల్లవారిందే కాని ఆ ఊరికి తెల్లవారలేదు. ఒక్క తలుపూ తెరవలేదు. గడీముందుతప్ప ఊడ్చు చానిపి[205] చల్లలేదు. సావిట్లో ఏడుపులూ పెడబొబ్బలూ ఇంకా వినవస్తూనే ఉన్నాయి.

పండ్లపుల్లలు వేసుకొని మంచాలమీద కూర్చొని ఉన్నారు అమీనూ, కరణమూ. దూరంగా అయిదారుగురు పోలీసులు తుపాకులు పట్టుకొని నుంచొని ఉన్నారు. ఒక మస్కూరు పరుగెత్తుకొని వచ్చి సలాంచేసి రొప్పుతూ 'లండాడీ తండలకు తండలే[206] వస్తాన్నయిుండి' అని చెప్పాడు. కరణానికీ, అమీనుకూ కంపరం పుచ్చుకుంది. ఒకరి ముఖం ఒకరు చూచుకొన్నారు. దీర్ఘంగా ఆలోచించారిద్దరూ. అమాంతంగా ఏదో ఆలోచన వచ్చినట్లు, రెండు కచ్చడాలు అయిదు పెద్ద బండ్లు ఫౌరన్[207] తయ్యారు కావాలే అని ఒక మస్కూరుకు ఆదేశించాడు కరణం. వెంట పోలీసుల్ను తీసుక వెళ్ళమన్నాడు అమీను.

క్షణంలో రెండు కచ్చడాలు తయారైనాయి. కనిపించిన బండినల్లా పట్టుకొని అయిదు బండ్లు తయారుచేశారు మస్కూర్లు. గుంజలకు కట్టిన లంబాడీలను విప్పి, నడుముకు తాడుకట్టి బండ్లకు కట్టారు. ఒక కచ్చడంలో అమీనూ, మరొక కచ్చడంలో కరణమూ, తాయారూ కూర్చున్నారు.

బండ్లు వరవేగంతో సాగిపోతున్నాయి. బండ్ల వెనుక త్రాళ్ళు లాగుడుకు పరిగెత్తే లంబాడీలకు రాత్రంతా తిండిలేదు, చావుదెబ్బలు తగిలాయి. పైగా దుఃఖంతో కుమిలిపోతున్నారు. ఎద్దుల్తో పరిగెత్తగలరా? పరిగెత్తలేక పడిపోయినవారిని లాక్కుపోతున్నాయి కచ్చడాలు. వాటి వెనక పోలీసుల బండ్లు పరిగెత్తుతున్నాయి.

బండ్లు బైల్దేరిపోయిన కాసేపటికి లంబాడీ ముఠాలు పెద్ద కేకలు వేస్తూ, ఏడుస్తూ గ్రామంలో ప్రవేశించాయి. సావిట్లో శవం తప్ప ఏమీ కనిపించలేదు. శవాన్ని చూచి ఆడవాళ్ళు సావిట్లో దూరి పెద్దగా ఏడ్వసాగారు. పోలీసులు పారిపోయారని తెలిసి వెంబడించారు లంబాడీలు. పరుగెత్తుతే కనుచూపు మేరలో బండ్లు కనిపించాయి. ఆ గుంపునుచూచి పోలీసులు తుపాకులు పేల్చారు.

'హవామే[208] గోలీ చలావ్. కోయీ నహిమర్నా' అని ఆదేశించాడు అమీను.

ఒక్కసారి నలభై తుపాకులు గాలిలో పేలాయి.

లంబాడీలు బెదిరిపోయారు.

బండ్లు సాగిపోయాయి.

కొంతదూరం వెళ్ళింతర్వాత లంబాడీలలో ఎవరూ బండ్ల వెంట పరిగెత్తలేకపోయారు. పరిగెత్తలేక పడిపోతే బండ్లు లాక్కుపోతున్నాయి. భూమి రాపిడికి చర్మంలేచి రక్తం కారుతూంది. ఆ మంటలకు తట్టుకోలేక పరిగెత్తుదామంటే సత్తువ లేకుండా ఉంది. ఈ విధంగానైతే వారు పోలీసు స్టేషనుకు ప్రాణాలతో చేరడం అసంభవం అని తేల్చుకున్నాడు అమీను.

'బండ్లెక్కించుర్రి కొడుకుల్ని' అన్నాడు.

బండ్లన్ని ఆగాయి. ఒక బండి ఖాళీచేసి, అందరి కాళ్ళకూ బంధాలు పెట్టి, ఆ బండిలో ఎక్కించారు పోలీసులు. ముందు కరణం బండి, తరువాత అమీను బండి, ఆ తర్వాత లంబాడీలదీ, దాని వెనుక మిగతా బళ్ళూ సాగేయి.

బండ్లు పోలీసు స్టేషన్ చేరేవరకల్లా మధ్యాహ్నం అయింది. కాళ్ళ బంధాలు విప్పితే బండి దిగి పోలీసుస్టేషన్ వరండాలో చేరారు లంబాడీలు. అక్కడున్న మంచినీళ్ళకుండ చూచి ప్రాణాలు లేచి వచ్చాయి. నీళ్ళడుగుతే అల్యూమినియం గ్లాసుతో నీళ్ళు తెచ్చిచ్చాడు ఒక సాయెబు. ఆ నీళ్ళు త్రాగమని నిరాకరించారు లంబాడీలు. 'అరే పానీ[209] తాగకుంటే చచ్చేటట్లున్నరు. కుమార్‌కు బులాకె పానీ పిలావ్[210] అన్నాడు అమీను.

లంబాడీలు. 'అరే పానీ[209] తాగకుంటే చచ్చేటట్లున్నరు. కుమార్‌కు బులాకె పానీ పిలావ్[210] అన్నాడు అమీను. ఒక జవాను పరిగెత్తి వెళ్ళి కుమ్మరివానితో కుండలో నీళ్ళు పట్టించుకొని వచ్చాడు. ఒక్కొక్కడు కుంచెడు నీళ్ళు త్రాగాడు. ఓపిగ్గా అందరికి నీరు తెచ్చి పోశాడు కుమ్మరి. కొద్దిగా సత్తువ వచ్చింది. శరీరాలు చూసుకుంటే నెత్తుటిమయం. తలగుడ్డలు తీసి గాయాలు ఒత్తుకున్నారు. తరువాత అందరి కాళ్ళకూ, చేతులకూ బేడీలు వేశారు పోలీసులు. వారందర్నీ పోలీసు స్టేషన్ ముందున్న వేపచెట్టుకింద కూర్చొపెట్టి వెళ్ళిపోయాడు అమీను. కరణమూ వెళ్ళిపోయాడు. అతనితోపాటే బండిలో తాయారు భద్రప్రదేశానికి చేరుకుంది. దూరంగా వున్న పిట్టగోడమీద కూర్చొని బీడీలు పీకుతున్నారు ఇద్దరు పోలీసులు.

"ఏం చేసిన్రురా" అడిగాడు కుమ్మరి.

"ఏం చేసినమా? ఆ కరణం లేడు? ఆని బిడ్డను" అని పళ్ళుకొరికాడు భీక్యా.

మిగతావాళ్ళంతా అతణ్ని వారించి "కరణపాయనకు డబ్బిచ్చినం జమీన్‌కని. డబ్బు తిన్నడు. జమీన్ ఇయ్యమంటే గిట్ల చేసిండు. ఆని పెండ్లాన్ని చంపించిండు" అని చెప్పాడొకడు.

"ఈ దేశంల ఏమన్న సర్కారున్న దనుకుంటున్రురో! దొరలు, కరణాలే రాజ్యమేలతాన్రు, పోలీసోల్లు వాళ్ళ చేతుల్ల కుక్కలు" అని అటూ ఇటూ చూసి ఎవరు దగ్గర్లో లేరనే విషయం ధ్రువపర్చుకొని, "ఒక గడ్డపు తురకోడొస్తడు. తురకల్ల కల్వమంటడు గాని ఆని మాట ఇనకురి. రాజ్యమంతా తురకల్ను చెయ్యాలనీ చూస్తాన్రు" అని చెవుల్లో చెప్పినంత మెల్లిగా చెప్పి, "ఎప్పుడు తిన్నరో, బువ్వ పట్టకొస్త" అన్నాడు పెద్దగా అందరూ వినేట్లు.

అన్నాలు తెచ్చి పెట్టాడు కుమ్మరి అందరికీ. నూనె తెచ్చి శరీరాల నిండా రాచాడు. "ఎప్పుడిరగడైపోతదో ఈ దొరల రాజ్యం" అన్నాడు కుమ్మరి. అన్నాలు తిని కాస్త సేద తీరింతర్వాత లక్ష్మి విషయం గుర్తుకు వచ్చింది వారందరికి. అంతా ఒక్కసారి గొల్లుమన్నారు.

"హుష్! నోర్ముయ్యి. ఎవళ్ళో చచ్చినట్లు ఏడుస్తరేవ్రా" అన్నాడు తుపాకీ పట్టుకొని కాపలా కాస్తున్న పోలీసు జవాను.

"చచ్చింది నీ పెళ్ళమా?" అన్నాడు భీక్యా.

"ఏమన్నావురా! నా పెండ్లాన్ని చావమంటావు?" అని తుపాకి మడమతో భీక్యా నెత్తిమీద కోపంతో బాదాడు పోలీసు. కాళ్ళకూ, చేతులకూ బేడీలున్నాయి, ఏం చేస్తాడు పాపం?

"అబ్బ" అని పడిపోయాడు.

తల పగిలి రక్తం ప్రవహించింది. పోలీసులు పరిగెత్తుకొనివచ్చి లేపారు. ఆ రక్తాన్ని చూచి బెదిరిపోయారు. కొందరు తడిగుడ్డల్తో రక్తం తుడుస్తుంటే ఒకడు అమీను ఇంటికి పరిగెత్తాడు. అమీను వచ్చి చూస్తే భయంకరమైన దృశ్యం కనిపించింది. తల తిరిగిపోయింది.

"కౌన్ మారా[211]?"

కొట్టినవాడు దూరంగా తలవంచుకొని నుంచున్నాడు. చేతికర్రతీసుకొని ఉగ్రుడై వాడిమీదపడి అమీను వాడి పొట్టమీద, కాళ్ళమీద, చేతులుమీద అనేక వాతలు వచ్చేటట్టు కొట్టాడు. కర్ర విరిగిపోతే అక్కడ పారేసి వెళ్ళిపోయాడు, వానికి బేడీలు పెట్టి కొట్లో వేయమని ఆజ్ఞాపిస్తూ.

భీక్యా నేలమీద పడిపోయాడు. కాళ్ళకూ, చేతులకూ బేడీల్తో లంబాడీలు అతని చుట్టూకూర్చొని ఏడుస్తున్నారు. భీక్యా పెదవులు కదుల్తున్నట్లు కనిపిస్తే ఏడ్పుమాని అంతా చెవులు నిక్కబొడుచుకొని విన్నారు.

"బద్లా, బద్లా, బద్లా[212]" అంటూ ప్రాణాలు వదిలాడు భీక్యా.

లంబాడీలు గొల్లుమన్నారు.

ఊరంతా ఉడికిపోయింది. కాని, ఒక్కరూ లంబాడీల సహాయానికి రాలేదు.

భీక్యా శవాన్ని, దెబ్బలుతిన్న పోలీసువాణ్ణి హాస్పిటలుకు పంపించారు.

లంబాడీలు రెక్కల్లేని పక్షుల్లా విలపించారు.

ఆకాశంవైపు చూచి న్యాయం కలుగజేయమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఏడిచారు.

పోస్టుమార్టం చేసి శవాన్ని అప్పగించారు. ఖనన సంస్కారం చేసి వచ్చేశారు లంబాడీలంతా. సంస్కారానికి అయిన డబ్బేకాక, త్రాగుడుకు కూడా కొంత ఇచ్చాడు కరణం. బేడీలుతీసి ఒక కొట్లోవేసి తాళం వేశాడు. బాగా తాగారు. మైమరచి నిద్రపోయారు - శరీరానికి, హృదయానికి తగిలిన గాయాల్ను లెక్క చేయకుండా.

తెల్లవారి ఖాజీ వచ్చాడు. అందర్నీ చెట్లక్రింద కూర్చుండబెట్టి ఇస్లాంను గురించి సుదీర్ఘంగా ఉపన్యసించాడు.

"... కావున, శిలలను, నరులను నమ్మరాదు. ఈ భూమిని ఆకసమును అల్లాయే సృష్టించినాడు. లా ఇలాహ ఇల్లల్లాహి మహమ్మదున్ రసూలల్లా హి- అనగా అల్లా తప్ప వేరు దైవము లేదు. మహమ్మదు అతని చివరి ప్రవక్త అయి ఉన్నాడు. ఈ విషయమును నోటితో పలించి మనసార విశ్వసించుటే "ఇస్లాం" అనబడును. లోకమున నిదొక్కటియే మతము, ఇదొక్కటియే విశ్వాసము. మీరు ఇస్లాం స్వీకరించుడు. మీకు మేలు కలుగును, ఇక్కడి మున్సిఫ్ ఖ్వారా ఇనాయతుల్లా బేగ్ లాహరీ మంచి ముసల్మానుడు. అతడు మీకు ఎట్టి శిక్ష పడకుండ చేయుటేకాక మీ భూమి మీకు ఇప్పించగలడు.

నవాబ్ మీర్ ఉస్మాన్ ఆలీఖా బహద్దుర్ ఖలదల్లాహుస్సల్తనతా మన ప్రభువు. అతడు ముసల్మానులకు అనేక సౌకర్యములు కలిగించుచున్నాడు. మీరు సమ్మతించిన ఇప్పుడే మీకు ఇస్లాం ఇవ్వగలను."

లంబాడీలు ఒకరు ముఖాలు ఒకరు చూచుకున్నారు. చాటుకు వెళ్ళి సంప్రదించుకున్నారు. "మా తండా నాయక్ ఎట్ల చెపితే అట్ల ఇంటం" అన్నారు.

"అయిన మీరు ఇస్లామును స్వీకరించరా?" ఖాజీ అడిగాడు.

ఎవరూ మాట్లాడలేదు.

"చావుడు. మీకు పోగాలము దాపురించినది. మీ అందరిని జేలుకు పంపకున్న నేను ఖాజీని కాను" అని ఉగ్రుడై అమీనుతో ఏదో చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి లంబాడీల్ను యమయాతన్లు పెట్టారు పోలీసులు.

వరుసగా లంబాడీల్ను కూర్చోపెట్టారు. ఒక్కొక్క పోలీసు ఒక్కొక్కణ్ణి లాఠీలతో మోచేతులమీద, మోకాళ్ళమీద కొట్టారు. దెబ్బలకు తాళలేక లంబాడీలు మొత్తుకొంటూంటే "ఒప్పుకోండి, ఒప్పుకోండి" అన్నాడు అమీను.

లంబాడీలు ఒప్పుకోలేదు.

"జనపనార" అన్నాడు అమీను.

లంబాడీల్నందర్నీ నుంచోపెట్టి జనపనార నులకతో బిగించికట్టారు భుజాలదగ్గర్నుంచి

బిగుసుకుంటూంది. వళ్ళంతా హూనం అవుతూంది. 'ఒప్పుకోండి, ఒప్పుకోండి' అన్నాడు అమీను. 'చెయ్యందెట్లు ఒప్పుకుంటమండి' అన్నాడొకడు. 'జవబ్బీ చెపుతరులే' అని 'మారో[213]' అన్నాడు అమీను.

పోలీసులు బాదారు. లంబాడీలు ఒప్పుకోలేదు.

"తలకు కట్టురి లంబాడి దయ్యాలు ఖబూల్[214] చేస్తాయి ఆసానీగ[215] అన్నాడు అమీను.

జనపనార తలలకు కట్టి రెండు చివరలు కలిసేచోట పుల్లలు పెట్టి తిప్పారు. పుల్లను తిప్పుతూంటే తలను ఒత్తేస్తూంది త్రాడు. మోకాళ్ళకూ, మోచేతులకూ దెబ్బలు తగిలివున్నాయి. ఒంటికి బిగుసుకుపోతున్న జనపనార, తలకు త్రాళ్ళు కట్టి బిగిస్తున్నారు. "లబో దిబో" మొత్తుకోసాగారు. 'అరుస్తారు బే' అని బాదసాగారు పోలీసులు. 'ఇద్దరు చచ్చిన్రు. అందరెందుకు చస్త్రారా? పెళ్ళాలు మందిపాలైతరు. ఒప్పుకోండి' అన్నాడు అమీను.

శరీంతోపాటు గుండె మండుతూంది. ఒక్కసారి అందరూ కలిసి పోలిసుల్నీ చంపేసి, పోలీసు స్టేషన్ తగలబెట్టి, తురకరాజ్యం కూలతోయాలన్నంత కసి పుట్టింది వారికి. కాని, యేంచేయగలరు? పోలీసులు, తుపాకులు, రాజ్యం వాళ్ళది.

'చంపురి. కొయ్యురి. చెయ్యంది ఎట్లొప్పుకుంటముండీ?' అన్నారు. మోకాళ్ళపై దెబ్బలకే అందరిచేతా నేరాలు ఒప్పించాడు తాను. లంబాడీల చేత నేరం ఒప్పించకుంటే తనను ఒట్టి చాతకానివాడంటుంది సర్కారు. ఇద్దర్ని చంపినా, ఇన్ని హింసలు పెట్టినా, ఇస్లాంలో చేరమంటే చేరరు. నేరం ఒప్పుకోమంటే ఒప్పుకోరు. లిప్తపాటు వారిమీద గౌరవభావం ఏర్పడింది. వెంటనే తాను మనిషి కాదనీ, పోలీసని గుర్తుకు వచ్చింది. రాక్షసుడైపోయాడు.

'కారం, కర్రలు' అన్నాడు అమీను.

కర్రలకు కారంపూసి ఆసనాలలో పెట్టారు. లంబాడీలు బాధ భరించలేక ఓ అంటే ఓ అని మొత్తుకోసాగారు. మొత్తుకుంటుంటే బాదసాగారు పోలీసులు.

'ఖబుల్లేవ్. నైతో జలాదూగా[216]' అని పిస్తోలు తీశాడు అమీను.

'చంపురి, బతికి చేసేదేమున్నది?' అన్నాడొకడు.

'ఒప్పుకుంటం, ఒప్పుకుంటం' అన్నాడొకడు.

అతన్నే అనుసరించారంతా.

'షేక్ లతీఫుల్ హసన్ అమీన్ అంటే ఏమనుకున్నరు?' అని విజయగర్వంతో నవ్వేశాడు అమీన్.

ఆ నవ్వు చూచి మెడ పిసికేయాలన్నంత కోపం వచ్చింది లంబాడీలకు. అయినా ఎవ్వడు మాట్లాళ్ళేదు.

'ఏమొప్పుకుంటరు?" అడిగాడు అమీను.

'ఏమొ, మా కేమెరుక?'

'రేపు మున్సఫ్ కచ్చేర్కి తీస్కపోతం. ఆడ సర్కారు వకీలు ఏది చెప్తుతే అది ఒప్పుకోవాలె.'

'అట్లనే!'

'ఊర్మీద్కి డాకా వెయటాన్ని వచ్చినమని ఒప్పుకోవాలె.'

లంబాడీల ఎదల్లో అగ్గి మండింది. దొమ్మీకి వచ్చారా వీరు? తమ హక్కు కోరడానికి వచ్చారు. తండ్రి డబ్బు తింటాడు. పొలం ఇయ్యడు. కొడుకు ఇంకొకనికి పొలం అమ్ముకుంటాడు. అది అడగడానికి రావడం డాకాకు వచ్చినట్లు ఒప్పుకోవాలి. ఒప్పుకోకుంటే బ్రతికేట్లులేరు. భూమి దొరక్కున్నా బ్రతకనయితే

బ్రతకాలి కదా? పగ తీర్చుకోవాలిగా? ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు.

"అట్లనే."

"లచ్చిమిని చంపినమని ఒప్పుకోవాలె".

అగ్గి కురిసింది. చంపింది అమీను. అది అంతా చూచారు. కాని, తాము చంపామని ఒప్పుకోవాలి. ఒప్పుకోకుంటే తమకు వకీలా? సాక్ష్యమా? న్యాయం చాల విలువైంది. దాన్ని వారు కొనగలరా? ఒప్పేసుకోవడమే మంచిది. ఖాజీ చెప్పినట్లు జుట్టూ మొలత్రాడూ తీసేసి తురకల్లో కలుస్తె మంచిదేమో ననుకున్నారు. వెంటనే మారిపోయింది ఆలోచన. జుట్టు, మొలత్రాడు తీసివెయ్యనందుకు ఇంత హింస పెట్తారా? సరే, కానివ్వు చూతాం అనుకున్నారు.

"అట్లనే."

"గిప్పుడు రస్తకొచ్చిన్రు[217]. చంబార్‌కే దేవ్ కో చప్పల్‌కీ పూజా[218]. నర్మి[219] తో:టి ఇంటారు?" అన్నాడు అమీను.

"ఖోల్‌దేవ్[220]" ఆజ్ఞాపించాడు అమీను.

"గుగ్లోత్ లాల్యా వగయిరా ముల్జిమీన్[221] హాజర్‌హై[222]" అని మూడు సార్లు కేక వేశాడు కోర్టు జవాను.

లంబాడీలను కోర్టులో ప్రవేశపెట్టారు. సర్కారు వకీలు ముందుకు వచ్చి "అలీజనాబ్! ముల్జిమ్‌లు లాల్యా వగైరా డాకా వెయ్యిటాన్కి పోయి లక్ష్మిని చంపిన్రు. తాజీరాత్[223] ముమాలిక్ మహరుసా సర్కార్ ఆలియాయొక్క దఫా 224[224] ఖత్లే[225] ఆమద్ 291 హమ్‌లా[226] 314 సర్జా[227] 327 డకేటీ[228] క్రింద తహాభీఖాత్[229] జరిపి సజా[230] ఇవ్వవలసిన ఆరజ్[231]" అన్నాడు.

మెజిస్ట్రేటు పేర్లు వగైరాలడిగి "ఖుదాకో హాజర్ నాజర్ జాన్కర్ కహతా హుకిమై జోకుఛ్ భీ కహూంగా సహి కహుంగా. సివాయే సహికే ఔర్ కుఛ్ నహీ కహుంగా[232] అని ప్రమాణం చేయమన్నాడు.

లంబాడీలంతా తికమకపడ్డారు. సత్యం చెపుతామని ప్రమాణం చేసి అబద్ధం ఎలా చెప్పాలి? సత్యం చెప్పేద్దామనుకున్నారు కాని, అందువల్ల ప్రయోజనం లేదనుకున్నారు. దేవునిసాక్షిగా అబద్ధం చెప్పలేమనుకున్నారు.

"ఖసం తినం[233] సర్కార్" అన్నారు.

అమీను వళ్ళు మండింది. "సర్కార్ ఖసం తిన్నట్లుగా అన్కోవాలని అరజ్" అని విన్నవించాడు. మేజిస్ట్రేటు సర్కారీ వకీలువైపు చూచాడు. అతని కళ్ళేమో చెప్పాయి.

"అచ్ఛా" అన్నాడు మేజిస్ట్రేటు.

"డాకాకు పోయిన్రా?" సర్కారీ వకీలు అడిగాడు.

అమీను కళ్ళెర్రజేసి, చెప్పండి చెప్పండి అన్నట్లు సంజ్ఞ చేశాడు.

"పోయినం సర్కార్!"

"లక్ష్మిని ఖతల్ చేసిన్రా?"

".... .... ..."

ఎవరి నోటిలోంచి మాట రాకుంటే ఎముకలు విరక్కొడ్తానన్నట్టుగా క్రూర చూపాడు అమీను.

'చేసినం సర్కార్!'

'ముల్జిములు జురుమ్ ఖుబూల్[234] చేసిను కాబట్టి ఒకొక్కనికి మూడేండ్లు సజాయె ఖైద్[235] ఇవ్వనైనది. ముల్జిములు ఇకనుంచి బుద్ధిగలిగి ఉండాలె' అని తీర్పు ఇచ్చారు మున్సఫ్.

లంబాడీలందరికి బేడీలు వేసి తీసికెళ్ళారు పోలీసులు.

తరువాత భీక్యాను చంపిన అబ్దుల్ సలామ్ కానిస్టేబుల్ను కోర్టులో ప్రవేశపెట్టారు.

నేరారోపణ ప్రమాణం చేయించడం వగైరా లాంచనాలు అయిపోయింతర్వాత మేజిస్ట్రేటు అడిగాడు:

'భీక్యాను కొట్టినవా?'

'కొట్టిన్నుండి!'

"ఎందుకు కొట్టినవ్?"

"హిరాసత్ల[236] నుంచి ఫరార్[237] అయితాంటే."

"బేడీలు లేవు?"

"ఉన్నయ్యండి."

"అయితే ఎట్లు ఫరారయ్యిండు?"

"ఎట్ల ఫరారయ్యిండు?" అని అమీనువైపు చూచాడు

కొరికినట్లు సంజ్ఞచేశాడు అమీను.

"పండ్లతోని కొరికి ఫరారయ్యాండు."

"పండ్లతో కొరికిండులే ఇనుప భేడీల్ను?'

"అబ్బ! వానికెంత తాఖత్[238] ఉన్నదనుకున్నారు. ఇట్ల కొరికేటార్కాల్ల..."

"ఇంతకు ఫరారైతాంటే కొట్టినంటవు?"

చెప్పొద్దన్నట్లుగా సంజ్ఞచేశాడు సర్కారు వకీలు. భీక్యా చాలా బలహీనంగా ఉన్నాడనీ, మామూలు దెబ్బకే ప్రాణాలు వదిలాడనీ నిరూపించటం వాళ్ళ ఉద్దేశం.

ఏం చెప్పాలో అర్థంకాక, "పండ్లూడిపోనయుండి" అన్నాడు సలామ్.

"ఇంతకు ఫరారైతాంటే కొట్టిన్నంటవు?"

"అంతేకాదుండి మరి."

"ముల్జిం అబ్దుల్ సలామ్. భీక్యాను చంపాల్నని కొట్టలేదు. భీక్యా ఫరార్ అయితూంటే ఫరజ్ అంజామ్ చేయటాన్కి[239] కొట్టిండు. కాబట్టి ముల్జిమ్ను బేఖుసూర్గా[240] భావించి రిహా చేస్తున్నం[241]" అని తీర్పు ఇచ్చాడు.

## 12

ఆ రాత్రి నిద్రపట్టలేదు వనజకు. "ఈ రేయి నన్నొల్లనేరవా?" ఆవిడ మెదడులో ఇంకా గింగురమంటూనే వుంది. అతని పాట హృదయాన్ని కరిగిస్తుంది. మాట గుండెలను జలదరింపచేస్తుంది. అతడంటే తనకు ఎనలేని ప్రేమ ఏర్పడింది. ప్రేమ అనే పదానికి ప్రత్యక్షంగా అర్థం చెప్పకున్నా, ప్రేమ అనేది ఒకటి వుందని తెలియజేసినవాడు అతడే. తన పేరు అందమయినదనీ, దాని కర్థం తామర పూవనీ

తెలియపర్చింది అతడే. చెరువునిండా వుండే తామరపూలు గుర్తుకు వచ్చాయి. ఎంత అందంగా వుంటాయి తామరపూలు! ఎంత అందమయినది తన పేరు! ఎవరు పెట్టారో అడుగుదామనుకొంది. ఎవర్నడగాలి? నిలువుటద్దం ముందు నుంచొని చూచుకుంది. నిజంగా తను అందమయినదే. ఆ తరువాత ఏవేవో గిలిగింతలు పెట్టే మాటలు చెప్పాడు. అతణ్ణి చూడకుండా ఉండలేని దశ వచ్చిందే. ఎంత తియ్యగా మాట్లాడ్తాడు. వెన్నెల విరిసినట్లు, పూలు కురిసినట్లు!

అతణ్ణి ప్రేమించింది తాను. వలచింది, వరించింది. కాని తానెవరు? దాసి, ఆడబాప, అంటే సుమారు వేశ్య అని అర్థం. వేశ్య డబ్బుకై తన తనువును అమ్ముకుంటుంది. తన తల్లీ, తన ఆచారాలూ తనను అమ్మి వేశాయి, జంతువును అమ్మినట్లు. తాను బ్రతికి ఉన్నన్నాళ్ళు ఈ దొరకు బానిసే. తాను వేశ్యకంటే కడుహీనం. వేశ్య తాను ఒద్దనుకుంటే, తనకు డబ్బు అవసరం లేదనుకొంటే తనను అమ్ముకోవాల్సిన పనిలేదు. కాని, తాను? తనకు ఇష్టం వున్నా లేకున్నా, అవసరం ఉన్నా లేకున్నా అర్పించేయాల్సిందే కోరిన వారికి - గడీకి వచ్చినవారికి. ఇది గుండెలేని జీవితం. ఇలాంటి జీవితాన్ని కోరితెచ్చుకొనేవా రెవ్వరూ ఉండరు. అది వచ్చిపడినప్పుడు అందులోని కుళ్ళును గ్రహించి, దాన్నుంచి బయటపడాలని చూసేవారు తక్కువే. సరళ, విమల, ప్రమీల - వారూ తనవలెనే జీవిస్తున్నారీ గడీలో. అతడు రాకముందు తానూ వారివలెనే జీవించింది.

అతడు వచ్చాడు. తన బ్రతుక్కూ, ప్రేమకూ, అర్థం తెలిసింది. తాపత్రయం పెరిగింది. ఈ కుళ్ళులోంచి బయటపడాలని నాటినుంచి మధనపడుతూంది తాను. కాని, ఏం చేయాలి? మనసారా ప్రేమించిందతణ్ణి. అతనికి తన ప్రాణం సహితం ఇవ్వడానికి సంకోచించదు. అతని బాధల్నూ దుఃఖాల్నూ పంచుకోగలదు. అదే తనకు కావల్సింది. అంతే తనకు కావాల్సింది.

అతడెంత మంచివాడు! ఎన్నో రోజులుగా తనను చూస్తున్నాడు. ఎన్నో రకాలుగా మురిపిస్తున్నాడు. కాని, ఒక్కనాడయినా కామం వ్యక్తం పర్చాడా? అతడు నరుడుకాడు. వట్టి రాతిమనిషిలాంటి తనలో ప్రాణం పోశాడు. గుండె ఏర్పరచాడు. అట్లాంటి అతనితో జంటగా ఫోటో దిగుదామనుకుంది, దొరతో చెప్పి.

పెళ్ళాడ్దామనుకుంది. అతని వక్షంలో తలదాచుకున్న నాటి ఆనందాన్ని తల్చుకొని ఉబ్బిపోయింది. తనకూ ఒక భర్త ఉంటాడనీ, అతనితో జంటగా అందరికీ కనిపించవచ్చుననీ ఉబ్బిపోయింది. ఆ గాలిమేడలూ, ఆ ఆశాసౌధాలూ అన్నీ ఏం కావాలి?

కూలిపోవాలి. కాలిపోవాలి.

కాళ్ళకింద భూమి కరిగిపోయింది. పాతాళంలో పడిపోయింది. అంతా అంధకారం. ఎవరో గట్టిగా గుండెను పట్టుకొని ఆపినట్లు అనిపించింది, ఊపిరాడలేదు. తబ్బిబ్బైంది.

కొన్ని క్షణాలకుకాని మళ్ళీ మామూలు మనిషి కాలేదు.

కూలిపోవాలి. కాలిపోవాలి.

అవును. దైవంలాంటివాడికి కుళ్ళిన పండులాంటి తనను ఎలా అర్పిస్తుంది? తన వృత్తాంతమంతా పాణికి చెప్పెయ్యాలి. కాని, చెప్పేస్తే తనవాడనుకున్న ఒక్కడూ చేయిజారిపోతాడు. ఎందుకు జారిపోతాడు? తనకు కావలసింది ప్రేమ. శారీరకమైన వాంఛల్తో తనకు నిమిత్తంలేదు. అతడు తనను ప్రేమించలేదా?

ఎలా?

అన్నలా!

అన్నలా!

అవును, అతను తనను అన్నలా ప్రేమిస్తాడు. అన్న చెల్లెల్ని ప్రేమించడంలేదూ? తన నెందుకు ప్రేమించడు? మంజరి తల్లి దొరసాని. తన తల్లి దాసిది. అందుకు.

తనను అన్నలా ప్రేమిస్తాడా? ఎందుకు ప్రేమించడు? ప్రేమిస్తాడు. తానంటే ఎంత దయ అతనికి! ప్రేమించకుంటే? ప్రేమించకున్నా పూజిస్తుందతన్ని దేవునిలా. దేవుడు అందర్నీ ప్రేమిస్తున్నాడా? అయినా, అందరూ దేవుణ్ణి పూజించటంలేదూ? పాణినుండి తండ్రివంటి, అన్న, దేవునివంటి ప్రేమను సంపాదించాలనుకుంది. కోర్కెల్ని బలిచేయాలనుకుంది.

నిన్నటి రాతిమనిషి నేడు దేవత అయిపోయింది.

అలా అనుకునేసరికి ఆవిడ మనస్సు తేలికయింది. అంధకారం పటాపంచలై వెన్నెల విరిసింది. ఆమె ఆనందంలో తబ్బిబ్బయింది.

"పాణి నాకు అన్న" అనుకుంది. "అన్నా" అని అతణ్ణి కౌగిలించుకోవాలనుకుంది. ఆ ఊహ ఆమెను ఆనందసాగరంలో ఓలలాడించింది.

ఉరికంబాన్నెక్కే దేశభక్తునిలా ఆవిడ హృదయం గర్వంతో పొంగిపోయింది.

త్యాగంలో ఉన్న ఆనందం మరి దేనిలోనూ లేదేమో!

బొడ్డుమల్లె చెట్టుకింద రాలిన పూలలో కూర్చుని పూలనూ, వాటి కాడల్నూ, వాటి నిర్మాణ వైచిత్రినీ పరిశీలిస్తున్న పాణి "అన్నయ్యా" అనే పిలుపువిని అటుపక్క చూశాడు. ఒళ్ళు జలదరించింది.

వనజ పూలబుట్ట పట్టుకొని నుంచుంది.

"నన్నా వనజా" ఆశ్చర్యంగా అడిగాడు.

"అవునన్నయ్యా!" మళ్ళీ అదే మాట.

పైట చెరగు నోట్లో పెట్టుకొని పరిగెత్తిన్నాటినుంచీ ఏదోమార్పు కనిపిస్తూంది వనజలో. అది ఈ నాటికిలా పరిణమించిందనుకున్నాడు పాణి.

"వనజా!"

పూలు చేత్తో పట్టుకొనే తలెత్తి చూసింది.

"నేనంటే ప్రేమలేదా?"

తలూపింది ఉన్నట్లుగా.

వనజ కళ్ళల్లో నీరు నిలిచింది.

"నేను నీకు తగినదానినికాను. నువ్వు దేవుడివి. బండవంటి నన్ను మనిషిని చేసినవు. గొడ్డువంటిదాన్కి ప్రేమ చూపినవు. నువ్వే నాకు అన్నవు, దేవుడివి, తండ్రివి. అటువంటి నీకు మచ్చపడ్డ నా మనసెట్టిద్దును? నా పుటక దరిద్రపుది. నా బతుకు దరిద్రంది.

"లగ్గమై నెన్క పెన్మిటితోని అత్తోరింటికి పోతాంది మా అవ్వ గీ ఊరునుంచి. దొరోరు గడీ ముంగల కూకొనుంటే ఆడోల్లు ముంగల్నుంచి పోగూడదు. మా అమ్మ పెన్మిటి కెరికెలేక దొర ముంగల్నుంచే ఎల్లి పోయిండు. మా అవ్వ ఆడనే నిలబడ్డది. దొర చూసిండు. మాదార్సాబు నడిగిండు ఎవరని? తెమ్మంటరా అంటడిగిండు మదార్‌సాబ్. దొర లేచి గడీల కొచ్చిండు. పెళ్ళాం వస్తలేదని పెన్మిటి చూసిండు. మా అవ్వకాడికి

పోయిండు. ఇద్దరు కల్సి ఊరిబైటికెళ్లిన్రు. మదార్సాబు ఉరికిండు. పిలిచిండు. దొర పిలుస్తాండు అన్నడు. పెళ్ళం నుండమంటని పెన్మిటి బైలెల్లిండు. 'దొర దాన్నీ పిలుస్తాండు' అన్నడు మదార్సాబు. 'అడమనిషితో నేం పనుంది. నేనొస్తగద' అన్నడు పెన్మిటి. మదార్సాబు నవ్విండు. 'మొగాల్లతో నేంపనిర దొరకు. ఆడోల్లతోటే పని' అన్నడు. మా అవ్వ చెప్పబట్కే ఎరికైంది. దాని పానాలు పైపైన పోయినట్లయిందంటిది. పెన్మిటి మదార్సాబు కాళ్ళమీద పడ్డడు. 'రచ్చించురి, కొత్త పెళ్లం' అంటని బతిమలాడిండు. 'ఎట్ల పోనిస్తన్రా? దొరకంట్ల పడ్డనక పోతాది ఆడది' అని నవ్వమంటిని ఉరిమిండు మదార్సాబు. అవ్వ ఉరుకు పుచ్చుకున్నది. మదార్సాబు ఉరికిండు, పట్టుకున్నడు. గుంజుకొచ్చిండు. పెన్మిటికూడ వచ్చిండు దొర కాళ్ళమీద పడ్దామని. 'ఈడెందుకొచ్చిండురా. గుంజి పారేయండి' అన్నాడు దొర. పాటక్ల[242] నిలబడి ఏడ్చి ఏడ్చి పోయిండు పెన్మిటి. అవ్వను గుంజ్కపోయిన్రు... మా అవ్వ గడీల్నే ఆడబాపయ్యింది. ఈ దొరే మా అయ్య.

"చిందొర్సాని కండ్లకి నా కండ్లకు పోలికలున్నయన్నరు. అప్పుడు గిదంత యాదికొచ్చింది. ఏడుపొచ్చింది. గిదంత చెపితే నువ్వు నన్నేమనుకుంటవోనని ఉరికిపోయిన" అని కన్నీరు రాల్చింది. పయిటతో కండ్లు తుడుచుకుంది.

స్థాణువులా వింటున్నాడు పాణి.

"ఈ గడీల్నె పెరిగిన. పెద్దదానైన. దొరసాని తమ్ముడు ఇంద్రరెడ్డి కన్నెచెర ఇడిపించిండు. ఆటెనక ఎందరు రెడ్డోరొచ్చిన్రో అందరి అర్రలకి[243] పోయిన. ఎంతమందికాడికి పోయిననో అన్ని మచ్చలున్నాయి మనసు మీద. మువ్వొచ్చినంక మనిసినని ఎరికైంది. పెన్మిటి ఉండాలనుకున్న. నీమీద మనసైంది. నువ్వు గూడ దయ చూపినవు. నువ్వు నన్ను ప్రేమిస్తాన్నవనుకున్న. అట్లనే తాయారుతానికి పోవద్దన్న, నువ్వు పట్నం పోతే నిద్రపోలేదనుకో! కండ్ల పోలికల్చెప్పిన దినంనుంచి నా కథ తెలుస్తదని నీ కండ్ల బడకుండ తిరిగిన. బాగ ఇశారించిన. దేవునసువంటి నీకు మచ్చపడిన మనసు ఇయ్యొద్దనుకున్న. నీ ప్రేమ లేకుండా బతకలేననుకున్న. నీకు చెల్లెల్నైదమనుకున్న. అన్నా అని కావలించుకోవాల్ననుకున్న" అని కన్నీరు జలజలా రాల్చింది.

సారంగపాణి కళ్ళు చెమ్మగిల్లాయి.

'చెల్లీ' అని చేతులు చాచాడు.

"అన్నా!"

మండే సారంగపాణి గుండెలకు ఆ పిలుపు పన్నీరయింది.

"వనజా! నువ్వు మనిషివి కావు, దేవతవు."

'మా అన్న మంచివాడు' అని కన్నీరు రాల్చింది.

పాణి బుజం తడిసింది.

## 13

చుట్ట కాలుస్తూ పరధ్యానంతో పడుకొని ఉన్న రామారెడ్డిగారు మంజరి తన పక్కన నుంచున్నది గూడా గమనించలేదు, ఆమె పిలిచేదాకా. మంజరి మంచం మీద తండ్రిదగ్గర కూర్చొని 'నాయ్నా! వీణ ఎంత మంచిగ మోగుత దనుకున్నవ్' అన్నది.

'నీకు మోగించొస్తదా?' ఆశ్చర్యంగా అడిగారు రెడ్డిగారు.

'పేలు తీగమీద పెడ్తనా, రాగమొస్తది. ఎంత బాగా వస్తదనుకున్నవ్! రా చూపిస్తా' అని తండ్రి చేయి పట్టుకొని వీణ ఉన్న గదిలోకి లాక్కొనిపోయింది. తాను వీణ ముందు కూర్చొని తన ముందు

తంత్రిని కూర్చోమన్నది. ప్రేమతో తీవల్ని కదిలించసాగింది.

'గ్ం గ్ం గ్ం ' అని మోగాయి తీవలు. వాటిల్లో స్వరం లేదు. ఐనా, వచ్చీరానీ పాప పలుకుల్లా హృదయానికదో ఆనందాన్నిస్తున్నాయి. వీణ శాస్త్రబద్ధంగా పలికిస్తే ఎంత ఆనందంగా ఉండాలి అనుకున్నారు రెడ్డిగారు.

కొంతసేపు అలా తంత్రుల్ని మోగించి 'నాయ్నా, వీణ చెప్పించవా?' అనడిగింది మంజరి యాచిస్తున్నట్లు.

'చెప్పిస్తనమ్మా, ఎందుకు చెప్పించను?'

'ఆ, దినాం అట్లనే అంటున్నవు. రేపట్నుంచి నేర్చుకుంట..'

ఎవరికి లొంగని రామారెడ్డికి కూతురు పట్టుబడితే లొంగాల్సి వస్తుందని తెలుసు. 'అట్లనే' అన్నాడు.

'మా నాయ్న మంచివాడు' అంటూ గంతులేస్తూ వెళ్ళిపోయింది మంజరి. తన కూతురు ఇంకా పదేళ్ళ పిల్లేనా అన్నట్లుగా చూచారు రెడ్డిగారు.

పాణిని ఇంట్లో ఉంచుకునేటప్పుడు మంజరికి సంగీతం చెప్పించాలనైతే అనుకోలేదు రామారెడ్డిగారు. కాని అతని సంగీతం రాళ్ళను కరిగించేట్లుంది. ఎదుటివాని గుండె కరిగించాలని ఎవరికుండదు? ఆడవారికి ఆ కోర్కె ఎక్కువ. తరువాత మంజరి అనేకసార్లు అడిగింది. ' రేపు' అంటూ దొర్లించేస్తున్నాడు తను. అది గోడమీద రేపని తనకు మాత్రమే తెలుసు కాని, మంజరి ఇప్పుడు గట్టిగా పట్టుపడుతూంది. మంజరి తనకు ఒక్కగానొక్క కూతురు. ఆమె కోరితే గగన కుసుమాన్నయినా తెచ్చియ్యాలి. ప్రస్తుతం ఆమె కోరింది గగనకుసుమమూ కాదు, కుందేటికొమ్మూ కాదు - సంగీతం నేర్చుకోవడం. ఆ కాస్త కోర్కె తీర్చలేడా తాను? కాని,... ఇంతవరకు ఒక్క యువకుని ముఖం సైతం చూడని మంజరి పాణి ముందు కూర్చుని సంగీతం నేర్చుకోవాలి. పాణి అతని మనోఫలకం మీద వెలిశాడు. అతడు అందమయినవాడు. యువకుడు. చురుకయినవాడు. స్త్రీ హృదయం వెన్నలాంటిది. మనసు చంచలమయినది. యౌవనం సహనం లేనిది. ఇంకేవేవో ఇలాంటి ఆలోచనలే వచ్చాయి. బుర్ర వేడెక్కింది. ఇంక ఆలోచించలేకపోయారు. సారంగపాణి గదికి బయలుదేరారు.

సంగీతం అతనికి టానిక్కులా పనిచేస్తూంది. బుద్ధిని చురుకుపరుస్తూంది. లోకాన్ని మరిపించి, మనసును మురిపిస్తూంది.

'పంతులూ! ఇయ్యాళ కొత్త సంగీతం వినిపించాలి' అంటూ గదిలో అడుగుపెట్టారు.

మంచం మీద కూచుని ఫిడేలును శ్రుతి పెడుతున్న పాణి కొంచెం తబ్బిబ్బై లేచి నుంచొని నమస్కరించి ' వీణ వాయించమంటారా?' అన్నాడు...

"వీణా!" అని అడిగారు రెడ్డిగారు. వీణను గురించిన ఆలోచన తన కెందుకు రాలేదో అర్థం కాలేదు. ఇన్ని రోజుల్నుంచి ఇంట్లో పడివుంటే ఎందుకు వినాలనిపించలేదు తనకు? వీణ ఎలా పలుకుతుందో? ఎంత రసం కనిపిస్తూందో చూడాలనుకున్నారు.

'అవును' సారంగపాణి జవాబు.

'సరే... వాయించు.'

ఎంకటి వీణ తెచ్చాడు. పాణి శృతిపెట్టి ఆలపించసాగాడు. 'గ్ం గ్ం గ్ం' అంటూంటే హృదయం వీణ మీటినట్లయింది రెడ్డిగారికి. అమృతం కురుస్తున్నట్టూ వెన్నెల విరుస్తున్నట్టూ అనిపించింది.

సంగీత జ్ఞానమూ, భక్తివినా, సన్మార్గము కలదే ఓ మనసా

భృంగి, నటేశ, సమీరజ, ఘటజ, మతంగ
నారదాదు లుపాసించే ॥సం॥
న్యాయాన్యాయము తెలుసును
జగములు మాయామయమని తెలుసును.
దుర్గుణ కాయజాది షడ్రిపుల
జయించే కార్యము తెలుసును
త్యాగరాజ నుత ॥సం॥

హృదయ పాత్రలు మెలమెల్లగా అమృతంతో నిండాయి. పాట ముగించేసరికల్లా అడుగు ఊడి అమృతం సాంతం కారిపోయింది.

"ఓహో! శానబాగా పాడినవయ్యా పంతులూ" అన్నారు. పూర్తి ఆనందాన్ని వ్యక్తీకరించడానికి పదాలకై తడుముతున్నారు. దొరకలేదు.

కలగాంచి మేల్కొన్నట్లయింది, పక్క గదిలో కూచుని వింటున్న మంజరి స్థితి.

"వనజా! ఇంకొక పాట పాడ్తే..." అంటూండగానే-

"ఇంకొక్క పాట " అన్నారు రెడ్డిగారు.

మంజరి ప్రాణం లేచివచ్చింది.

కండువాతో ముఖం తుడుచుకొని మళ్ళీ వీణ మీటాడు. "గ్ం గ్ం గ్ం" హృదయాలు ముత్యపు చిప్పల్లా విచ్చుకున్నాయి.

మరి మరి నిన్నే మొరలిడ
నీ మనసున దయరాదు రామా ॥మరి॥
కరి మొర విని సరగున జన నీకు
కారణ మేమి సర్వాంతర్యామి ॥మరి॥
కరుణతో ధ్రువునకు ఎదుట నిల్చిన
కథ నే విన్నానయ్యా ॥రామా॥
సురరిపు తనయునకూ నర మృగమౌ
సూచన లేమయ్యా ॥రామా॥
మరిచియున్న వనచరుని బ్రోచిన
నీ మహిమ తెలుపవయ్యా ॥రామా॥
ధరను వెలయు త్యాగరాజ సన్నుత
తరముగాదు ఇకనే వినవయ్యా ॥రామా॥

హృదయ విహంగాలు రెక్కలు విప్పుకొని అంబర వీధిలో విహరించి, విహరించి మళ్ళీ ఎదలో జేరాయి.

రెడ్డిగారి కళ్ళు చెమ్మగిల్లాయి.

మంజరి ఆనందబాష్పాలు రాల్చింది.

వనజ పొంగిపోయింది.

"ఎంత బాగా పాడినవయ్యా!" అన్నాడు రెడ్డిగారు ఆనందపారవశ్యంతో.

కలదనుకున్నారు?" అన్నాడు.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శద్దా
న్పర్యుత్సుకోభవతి మత్సుఖినోపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం
భావస్థితాణి జననాన్తర సైహృదాణి" అన్నాడు కాళిదాసు."

"అంటే?"

"రమ్యమైన వస్తువుల్ని చూచినప్పుడూ, మధురమైన శబ్దాన్ని విన్నప్పుడూ, సుఖంగా వున్న ఆత్మకూడా గంతులు వేస్తుంది. అతనికి తెలియకుండానే పూర్వజన్మల బాంధవ్యాలూ అనుబంధాలూ స్మరణకు వస్తాయి."

"ఒహో! ఎంత బాగా చెప్పిండయ్య కవి. నిజంగా ఇది నా పూర్వజన్మ పుణ్యమే" అన్నారు రెడ్డిగారు.

"ఇది ఏదో పూర్వజన్మ బంధమే" అనుకుంది మంజరి.

కాకుంటే తానింత ముగ్ధురా లౌతుందా?

"సీతారాముల పునస్సమాగమం సహితం సంగీతంవల్లనే కదండీ అయింది. లవకుశులు తంబురాలు పట్టుకొని శ్రుతిపెట్టుకొని లయ తప్పకుండా "తపస్స్వాధ్యాయ నిరంతరం.." నుండి రామాయణం మొత్తం గానం చేస్తుంటే రామునికి చిత్రపటాల్లా కథంతా కనిపించింది."

"ఎంత తియ్యగ పాడిన్రో?"

"తాన్‌సేన్ అనే మహాగాయకుడు తన పాటతో చెట్లు చిగురింపచేశాడు. దీపాలు వెలిగింపజేశాడు. దీక్షితులవారు అమృతానందవర్షిణీ రాగం పాడి వర్షం కురిపించారు. త్యాగరాజులవారు ఒకసారి రాతిని కరిగించారు. చనిపోయిన ఒకనికి ప్రాణం పోశారు సంగీతంతో."

"ఎట్లెట్లా?"

"ఒక బ్రాహ్మడు తన కుటుంబంతో కలిసి బ్రాహ్మణ పల్లెకు వెళ్ళాడు. ఏ బ్రాహ్మణుడూ ఆశ్రయం ఇవ్వలేదతనికి. రాత్రి అయింది. వర్షం ప్రారంభం అయింది. దేవాలయంలో తలదాచుకుందామని వెళ్ళారు. సింహద్వారపు తలుపు లోపలినుంచి గడియవేసి ఉంది. భార్యా బిడ్డల్ని గుమ్మం ముందు కూచుండ పెట్టి గోడ ఎక్కి లోపలికి దూకాడు గడియతీయడానికి. చీకట్లో కనిపించలేదు. కోనేట్లోపడి చనిపోయాడు. బ్రాహ్మణ స్త్రీ దేవాలయం ముందు కూచుని ఆర్తనాదాలు చేస్తూంది. తిరుపతినుంచి శిష్యసమేతంగా తిరిగివస్తున్న త్యాగరాజస్వామి అక్కడికి వెళ్ళి కథ తెలుసుకున్నారు. వెంటనే తంబూరా అందుకొని " నా జీవధారా!" అనే కృతి పాడారు. బ్రాహ్మడు సజీవుడై లేచి వచ్చాడు."

"అబ్బా ! ఎంత ప్రభావం! ఎంత ప్రభావం! ఆ పాట నీకొస్తదా?"

"వస్తుంది, కాని ఇప్పుడు పాడలేను, మరొకసారి వినిపిస్తా క్షమించండి."

"సరేగాని, ఇంత చదువెప్పుడు నేర్చినవయ్యా?"

"ఏదో మీ దయ."

" ఆ మరచిన. మంజరి వీణ నేరుస్తనని చంపుక తింటున్నది. ఎప్పుడు శురు[244] చేస్తవు?"

" మీ రెప్పుడంటే అప్పుడు."

"జర బాపనాయంతో మంచిరోజు చూపించి ..ఇగో - వీణె చెప్పు. ఫీడేలొద్దు."

మంజరి గుండె ఎగిరి గంతేసింది.

"దసర నుంచి శురు చెయ్యరాదు?"

'చిత్తం.'

'దసరా ఎప్పుడే?' అడిగింది మంజరి.

'అయిదేండ్లు' అన్నది వనజ.

'అదేందే?' మూతి ముడిచింది మంజరి.

'అయిదు దినాలు'

"అట్లను. వనజ మంచిది" అని గట్టిగా కౌగిలించుకొని ముద్దు పెట్టుకుంది మంజరి.

× × ×

పడుకున్నారు కాని నిద్రరాలేదు రామారెడ్డిగారికి. వీణ ఎంత మధురంగా మ్రోగింది? ఇంకా రింగుమంటూనే వుంది తన చెవుల్లో. మంజరి అలా మీటగలదా! మళ్ళీ పూర్వపు ప్రశ్నే అతని ముందు ప్రత్యక్షమయింది. మంజరిమాట తీసివేయలేక సంగీతం ప్రారంభించమనైతే అన్నారు కాని, సారంగపాణి ముందు మంజరి కూచుని వీణ నేర్చుకుంటున్నట్లుగా కల్పించుకున్న ఊహాచిత్రం చూచి భరించలేక పోయారు. పాణి అలాంటివాడా? తిన్న ఇంటి వాసాలు లెక్క పెడ్తాడా? అంత వినయమూ అంత అణుకువా గలవాడు మోసం చేస్తాడా? చేయలేకపోవచ్చు. మంజరి నిండు వయసులో ఉంది. ఆమె మనసు చలించకూడదూ? ఛ, ఏమిటా ఆలోచన? మంజరి ఎక్కడ? పాణి ఎక్కడ? తన అంతస్తెక్కడ? మంజరి అంత నీచానికి దిగుతుందా! ......... మంజరి......... తన కూతురు! పాణి? పాణి అంత నీచానికి దిగుతాడా? అసలు ఎంత ధైర్యం చేయగలడా? హు చేస్తాడా? చేయలేడు. చేస్తే మదార్సాబు......... అలా జరగడానికి వీల్లేదు. జరగదు.

అయినా, జాగ్రత్తపడాలనుకున్నారు. జాగ్రత్తపడాలి. ఏం చేయాలి? ఏంచేయాలి?? ఒకే ప్రశ్న అనేక అమ్ముల రూపం దాల్చి ఆయన మెదడును చీల్చసాగింది.

ఆలోచన.......... ఆలోచన.........ఆలోచన...........

చుట్ట ముట్టించారు, పారేశారు.

ఎన్ని? ఏమో?

మరచిపోయి నిద్ర పోదామనుకున్నారు. ఊహు - నిద్రరాందే?

అమాంతంగా ఒక దృశ్యం గుర్తుకు వచ్చింది.

వనజ, పాణి జంటగా తోటలోంచి వస్తున్నారు.

అమాంతంగా ఒక ఆలోచన స్ఫురించింది.

వనజ అందమైంది. చురుకైంది. తన రక్తం గదా! మంచిపిల్ల. దాన్ని ఆడబాపగా చేసి తప్పుచేశాననుకున్నారు. ఎంతకాలమని ఆలా ఉంటుంది పాపం అది! పాణికిచ్చి పెండ్లిచేస్తే సరి. పాణికి వనజంటే ప్రేమ ఎలాగూ ఉంది. పెళ్ళయ్యేదాకా సంగీతం పాఠం ఆగుతుందా? ఎందుకూ? పెళ్ళి చేస్తాననే విషయం వనజకు చెప్పెయ్యాలి. పాఠం చెప్పుకొనేప్పుడు మంజరితోపాటు వనజనుకూడా ఉండమనాలి.

ఆడది భర్త అనురాగం పంచి యివ్వడానికి ఎన్నటికీ అంగీకరించదు.

మంచి ఆలోచన వచ్చిందనుకున్నారు.

తన చాకచక్యానికి తానే ఆశ్చర్యపోయారు.

తన చాకచక్యానికి తానే ఆశ్చర్యపోయారు.

సమస్య పరిష్కరించబడ్డంతో నిద్రపట్టింది.

## 14

గంపనిండా తామరపూవులూ, అల్లిపూలూ తెచ్చి దింపా డొకడు. బుట్టనిండా చేమంతి పూలు తెచ్చి పెట్టాడొకడు.

తంగేడు, పైడి తంగేడు, గునుగు, నువ్వు, రుద్రాక్ష, కట్టా గట్లు గొరిమిడి, కాకర, బీర, గన్నేరు, పొట్ల, కట్లాయి, గుమ్మడిపూలు బస్తాలో తెచ్చి గుమ్మరించా డొకడు.

బంకుల్లో కూచున్న పాణి గుండె పూలను చూస్తే పొంగిపోయింది. ఒక తామర పూవును తీసి రెక్కలు విచ్చి చూచాడు. ఎంత చల్లగా ఉంది! వాసన చూచాడు. ఎంత లేత పరిమళం! ఎంత చల్లని పరిమళం! ఇంతలో వనజ వచ్చి, " ఈ ఏడాది దొరోరి బత్కమ్మను చూస్తే ఊళ్ళోళ్ళందరి కండ్లు మండాలే. మొదటివరుస తామరపూలు పెట్టి, రెండోవరస చేమంతి పూలు పెట్టి, ఆటెనక పోకబంతి, తెల్ల గునుగుపూలు పేర్చి, నెత్తిన తామరపూలు పెట్టి పేరిస్తే బాగుంటదంటన్న నేను. గట్ల కాదు. ముంగల తంగేడు పూలు పెట్టి, ఆటెనక తామరపూలు, చామంతిపూలు పేరు పెట్టిస్తనంటాంది చిందొరసాని. ఎట్లయితే బాగుంటుందో చెప్పు" అన్నది. పాణి కాస్త తికమక పడ్డాడు. వనజ చెప్పిన క్రమమే బాగుంది. తంగేడుపూల మీద తామరపూలు నిలవ్వు. కాని, ఆ మాటంటే మంజరి చిన్నబుచ్చుకుంటుందని, నెత్తిన తామరపూలు కాక అల్లీపూలు పెడ్తే బాగుంటుందని చెప్పాడు. చేమంతిపూలతో, పోకబంతిపూలతో మంజరి పేరు వచ్చేట్లు పేర్చమని చెప్పి 'మంజరి' అనే ఇంగ్లీషు అక్షరాలు వ్రాసి యిచ్చాడు. తన పేరుకూడా రాసివ్వమంది, తన బతకమ్మ కోసరం వనజ. పేరు వ్రాసి ఇస్తూండగానే కరణం యింటినుంచి పిలుపొచ్చింది పాణికి.

కరణం ఇంటికివెళ్తే ఇంటి ముందు కరణం లేడు, పచ్చపచ్చగా తంగేడు పూవు పడివుంది, అరుగులమీద. పాలేరువచ్చి తాయారు రమ్మంటూందని పిలిచాడు. లోపలికి వెళ్ళాడు పాణి.

తలంటి పోసుకొని ముస్తాబయి కూచుని ఉంది తాయారు.

"ఎప్పుడొచ్చావు తాయారు?"

"రాత్రి వచ్చిన, పండుగని."

"కరణంగారు రాలేదా?"

"లేదు. కచీర్ల పనులున్నయట. నన్నుగూడుండమన్నడు, నా మనసు ఈడనే ఉన్నది. పోతనంటే కచ్చడం కట్టి తోలిండు."

"ఫిడేలు తెప్పించరాదూ?"

"ఎప్పుడూ సంగీతమే?" విసుగ్గా అంది.

"ఇంకేం పనుంది నాకిక్కడ?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అంతేనంటారా?"

పాణి తాయారు ముఖంలోకి చూచాడు. కళ్ళు తళతళ మెరుస్తూన్నాయి. జవాబు ఏం చెప్పాలో తోచలేదతనికి.

"నే నంటే ఇష్టం లేదా?" తాయారడిగింది సూటిగా ముఖంలోకి చూస్తూ.

సంభాషణ వక్రగతి పడుతూందని గ్రహించాడు పాణి. ఇంట్లో కరణం సైతం లేడు. అంత ఇంట్లోను తాసూ, తాయారేనూ. ఏదో అవాంతరం రానున్నదనుకున్నాడు పాణి.

"అదేం ప్రశ్న తాయారూ?"

"నీకోసమే రెక్కలు కట్టుక వాలిన. చూడు కండ్లెట్ల ఎర్రపడ్డయో నిద్రలేక" అని రెప్పలు చీల్చి చూపింది కళ్ళను.

వాస్తవంగానే ఎర్రగా ఉన్నాయి కళ్ళు. పెద్దగా గూడా కనిపించాయి. చలించాడు క్షణం పాణి. మగవాడు కదా!

"నువ్వంటే నాకెంత మనసనుకున్నవ్? చూడు, గుండె ఎట్లకొట్టుకుంటున్నదో?" పాణి చెయ్యి పట్టుకొని గుండెమీద పెట్టి చూపబోయింది.

పాణి రక్తం విద్యుద్వేగంతో ప్రవహించింది. "ఇచ్చోట భవన్నఖాంకురము సోకె" అన్న వరూధిని గుర్తుకు వచ్చింది. లిప్తలో సంబాళించుకొని చెయ్యిలాక్కున్నాడు. తాయారు తనను ప్రేమిస్తూంది. తమవు అర్పిస్తానంటూంది. అలాంటి తాయారు తన నెందుకు ఆకర్షించడం లేదో అర్థం కాలేదు.

అందని దానికి అర్రులు చాచటం మానవ స్వభావం.

"నేనంటే ఇష్టంలేదా?" మళ్ళీ అదే ప్రశ్న. దుఃఖం గొంతుదాకా వచ్చిందని స్వరం చెపుతూంది. "ఇంట్లో ఎవరూ లేరు" అన్నది.

తప్పుకునే ఉపాయంకోసం తడుముకున్నాడు. చటుక్కుమని స్ఫురించింది.

"కరణంగారేమంటారు?"

"నాన్న కెరికె. నా ఇష్టానికి ఎతిరేకం చెయ్యడు."

ఆశ మొలకెత్తింది తాయారు హృదయంలో.

పాణి ఒళ్ళు మండింది. ఈ నాటకం చాలా కాలంనుంచి జరుగుతుందని గ్రహించాడు. తననేదో ఇరకాటంలో పెట్టడానికి, అడకత్తెరలో ఇరికించడానికి ఇది కరణం పన్నుతున్న ఉచ్చులా కనిపించిందతనికి. "తాయారు! నువ్వెకడ, నేనెక్కడ? నీకూ, నాకూ భూమికి ఆకాశానికి ఉన్నంత అంతరం వుంది."

"మా నాయ్నకు నేదొక్కతెనే బిడ్డను. ఈ ఆస్తి, కరణీకం అంత నీదే అయితది. నాయ్నే చెప్పిండు" అన్నది ఈ తడవ తలవంచి గోళ్ళు చూచుకుంటూ.

"ఆస్తికోసం గడ్డితినమంటావా......" కాస్త కురుకుగానే అడిగాడు. 'కాదు నాకోసరం. చూడు ఎంత వెతపడుతున్నానో' అని ముందుకు జరిగి మీద పడింది, పాణికి ఆలోచించే అవకాశం కూడా ఇవ్వకుండా.

పాణికి అసహ్యం అనిపించింది. వెనక్కుత్రోసి లేచినుంచున్నాడు.

తాయారు అహం దెబ్బతిన్నది. తోకతొక్కిన పాములా "కస్సు"మంది.

"కోరివస్తే తోసేస్తవులే. చూస్త ఈ ఊళ్ళెట్లుంటవో? దాసీదాంతోటెట్ల కులుకుతవో? నువ్వొచ్చి నా కాళ్ళమీద పడేటట్లు చెయ్యకుంటే కరణం బిడ్డనే కాను..." అని జలజల కన్నీరు కారేసింది.

ఉగ్రుడై బాణంలా దూసుకొని వెళ్ళిపోయాడు పాణి.

గడీగేట్లో ప్రవేశించగానే బంకుల్లో ఒంటిగా కూర్చున్న రామిరెడ్డి గారు కనిపించారు. తన రౌద్రం రెడ్డిగారికి కనిపించనీయరాదని రెడ్డిగారిని గమనించనట్లు నటించి మెట్లవైపు సాగిపోయాడు. "పంతులూ" అని పిలిచారు రెడ్డిగారు. ముఖంలో భావం వ్యక్తీకరించకుండేందుకు ప్రయత్నించి అడుగులు లెక్క

పెట్టుకుంటూ వెళ్ళి రెడ్డిగారికి నమస్కరించాడు.

"చూళ్ళేదండీ! క్షమించండి."

"సరే, నేనైతే చూసినగద. ఏంది కత?"

"ఏమీ లేదండీ!" తలవంచుకొని జవాబు చెప్పాడు.

'కరణం ఇంటినుంచే వస్తున్నావా?'

'అవునండీ!' - 'గ్రహించాడా ఏం ! ఘటికుడు ' అన్నట్లుగా ముఖంలోకి చూచాడు.

చిరునవ్వు నవ్వాడు రెడ్డిగారు.

"కరణం వచ్చిండా?"

"రాలేదండీ!"

'కుంటి దొక్కతే ఉన్నదా ఇంట్ల?' ధ్వనిలో కరుకుదనం కనిపించింది.

'అవునండీ!'

'ఎందుకు పోయినవ్, అది ఒంటరిగున్నప్పుడు?' గద్దించినట్లుగా అడిగారు రెడ్డిగారు. కథ అడ్డం తిరిగేట్లుందనుకున్నాడు.

'కరణం పిలిపించాడంటే.......' అణుకువుగా జవాబు చెప్పాడు.

'ఐతే, అదే పిలిపించిందంటవ్? ఏమైందాడ?' ఉరిమారు.

పాణి వెనక్కు తిరిగి చూస్తే ఉత్సాహంగా వింటున్న ఎంకటి కనిపించాడు. వాడుండంమూలాన సంకోచిస్తున్నాడని గ్రహించారు రెడ్డిగారు.

'ఈడేమన్న బోగమోల్లాడ్తానకున్నావా? పో - పనిచూసుకో!' ఉరిమారు రెడ్డిగారు ఎంకటిని ఉద్దేశించి.

ఉత్సాహమంతా చచ్చిపోగా సుమారు ఉరికినట్లు నడిచివెళ్ళాడు ఎంకటి.

'దొరవారూ ! మీరు కూర్చోండి, నన్ను అపార్థం చేసుకోకండి' అన్నాడు బ్రతిమాలాడుతున్నట్లుగా పాణి

'హు! ఆడ ఏమైందో చెప్పు! ఉన్నదున్నట్లు చెప్పాలే. లేకుంటే నెత్తి గొరిగించి, సున్నబ్బొట్లు పెట్టించి, గాడ్దిమీద ఊరేగించి ఎళ్ళగొడ్త ఊళ్ళ నుంచి - ఎరికేనా?' అదీ గర్జనే కాని, స్వరంలో కొంత సౌమ్యత ఏర్పడింది.

'కరణం ఇంటికి వెళ్ళా ......... ' అని జరిగిన సంగతి పొంతం పూసగుచ్చినట్లు చెప్పాడు.

'హు'! ఊళ్ళ ఉండనియ్యదులే! చూస్త. కరణానికి కాలం దగ్గర పడ్డది' అని మీసం మెలేసి, 'రేపటినుంచి పొరానికి పోకు' అంటూ లేచిపోయారు - పంతులు మంచివాడే అని మనసులో అనుకుంటూ.

పిడుగు పడుతుందనుకున్న ఉరుము చినుకుల్తో పోయినందుకు సంతోషించాడు పాణి.

× × ×

మూడు బతకమ్మల్ను పేర్చారు గడీలో. వాటిని నోము గదిలో పీటలపై ఉంచారు. పసుపుకుంకుమల్తో పడతులంతా బతకమ్మను - గౌరమ్మను అర్చించారు. పెసర, గోధుమ, బియ్యము, కొబ్బరి, నువ్వులతో చేయబడిన చద్దులు గౌరమ్మకు నైవేద్యం పెట్టారు మధ్యాహ్నం.

మధ్యాహ్నపు భోజనాలైనాయి.

సాయంకాలం అవుతూంది. ఊరంతా పండుగ రంగులు అద్దుకొంది. కొత్త పరికిణీలు, కొత్త రవికెలు తొడుక్కొని, కురుల్లో పూలు తురుముకున్న బాలికలు, వెదురు లేక దుసేరు తీగల్తో అల్లిన సిబ్బుల్లో

బతకమ్మలు పట్టుకొని నుంచున్నారు. కొత్తబట్టలు కట్టుకొని వీధిలో ఉరికే బాలురు పెట్లుగొట్టాలు కొడుతూ బాలికల్ని సతాయిస్తున్నారు.

బాజావాళ్ళు గడీలో ప్రవేశించారు. రెడ్డిగారికి నమస్కారం చేసి 'సీతమ్మ పెళ్ళికూతురాయెనే' సన్నాయి పాట ప్రారంభించారు. కొత్త బట్టలు కట్టుకొని, కుంకుమబొట్టు పెట్టుకొని, బతకమ్మను నెత్తిన పెట్టుకొని ఎంకటి బయల్దేరాడు. అతని వెనుక మరో ఇద్దరు, మరి రెండు బతకమ్మల్ని నెత్తినెత్తుకొని బయల్దేరారు. వారిని చూచి మేళాలవాళ్ళు బైల్దేరారు. వారి వెనక బతకమ్మలు కదిలాయి. వాద్యగాళ్ళు కరణం ఇంటికి వెళ్ళారు. అక్కడొక బతకమ్మ బైల్దేరింది. అలా ఊరంతా తిరిగి వందల బతకమ్మల్ని తీసుకొని గడీ ముందుకువచ్చి నుంచున్నారు వాద్యగాళ్ళు. తెరలు కట్టిన కచ్చడం బండి బయల్దేరింది ఊరేగింపు వెనక. బండ్ల వెనక మగవారితో పాణి బయల్దేరాడు.

ఊరేగింపు సాగిపోతూంది. ఊరేగింపులోని ఆడవారిలో ఒకావిడ పాట చెపుతూంది ఒక్కొక్క పాదం, మిగతావారు చప్పట్లు కొడుతూ పాడుతున్నారు.

బొడ్డెమ్మ బొడ్డెమ్మ, బిడ్డలెందారే
బావిల పడ్డావారికి బారిద్దరమ్మా
చెర్లా బడ్డావారికి చేరిద్దరమ్మా
కుంట్ల బడ్డావారికి కూరిద్దరమ్మా
నిద్రపో బొడ్డెమ్మ నిద్రపోవమ్మా
నిద్రకూ నూరేండ్లు నీకు వెయ్యేండ్లు.

ఊరేగింపు ఏటి దగ్గరకు చేరగానే వాద్యగాళ్ళు ఒక పక్కకు దిగి మ్రోగించసాగారు. గుంపులు గుంపులుగా విడిపోయాయి బతకమ్మలు. అనేకచోట్ల గుంపులు గూడారు మగువలు. రెడ్డిగారి బతకమ్మలు ఏటిపైకి కొంతదూరం వెళ్ళాయి. అక్కడ ఇసుకలో వాటిని దింపారు.

కరణం బతకమ్మ సహితంగా నాలుగు బతకమ్మల్ని ఒకచోట పెట్టి వాటి చుట్టూ తిరుగుతూ పాటలు పాడసాగారు గడీ బృందం. మగవారితో దూరంగా నుంచుకొని వింటున్నాడు పాణి. మసక చీకటి పడ్తుంది. ముఖాలు కనిపించడంలేదు. కంఠం మాత్రం వినిపిస్తూంది. మంజరి చెపుతోంది. మిగతావారు చదువుతున్నారు.

శ్రీలక్ష్మి నీ మహిమలూ గౌరమ్మ - చిత్రమై తోచునమ్మా
భారతీ సతివయ్యు, బ్రహ్మ కిల్లాలివై పార్వతీదేవివై
పరమేశురాణివై
పరగ శ్రీలక్ష్మివయ్యూ, గౌరమ్మ-భార్యవైతివి హరికినీ
ముక్కోటి దేవతలు, చక్కనీ కాంతలు, మక్కువగా నినుగూర్చి
పెక్కు నోములు నోచి ఎక్కువ వారైరిగా - గౌరమ్మ ఇహలోకముల యందునా......

అలా ఎన్నో పాటలు పాడారు. కోలాటాలు వేశారు. వాయినాలు ఇచ్చుకున్నారు. ఆకాశంలో మబ్బుతెరలు చేరాయి. వెన్నెల మాయం కాసాగింది. క్షణంలో కారుమబ్బులు కమ్మాయి. తొందరపడి నైవేద్యం పెడ్తూ ఉండగానే చిటపటచినుకులు ప్రారంభమైనాయి. వందల బతకమ్మలు ఏట్లో తేలిపోసాగాయి. రెడ్డిగారి బతకమ్మల్ని నీళ్ళలో వాలారించేటప్పుడు వాన జోరున కురిసింది. మగవాళ్ళలో కొందరు ఊళ్ళోకి పరిగెత్తారు. కొందరు అక్కడవున్న చెట్లక్రింద చేరారు. పాణి ఏటి ఒడ్డున మర్రిచెట్టు క్రిందికి చేరాడు.

బతకమ్మను వాలాడించేసరికి తడిసిపోయారు పూర్తిగా మంజరీ. వనజలు. మర్రి క్రింద తప్ప ఎక్కడా స్థలం కనిపించలేదు. పరుగెత్తి మర్రి క్రిందికి వచ్చి, అక్కడున్న పాణిని చూచి వెనక్కు తగ్గింది మంజరి. వెనక పరుగెత్తుకొచ్చిన వనజ 'పంతులు - భయంలేదు' అని చేయిపట్టుకొని మర్రిచెట్టు మొదటికి తీసికెళ్ళింది. ఇద్దరూ పైట చెరుగుల్తో ముఖాలు తుడుచుకున్నారు.

పాణి గుండెలో మెరిసింది ఆకాశంలోని మెరుపు, బట్టలు పూర్తిగా తడిసి ఒంటికి అంటుకొని పోయినాయి మంజరికీ వనజకూ. కాని అతని దృష్టి మంజరి మీదనే పడింది. నెత్తినుంచి ఇంకా నీరు కారుతూనే ఉంది. ఎడమ భుజం మీద కుడిచేయి, కుడి భుజం మీద ఎడమచేయి వేసుకొని ఉరమును దాచుకుంటూంది.

ఉరుము వినిగాని ఈ లోకంలోకి రాలేదు పాణి.

"వనజా ! ఇదిగో కండువా, మంజరి తల తుడిచి వంటిమీద కప్పు! చూడు ఎలా వణుకుతోందో పాపం!'

'అవు, నేనుగూడ మరిచిన' అని కండువా అందుకొని మంజరి వారిస్తున్నా వినకుండా తల తుడిచి, భుజాలమీద కప్పింది. చలి కొద్దిగా తగ్గింది. కండువా ఒక చేత్తో పట్టుకొని నదిలోకి పోతున్న పిల్లకాలువల్ని చూస్తుంది మంజరి.

పాణి ఒక్క అడుగు ముందుకు వేసి, "మంజరీ! చాలా బాగా పాడావు" అన్నాడు.

"ఇంక బాగ పాడ్తది" అన్నది వనజ.

"మంజరీ! నీది నిజంగా కోకిల కంఠం, సంగీతం నేర్చుకుంటే రాళ్ళను కరిగించగలవు."

మంజరి మాట్లాడదల్చుకోలేదు. చిరునవ్వుమాత్రం ఆపలేకపోయింది.

మెరుపు మెరిసింది.

మంజరి తలెత్తి చూచింది.

కంటిరెప్పల వెంట్రుకలపై అక్కడక్కడా ఉన్న నీటి బిందువులు ముళ్ల చివరనున్న తుహిన బిందువుల్లా ఉన్నాయి.

మంజరి కళ్ళు తళుక్కుమన్నాయి.

పాణి చూపు తాకడంతో తల వంచుకుంది.

"కాన్తే దృష్టి పథంగతే, నయనోరాసీద్వికాసో మహన్."

మంజరికి తిండి సహించలేదు. నిద్ర రాలేదు. కన్ను మూసినా, తెరిచినా పాణి రూపం ప్రత్యక్షం అవుతూంది. ఉంగరాల క్రాఫు, విశాలమైన నుదురు, పెద్దకళ్ళు, కొనదేరిన ముక్కు, కోలముఖం, పొడవైన మెడ, విశాలమైన వక్షం, బలమైన బాహువులు, కళ్ళల్లో ఏదో తేజస్సు, ఆకర్షణ ఆమెను వదలడం లేదు.

మర్రిచెట్టు

జోరున వర్షం

తాను, పాణి.......

అదొక చెరగని చిత్రంగా తయారైంది ఆమె మనోఫలకం మీద. పాణి క్రాఫు తల్చుకుంది, తన జుట్టు చూచుకుంది. రెండూ ఒకేరకంగా ఉన్నాయి. కళ్ళు ఎంత పెద్దగా ఉన్నాయి! మళ్ళీ తన కళ్ళతో పోల్చుకుంది. ఏవో పోలికలున్న జాడలు కనిపించాయి. ఏమిటో పోలికలు? ఎందుకలా ఉన్నాయి? అతని పాట - ఆ మాటే ఆమె గుండెను జలదరింప చేసింది. ఎంత తీయగా పాడగలడు, ఎంత విజ్ఞానం ఉందతని

దగ్గర, ఎన్ని విషయాల గురించి మాట్లాడ్తాడాయన, జన్మాంతర సౌహృదాలు, పూర్వజన్మలోని స్నేహం ఏదో ఉండాలి.

ఏమిటో బాధ? ఎన్నడూ ఎరుగని వ్యధ! బాధలోనే ఏదో తీయదనం! ఏమిటిది?

'...... నీ కుటిలాలక లాలితాస్యమిచ్చావిధి జూడకున్న నిముషంబులు మాకు యుగంబులై చనున్.'

గోపికలు కృష్ణుణ్ణి చూడకుండా ఉండలేనట్లు తాను పాణిని చూడకుండా ఉండలేనట్లుంది. ఒక్క చూపులో, ఒక్క క్షణంలో యింతమార్పా?

వనజను చూస్తే ఆదమరిచి నిద్రపోతూంది.

వనజ పాణిని చూడలేదా? అంత హాయిగా ఎలా నిద్రిస్తూంది? తానూ నిద్రపోవడానికి ప్రయత్నించింది. కళ్ళు మూసుకుంది.

మర్రిచెట్టు

జోరున వాన

తాను, పాణి......

మెరుపు మెరిసింది. ఉరుము విని కళ్ళు తెరిచింది, పుండులో ఉప్పు కూరినట్లయింది. ఏం చేయాలి తాను? ఎలా?

'అక్కట బంధులున్ మగలు నన్నలు దమ్ములు బుత్త్రకాదులన్ నెక్కొని రాత్రి బోకుడన నీ మృదు గీతరవంబు వీనులన్ వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహము నొంది నాథ!'

పాణి దగ్గర లేకుంటే ఈ బాధకు అంతం లేదు. వనజను చూసింది. హాయిగా నిద్రపోతూంది. లేపుదామనుకుంది. దగ్గరికి వెళ్ళింది. కదిలించింది. లేవలేదు. గాఢనిద్ర, నిశ్చింతగా నిద్రపోతూంది. బాధలేని గుండెవుంటే నిద్ర కేంకరువు? మరొకసారి కదిలించింది. లేవలేదు. వనజ లేస్తే మాత్రం? ఏమని చెపుతుంది తాను? ఇది పరులకు చెప్పేబాధా? ఒకరు పంచుకోగలిగే బాధా? తనలోతానే కుమిలి చావాల్సిన బాధ. ఈ బాధంతటికీ కారణం పాణి. అతన్ని చూసింది. ఛ, అతనిదేం తప్పు? తనను బాధపడమన్నాడా అతడు? తాను పడాలనుకుందా? లేదే! తనకు తెలియకుండానే ఒక బాధ తన గుండెలో గూడు కట్టుకుంది ఎందుకో తనకు తెలియదు. ఆ వానలో, ఆ మర్రిచెట్టు క్రింద పాణిని తాను చూడాలనుకుందా? ఆ ఘటన ఏమిటో?

అది ఎవరికీ తెలీదు.

ఇప్పుడు తానేం చెయ్యాలి? వెళ్ళాలి సారంగపాణి దగ్గరకు, చప్పుడు కాకుండా తలుపు తీసింది. పుచ్చ పూవులా ఉంది వెన్నెల. ఇంతరాత్రి పాణి దగ్గరికి ఒంటరిగా వెళ్లడమే? ఒళ్ళు జల్లుమంది. తండ్రి-తల్లి, వారేమంటారు? వనజ లేచి చూస్తే? వెనక్కు వెళ్ళి చూస్తే వనజ నిద్రపోతూంది. తాను వెళ్ళినా పాణి ఏమంటాడు? తాను ఆడది! అందులో దొరబిడ్డ! అర్ధరాత్రి, ఒంటిగా అతని దగ్గరికి వెళ్ళడమా? వీలులేదు, తలుపు మెల్లగా వేసింది! పడకపై చేరింది! కళ్ళు మూసుకుంది.

మర్రిచెట్టు

జోరున వాన

తాను, పాణి

ఎందుకిలా బాధ పెడ్తారు? సగం గుండె కోసుకొని వెళ్ళిపోయాడు.

వనజ కదిలిన అలికిడైంది. చూస్తే వనజ లేచింది. మంజరి గట్టిగా కళ్ళు మూసుకుంది. వనజ

తలుపు తెరుచుకొని బయటికి వెళ్ళింది.

వనజ పాణి దగ్గరకు వెళుతుందా? తాను సంపాదించిన ధనం దొంగిలించడానికే వెళ్ళే దొంగను చూసి నిస్సహాయస్థితిలో ఉండి దుఃఖించినవానిలా బాధపడింది.

నిముషం తరువాత వనజ వచ్చి పడుకుంది.

-తానెంత నీచురాలు? వనజ పాణి దగ్గరకు వెళుతూందనుకున్నది. పాణి తనను ప్రేమిస్తాడా? వనజను ప్రేమించాడేమో! ఆ ఊహ ఆమెకు నరకయాతన కల్పించింది. వనజ తన గదిలో పడుకోని రోజంతా మేధస్సుకు అందినంతవరకూ గతాన్ని చూచింది. లేదు, వనజ చరిత్ర పాణికి తెలియదా? దాసీదాన్ని ప్రేమిస్తాడా పాణిలాంటివాడు? ఏమో! ఉహు వీలులేదు.

అలా అనుకునేసరికి అతని గానం అమె చెవులలో రింగుమంది. పాణి చిరునవ్వు నవ్వుతూ చేతులు చాచి తనను రమ్మన్నట్లనిపించింది. తాను రెక్కలు కట్టుకొని ఆ ఊహా ప్రపంచంలోకి వెళ్ళగలుగుతే ఎంత బావుండును? అతని వక్షస్థలంపై తల ఉంచగలుగుతే!

ఆమె ఒళ్ళు జలదరించింది.

నిద్రపోలేదు.

తెల్లవారింది.

## 15

**ఒం**టికి నూనె రాస్తుంటే కనిపించింది వనజకు పాణి బుజాన వెడల్పుగా వున్న నల్లని పుట్టుమచ్చ.

"ఇదేమిటి" అడిగింది వనజ.

"పుట్టుమచ్చ. చిన్నప్పుడు చిన్నగానే ఉండింది, నేను పెరుగుతుంటే అదీ పెరిగి పెద్దదై ఇంతైంది."

అన్నకు నూనె రాసింది. పన్నీరు కలిసిన పిండితో నలుగు పెట్టింది. అటూ, ఇటూ చూచి ఎవరూ లేరనే విషయం ధ్రువపర్చుకొని "అన్నయ్యా! ఒక్కమాట" అన్నది.

"ఏమిటో?"

'దొర ఏమన్నడో ఎరికేనా?'

'ఏమన్నడు?'

'నన్నిచ్చి నీకు పెళ్ళి చేస్తడంట.'

చల్లని మంచినీరు నెత్తిమీద నుంచి గుమ్మరించి నట్టనిపించింది పాణికి.

'నువ్వేమన్నావు చెల్లాయి?' చివరి పదాన్ని ఒత్తిపలుకుతూ అడిగాడు.

'ఏమనలే.'

'ఏం? ఎందుకనలేదూ, అతడు నా అన్నయ్యని!' బాణం వదిలినట్లు వచ్చాయి మాటలు.

ఆశ్చర్యంగా అన్న ముఖంలోకి చూచింది వనజ. పాణి ముఖంలోని ఎరుపుదనం అప్పుడప్పుడు దిగిపోతూంది.

'అనలే.'

'ఎందుకు?' ప్రశ్నలో అధికారం కనిపించింది. కోపం వ్యక్తమైనది.

వనజ కళ్ళు చెమ్మగిల్లాయి. 'ఆడబాపగనే బతకాల్నొస్తదని!' అణుకువగా జవాబు చెప్పింది.

పాణి గ్రహించాడు. వనజలో వచ్చిన మార్పుకు ఆశ్చర్యపోయాడు. ఎంతదూరం ఆలోచించింది!

పెళ్ళి చేసుకోనంటే వేశ్యగా జీవించాల్సి వస్తుంది. చేసుకుంటానంటే ఆ జీవితం నేటితో అంతమైనట్లే! నిజమే కాని, మంజరి ఏమనుకుంటుంది? ముందు ప్రేమించిన వనజ చెల్లెలైంది. ఇప్పుడు నలుగురికీ చూడ్డానికి కాబోయే భార్య అవుతుంది. ఈ విషయం తెలుస్తే మంజరి తనను మనిషనుకుంటుందా? చెప్పేస్తే తాను పెళ్ళి చేసుకోనని! చెల్లెల్ను వేశ్యను చేయాల్సివస్తుంది. వనజ మళ్ళీ వేశ్య కారాదు. ఆమె పవిత్రమైన జీవితం గడపాలి అనుకున్నాడు.

'వనజ! ఎంత ఆలోచించావ్?'

"అంతా అన్నదయే. మనం అన్నా, చెల్లెళ్ళమని ఎవ్వరికి ఎరిక కాకూడదు."

పిడుగు పడ్డది పాణిమీద. స్తిమితపడి స్థిరస్వరంతో, " మంచిది, అలాగే" అన్నాడు.

స్నానం చేసి గదికి వచ్చేసరికి రామారెడ్డిగారు కొత్త "రాజ్‌కుమార్" ధోవతులు పంపించారు. అవి కట్టుకొని క్రిందికి వెళ్తే బ్రాహ్మణుడొచ్చి పూజ ప్రారంభించాడు. రామారెడ్డిగారు. ఇందిరమ్మ పీటలమీద కూర్చున్నారు. బ్రాహ్మడు మంత్రాలుచదివి " చిందొరసాన్ని పిలవాలె" అన్నాడు. ఎంకటి మంజరిని తీసుకొని వచ్చాడు. తలంటి పోసుకుంది. పండుగ ముస్తాబయి ఉంది.

గడపలో అడుగు పెడ్తూనే మంజరి పాణిని చూచింది.

పాణి మంజరిని చూచాడు.

ఇద్దరి చూపులు రాచుకున్నాయి. మల్లెలు రాలేయి. పూజ జరుగుతున్నంతసేపూ మంజరి పాణిని చూసింది. ఎప్పుడు చూచినా పాణి తనను చూస్తున్నట్లే అనిపించిందామెకు. పూజ పూర్తికాగా వీణమీద సరళి వరుసలు ప్రారంభించాడు పాణి.

ప్రసాదం అందుకుంటూ " పంతులూ ! చావిడికాడ నీకోసం ఇంతజార్[245] చేస్తాంటరు, పోదం నడువు" అన్నారు రెడ్డిగారు.

బియ్యం వగైరాలు మూటకట్టుకొని బుజాన వేసుకొని పరిగెత్తాడు బాపడు.

రెడ్డిగారూ, పాణి వీధిన బయల్దేరారు చావడికి.

"పంతులూ! ఇయాల్టినుంచి మాతోనే తిను. నీ ముంగల గోషా ఎవరికున్నది గనుక అఱ్రల తింటవ్?"

"చిత్తం."

"గడీని నీ ఇల్లనుకోవాలె."

"చిత్తం. ఇంటికంటే సుఖంగా ఉన్నానండీ!"

"మంజరి నీ చెల్లెలనుకో"

ఒళ్ళు జల్లుమంది. ఎన్నో ఆలోచనలు భ్రమించాయి. తన తడబాటు మించి, గొంతులో సైతం దాన్ని వ్యక్తం కానివ్వకుండా 'చిత్తం' అన్నాడు.

"దొరసాన్ని తల్లనుకో. ఆమె నిన్ను కొడుకోలే చూసుకుంటది."

ఈలోగా చావిడి వచ్చేసింది. "దొరొచ్చిండు. దొరొచ్చిండు" అని అంతా లేచి వినయంగా నమస్కరించారు, తలగుడ్డలు తీసి.

రెడ్డిగారు అందర్నీ ఒక్కసారి కలయజూచి "కరణం రాలే" అనడిగారు.

ఒకడు పరిగెత్తాడు. తిరిగివచ్చి "కరణం దొరకు సుస్తీగున్నదన్నడుండి" అని చెప్పాడు. ఇందుక్కారణం వేరే ఏదో ఉందని గ్రహించిన రెడ్డిగారు "గడీకి పోయేటప్పుడు దొరొస్తనన్నడని చెప్పు"

అని పంపించారు వాణ్ణి మళ్ళీ.

చావిడిలో కత్తులూ, తుపాకులూ పెట్టారు. వాటికి కంకణాలు కట్టారు. రెడ్డిగారికి కంకణం కట్టి పూజ చేయించాడు బాపడు. ఆయుధపూజ ముగిసింది. ఊరిపెద్ద "ముత్రాస" మేకను పట్టుకొనివచ్చాడు. చాకలి ఒక గడ్డినిండిన గంప తెచ్చాడు. ఆ గంపలో మేకను పండుకోబెట్టారు. ఇద్దరు దాని తల, ఇద్దరూ కాళ్ళూ పట్టుకున్నారు. రెడ్డిగారు కరవాలం పుచ్చుకొని యెత్తి "జై మహాకాళికి" అన్నారు. జనమంతా "జై" అన్నారు. ఒక్కవేటుకు మేక మెడ తెగడమూ, తుపాకులు పేలటమూ ఒకేసారి జరిగాయి.

రెడ్డిగారు బైల్దేరారు. వారివెంట పాణి బైల్దేరాడు. కరణం ఇల్లు కనిపించగానే "నడువు, నేనొస్త" అని సారంగపాణితో చెప్పి కరణాన్ని పిలిచారు రెడ్డిగారు. కరణం వచ్చి రెడ్డిగార్ని లోపలికి తీసికెళ్ళి కూర్చోబెట్టారు.

"ఒళ్ళు మంచిగ లేదన్నరట?"

"ఏదో జర సుస్తీగున్నది."

"పూజకు రాలే?"

"నేను లేకుంటే ఎళ్ళకపాతదా?"

"అదేంది. గట్లెందుకంటరు?"

"లేకుంటే ఏంది? గా సంగీతపోణ్ణి ఎంటేసుక తిరుగుతారు. వానికేమన్న కులమా? వాడుంటే నేనెట్లొస్త ననుకున్నరు?"

"అట్లంటరెందుకు? పంతులు బ్రాహ్మడే కద!"

'బావనోడైతే రెడ్డోళ్ళింట్ల తింటాడు?' అందామనుకున్నాడు. కాని రెడ్డిగార్ని కించపర్చినట్లవుతుందని "బాపనోడైతే గిట్లెందుకు చేస్తడు!" అన్నాడు

" ఏం చేసిండేం!"

" ఎట్ల చెప్పేటిది? తిడ్దామంటే అక్కబిడ్డ, కొడ్దామంటే యాకటి మనిషి అన్నట్లున్నది. ఎవరిమీద చెప్పుదు? పంతుల్నంటే దొరకు కోపమొస్తది. బయట పెట్టుకుంటే బిడ్డ పరువు పోతుంది."

" ఏం చేసిండో చెప్పరాదు?"

" ఏమని చెప్పాలే. ఎట్లని చెప్పాలే, నేను లేనప్పుడొచ్చిండట. తాయార్ను గుంజిండంట. అది రానంటే దొరతో చెప్పి ఊళ్ళనుంచి ఎళ్ళగొట్టిపిస్తనన్నడట."

రెడ్డిగారి ఒళ్ళు మడింది. తన కూతురు శపథం నెగ్గించడానికి చేస్తున్న పథకం అని గ్రహించారు.

"అచ్చా, వస్త." అని బైల్దేరారు.

కరణానికి ఒళ్ళు మడింది. పంతులలా చేశాడని చెపితే మాట్లాడకుండ లేచిపోతాడు! సరే. చేతిలోకి రాకపోతాడా అనుకున్నాడు. మీసం మీద చెయ్యి వేశాడు. అది చేతికి తగలకుంటే గుర్తుకువచ్చింది, బస్తీలో మీసం గొరిగించాడనే విషయం.

సురసురమంటూ గడీలోకి చేరారు దొరవారు. గజ్జెల బల్లెం గల్లు గల్లు మనిపించుకొంటూ వచ్చిన టపా బంట్రోతు సలామ్ చేసి ఒక పెద్ద కవరు అందించి వెళ్ళిపోయాడు. కవరు తెరిచి చూస్తే ఎన్లార్జ్ అయిన ఫోటోలున్నాయి. ముఖం చాటంతైంది రెడ్డిగారికి. పాణిని పిలిపించాడు ఉత్సాహంతో. 'పంతులూ! పెద్దగైతే తస్వీర్లు ఎంత బాగున్నై,' అని ఒక్కొక్క ఫోటో చూచారిద్దరూ. తరువాత "మంజరీ!" అని పిలుస్తూ ఫోటోలు పట్టుకొని గదిలోకి కుర్రాడిలా పరిగెత్తారు రెడ్డిగారు, పాణి నిలిచిపోయాడనే విషయం

సహితం గ్రహించకుండా.

మంజరి గదిలో వీణ పట్టుకొని కూచుని ఉంది. తండ్రి పిలుపు విని లేచి వచ్చింది. 'తస్వీర్లొచ్చినయి చూసినవా?' అని అందించాడు. ఒక్కొక్క ఫోటో చూచింది. పాణి చిత్రాన్ని అంత తొందరగా వదల్లేక పోయింది. తండ్రి ఉన్నాడని మార్చి ఇంకోటి చూచింది. 'తస్వీర్లు నేనుంచుకుంట' అన్నది.

'సరే మీ అమ్మకు చూపుతవు కదా!' అని వెళ్ళిపోయారు.

తలుపుమూసి పాణి పటం చూచింది. గుండెమీద పెట్టుకుంది, గుండెలో ఇదివరకే ఒక పటం ఉందనే విషయం మరచిపోయి. తన పటమూ, పాణి పటమూ ఒకచోట పెట్టుకొని చూచింది. జుట్టు ఇద్దరిది ఒకే రకంగా ఉంది! కళ్ళు తనకళ్ళకంటే కొద్దిగా చిన్నగా ఉన్నా ఏదో పోలిక కనిపించింది. వాస్తవంగా ఉందా? తన భ్రమా? మళ్ళీ చూచింది. తల్లితో చెబుదామనుకుంది. ఏమనుకుంటుందో అనుకుంటూ ఉండగానే తలుపు తట్టిన చప్పుడూ, తల్లి పిలుపూ వినవచ్చాయి. తలుపు తెరిచింది-

'తస్వీర్లున్నయట'

తండ్రి తస్వీర్లు తల్లికి చూపమన్నాడు. తాను మరిచేపోయింది. ఫోటోలు అందుకొని మంచంమీద కూచుని చూచింది. 'ఎంత మంచిగ తీసిండు తస్వీర్లు' అని ఒక్కొక్కటే చూడసాగింది. పాణి పటం చూస్తున్నప్పుడు ఇందిరమ్మ కూతురువైపు చూచింది. మళ్ళీ పటం చూచింది. తల్లినడుగుదామనుకుంది మంజరి. కాని, అడగలేదు. పోలికలేమిటో అని సతమతపడింది ఇందిరమ్మ. అయినా, తన భావం వ్యక్తం కానివ్వలేదు కూతురి ముందు, తరవాత రామారెడ్డిగారిని అడిగింది. అతనూ దీక్షగా చూశాడు. "ఉంటయిలే" అన్నాడు దానికాట్టే ప్రాధాన్యం ఇవ్వకుండా.

× × ×

సారంగపాణి ప్రథమ పర్యాయం సహపంక్తిని భోజనం చేస్తున్నాడు రెడ్డిగారితో. రెడ్డిగారి కుడిప్రక్కన పాణి, ఎడమపక్కన ఇందిరమ్మ, ఆమె పక్కన మంజరి కూచున్నారు. వనజ గారెలు వడ్డిస్తుంటే అడిగారు రెడ్డిగారు, " వనజకు పెండ్లి చేద్దామనుకుంటున్న, ఏమంటావ్!" అని భార్యను.

పాణి గుండె జల్లుమంది.

వనజ తడబడ్డది.

మంజరి ఆశ్చర్యంగా చూసింది.

"ఎవరికిచ్చి......" ముద్ద నోట్లో ఉండగానే అడిగింది ఇందిరమ్మ.

"పంతులు కిచ్చి" - రెడ్డిగారు జవాబు చెప్పారు.

మంజరి మీద పిడుగు పడ్డది. ఆకలి లేదనే నెపంతో చేయి కడుక్కొని గదిలోకి వెళ్ళి తలుపేసుకుంది. మంచం మీద పడిపోయింది. దుఃఖం పొంగి గండిగొట్టి కళ్ళ ద్వారా ప్రవహించింది. వనజ ఎంత నీచురాలు! ఎంత దుర్మార్గురాలు! ఎంత కపటి? తనతో చెప్పనైనాలేదు. ఎంత ఘోరం చేసింది! పాణి ఆమెనే ప్రేమించాడేమో! తానంటే అతని కిష్టంలేదేమో! అయితే, పూజముందు తననలా ఎందుకు చూసినట్టు! మర్రిచెట్టు క్రింద అతని చూపులు !! పాణికి తానంటే ఇష్టమే! వనజే ఏదో నాటకం ఆడి ఉంటుంది! వనజే అతణ్ణి పీడించి ఉంటుంది. తండ్రిని కూడా పీడించి ఒప్పించి ఉంటుంది. దాసీది తనకు అడ్డు తగులుతుందా? అమాంతంగా పీక నులిమి చంపేయాలనుకుంది. గదీలోంచి వెళ్ళగొట్టాలనిపించింది. వెళ్ళగొట్టాలి. కాని ఎలా? ఎవరితో చెప్పి? ఏమని? దాసీదిగా అది పాణి దగ్గరికి ఎన్నిసార్లయినా వెళ్ళవచ్చు. అతణ్ణి మురిపించవచ్చు. తాను? దొర కూతురు, అతని దగ్గరకు వెళ్ళలేదు.

తన బాధ వ్యక్తపరచలేదు. తాను ప్రేమించానని చెప్పలేదు. తనకంటే దాసీదే నయం, తాను దాసీయైనా బాగుండును? ఎందుకీ దొరతనపు బతుకు? ఏం దొరతనం తనది! ఇంత పెద్ద దేశ్‌ముఖ్ కూతురు ఒక దాసీదాన్ని వెళ్ళగొట్టలేదనిపించేసరికి దుఃఖం పొంగిపొర్లింది. గొంతులో నిలపడానికి చేసిన ప్రయత్నం విఫలం అయింది. ధారాపాతంగా కన్నీరు వస్తుంటే పరుపుమీద బోర్లాపడి ఏడ్చింది. ఎవరికీ వినిపించకుండా నోట్లో పైటచెరగు పెట్టుకొని ఏడ్చింది. వెక్కివెక్కి ఏడ్చింది, సాయంకాలందాకా ఏడ్చింది.

డప్పుల చప్పుడు వినిపిస్తే లేచి కళ్ళు తుడుచుకొని బయటికి వచ్చింది.

ఊరి డప్పులవాళ్ళంతా డప్పులు వాయిస్తూ ఊరంతా తిరిగి గడిముందుకు వచ్చేశారు. వాళ్ళవెనక జనం కూడా వచ్చేసింది. గడీ ముందు డప్పులు, కొమ్ములు, జనం కోలాహలంగా ఉంది. రెడ్డిగారు నూతనవస్త్రధారులై, తలపాగా ధరించి, కుంకుమబొట్టుతో బయటికి వచ్చారు.

దూరంనించి సన్నాయి వినిపించింది.

"ఓ రామ నీ నామ మెంత రుచిరా......." తాళాలూ, భజనా వినిపించాయి. రెడ్డిగారూ, జనం దేవుని సేవకై నిరీక్షిస్తున్నారు. గరుడ వాహనారూఢుడైన రాముడు కరవాలపాణియై వేంచేశాడు. రెడ్డిగారి సహితంగా జనమంతా రామునికి సాష్టాంగ దండ ప్రణామ మాచరించారు. గడీ ముందు రాముడు ఆగాడు. కొంతసేపు భజన జరిగింది. వనజ హారతి తెచ్చి అయ్యవారి కందించింది. అయ్యవారు ఆరగింపచేసి హారతి ఇచ్చి పళ్ళెం వనజకు అందించాడు. వనజ అందరికీ హారతి అందించి ప్రసాదం ఇచ్చి లోనికి వెళ్ళిపోయింది.

రాముడు సాగిపోయాడు. కొంతజనం సాగిపోయింది. సైను[246] వాడు గుర్రం తెచ్చి రెడ్డిగారిముందు నుంచోపెట్టాడు. జనంలోకి చూస్తే కరణం కనిపించలేదు. పాణి కనిపించాడు రెడ్డిగారికి. 'పంతులు, నువ్వు గడీల్నే ఉండు' అని గుర్రం ఎక్కారు.

పాణి మనసు కలుక్కుమంది.

రెడ్డిగారు ఖడ్గపాణియై అశ్వారోహులైనారు. గుర్రం సాగింది.గుర్రం వెంట జనం సాగింది. దేవునిముందు బాజాలు, డప్పులు, కొమ్ములు మ్రోగుతున్నాయి. వెనకనుంచి అప్పుడప్పుడూ తుపాకులు పేలుతున్నాయి.

ఊరేగింపు శమీవృక్షం దగ్గరికి చేరింది. జమ్మిచెట్టు మొదట వేదిక కట్టివుంది. జాజుతోనూ సున్నంతోనూ అలంకరించారు దాన్ని. స్వామిని వేదికమీద ఆసీనులను చేయించారు. చాకళ్ళు స్వామి ముందు చాపలు పరచారు. రెడ్డిగారు జమ్మిచుట్టూ ప్రదక్షిణం చేశారు. జనమంతా ఆయన్ను అనుసరించారు. తరువాత స్వామి ముందు కూర్చున్నారు రెడ్డిగారు. వారిపక్కనే కరణం కూచోగా ఎవరి అంతస్తుల్ననుసరించి వారు దూరం దూరంగా కూర్చున్నారు.

శమీపూజ జరిగింది. జనమంతా చదువు వచ్చినవారు, కాగితాలు తీసుకొని-

"శమీ శమయతే పాపం
శమీ శత్రువినాశనం
అర్జునస్య ధనుర్ధారీ
రామస్య ప్రియదర్శినీ"

అని వ్రాసి ఆ సంవత్సరంలో వారికి కలగాల్సిన శుభ, లాభాలు వ్రాసి జమ్మికొమ్మలకు గుచ్చారు. తరవాత చీట్లన్నీ రెడ్డిగారి తుపాకి ముందు పెడ్తే తుపాకి పేల్చారు రెడ్డిగారు. వెంటనే అనేక తుపాకులు

ప్రేలాయి. చాకళ్ళు స్వామివాహనాన్ని ఎత్తుకోగా, కుమ్మర్లు దివిటీలు పట్టారు. స్వామి 'సీమోల్లంఘనం' చేసి ఆలయానికి తిరిగివచ్చారు. పూజాదికములు ముగిసింతర్వాత ప్రసాదాదికములు తీసుకొని బయల్దేరారు జనం. డప్పులూ కొమ్ములూ ముందు నడువగా అశ్వారూఢులై రెడ్డిగారు గడీలో ప్రవేశించారు. డప్పులవాళ్ళూ పనిపాటలవాళ్ళూ ఒకపక్కన నుంచున్నారు. రెడ్డిగారు పేరు పేరునా పిల్చి అంతస్తులనుబట్టి అందరికీ డబ్బూ, వస్త్రాలు బహూకరించారు.

ఆ రాత్రి గడీలో జనమంతా విపరీతంగా త్రాగేశారు-పాణి, మంజరి తప్ప. హాల్లో కేకలూ, నవ్వులు, లోకాన్ని మరచి, జనాన్ని మరచి, అంతస్తులు మరచి దొరవారి సహితంగా అందనాలాడారు ఆ రాత్రి.

## 16

మంజరిని చూచి చకితుడైనాడు పాణి. ఒక్కరోజులో ఎంతమార్పు! ముఖం కమిలింది, కళ్ళు లోతుకు పీక్కుపోయి ఎర్రగా జ్యోతుల్లా ఉన్నాయి. శిరోజాలు చెదిరి గాలికి ఎగురుతున్నాయి. అలంకారం లేదు. వీణముందు కూచుని ఉంది.

'మంజరీ! ఏమిటిది?' అడిగాడు పాణి ఆవేదనతో.

దుఃఖం ముంచుకొచ్చింది. దిగమింగటానికి ప్రయత్నిస్తూ వీణ తీవలమీద వేళ్ళు ఆడించసాగింది.

ఇంతలో వనజా వచ్చి కూర్చుంది. వనజను చూచి దుఃఖము, కోపమూ రెండూ పొంగాయి. వనజ ఎందుకు రావాలి? తాను పాణితో మాట్లాడతానని కాపలా? ఛీ, ఎంత దుష్టురాలు! దుఃఖం మింగుడు పడ్డంలేదు. వనజను చూచినప్పుడల్లా కోపం మండుతూంది. మధ్య వనజ గోడ అయి నుంచుంది. వనజ పాణివైపు చూచింది. ఆ చూపు ఆమె గుండెలో శర వర్షం కురిపించింది. పాణి మాట్లాడడేం? ఏదో పిచ్చి పిచ్చిగా వుంది. తాను ఒట్టి నిస్సహాయురాలు! తానేమీ చేయలేదా? ఒక దాసీదాన్ని ఏమీ చేయలేదు. ఛ, ఏమిటీ బ్రతుకు? దుఃఖం పొంగింది. గొంతులో ఆగలేదు. పొర్లింది, టపటపా కన్నీరు కారింది వీణమీద.

బావురుమని ఏడ్చేసింది.

"ఏం మంజరీ, యేమి?" అంటూనే వున్నాడు పాణి. వీణ మీద పెద్దగా గొంతెత్తి యేడ్చింది. క్షణంలో గడీలోని స్త్రీ జనం యావత్తూ పోగయింది. చెమటలు ముంచెత్తాయి మంజరిని. స్పృహతప్పి పడిపోయింది. "బిడ్డా! యేమైంది బిడ్డా?" అని ఇందిరమ్మ ఏడ్వసాగింది. అందరూ కలిసి మంజరిని మంచంమీద పడుకోబెట్టారు. పాణి తన గదికి వెళ్ళిపోయాడు. అతని తలమీద నూరు సమ్మెట పోట్లు పెట్టినట్లయింది. తను యేది తల్చుకున్నా దైవం తలకిందులు చేస్తున్నాడు. ఏదో అవాంతరం రానున్న దనుకున్నాడు. అతని మనస్సు అనేక అశుభాలు శంకించింది.

మంజరి అలా ఎందుకు పడిపోయింది?

ఆమె కంత దుఃఖం కల్గటానికి కారణం?

తానేమయినా తప్పుచేశాడా?

'అమ్మా!' అనే వనజ కేకా, "చెప్పు యేం చేసినావో?" అనే రెడ్డిగారి గర్జనా విని గదిలోకి పరిగెత్తాడు పాణి. రెడ్డిగారు బెత్తంతో బాదుతున్న దృశ్యం కనిపించిందతనికి. పరుగెత్తి వనజకు అడ్డంగా నుంచున్నాడు. పాణి. కుడి బుజంమీద పడింది రెడ్డిగారి బెత్తం. "అమ్మా!" అని అరిచాడు పాణి.

రెడ్డిగారి కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

ఆడవారంతా ఊపిరి బిగపట్టి చూస్తున్నారు.

కొట్టింది పాణిని అనే విషయం కూడ గమనించినట్టులేదు రెడ్డిగారు. మరొక బెత్తపు దెబ్బపడింది పాణి మీద.

"చచ్చాను" అని పడిపోయాడు పాణి.

"నాయ్నా!" కేక పెట్టింది మంజరి స్పృహలోకి వచ్చి.

అప్పుడుగాని రెడ్డిగారికి తెలియలేదు తాను బాదుతున్నది పాణినని.

"పంతులేమనలే, నాకే చక్కరొచ్చింది[247]." అన్నది మంజరి.

"తల్లీ! లేచినావా?" అని బెత్తం అక్కడ పారేసి మంజరి దగ్గరకు చేరారు రెడ్డిగారు.

వనజ పాణిని లేవనెత్తి చేత్తో పట్టుకొని తీసికెళ్ళింది బైటికి.

ఆ దృశ్యం మంజరి గుండెలో వేల సూదులు గుచ్చింది.

"నాయ్నా!" అని తండ్రి తొడమీద ముఖంపెట్టి బావురుమంది. జలజలా కన్నీరు రాల్చింది. మళ్ళీ స్పృహతప్పిపోయింది.

"మంజరీ!" రెడ్డిగారి గుండె బీటలువారింది. రెండు బాష్పబిందువులూ రాలేయి.

ఇందిరమ్మ హోరుమని ఏడ్చేసింది.

చుట్టూరా ఉన్న దాసీలంతా కంట తడిపెట్టారు.

మందుల డబ్బా పట్టుకొచ్చిన అయ్యవారు 'దొరవారూ! కాస్త జరగండి' అన్నాడు. తొడమీదినుంచి కూతురు తల దిండుమీద పెట్టి లేచి నుంచున్నారు రెడ్డిగారు. ఇందిరమ్మ పైట సర్దుకొని కళ్ళు తుడుచుకుంటూ నుంచుంది. అయ్యవారు మంజరి చేతిని మోచేతివరకు పిసికి, మూడు వేళ్ళతో నాడి పట్టుకొని ధ్యానంగా చూచి, చేతిని మెల్లగా దిండుమీద ఉంచి అక్కడ నుంచునున్న దాసీదానితో సాన తెమ్మని చెప్పి 'దొరవారూ! భయం ఏమీలేదు. బాగా అలసిపోయినట్లున్నది. నాడి బహు నీరసంగా వున్నది. కంట్లో కలికం వేస్తాను. ఇప్పుడే తెలివి వస్తుంది. తరవాత నిశ్శబ్దంగా ఉన్న గదిలో పండబెట్టండి, ఎవ్వరు లేపొద్దు. మెలకువ వచ్చేవరకు బాగై పోతుంది' అని చెప్పి, సానమీద కుప్పె రంగరించి కంటికి కలికం వేశాడు.

కొద్దిసేపటికి కళ్ళు తెరిచింది మంజరి. వైద్యుడు కనిపించాడు. తండ్రి కనిపించకపోయేసరికి 'నాయ్నా' అని పిలిచింది.

'ఏందీ తల్లీ?' అని దగ్గరకు వచ్చాడు తండ్రి.

'ఏందిదంత? బాగనే ఉన్నను కదా?'

'ఏం లేదు తల్లీ, కలికమేసిండు అయ్యోరు. ఇగ నిద్రపో' అని జోకొట్టాడు. మంజరి కళ్ళు మూసుకుంది. నిద్రపోయింది. మెల్లగా తలుపుమూసి అంతా బయటకొచ్చేరు.

అంతా మౌనంగానూ, గంభీరంగానూ ఉన్నారు. అయినా అందరి హృదయాల్లోను సంక్షోభం చెలరేగింది.

పంతులు చదువుకున్నవాడు. రామాయణ, భారతాలు విడమరచి చెప్పగలవాడు. సంగీతంలో రాళ్ళను కరిగించగలవాడు. బ్రాహ్మణుడు. అలాంటివాడిమీద చెయ్యిచేసుకున్నాడు భర్త. గడీకి ఏదో ముప్పు వాటిల్లింది. ఎట్టి ముప్పు లేకుండా రక్షించమని ఇందిరమ్మ దేవుణ్ణి ప్రార్థించింది.

'దునియంత[248] తెలిసినోడు. తప్పీర్లు గుంజేటోడు. అసువంటోణ్ణి కొట్టిండు దొర ఊరుకుంటాడాయన? ఏందో జరుగుతుంది' అనుకున్నది గడీలోని పరివారమంతా.

రెడ్డిగారు ఎంతమందిని బాదాడో తెలియదు. కాని అతని హృదయం నేడు క్షోభించినంతగా ఎన్నడూ క్షోభించలేదు. పంతులెంతో మంచివాడు. సంగీతం వినిపించి ఎన్నోసార్లు తనను ఆనంద పరచాడు. అలాంటివాణ్ణేనా తాను కొట్టింది? ఎందుక్కొట్టాడు? ఏమో, తనకు తెలియకుండానే కొట్టేశాడు. అతడు మంజరి నేనైనా అని ఉంటాడా? అంటే మంజరి చెప్పకపోయిందా? ఆస్తితోపాటు పెళ్ళి చేసుకుంటానంటే తాయార్ను త్రోసివేశాడే! ఎంత నిగ్రహం గలవాడు! మంజరిమీద మనసు లేదుకదా! ఉంటే వనజకు అడ్డం వచ్చి దెబ్బలు తింటాడా? అదీ మంజరి ముందు. పాణికి వనజ అంటేనే ప్రేమ. అంతస్తుకు తగిన ఆడదాన్ని ఎన్నుకుంటాడు మగవాడు. మంజరి అంతస్సెక్కడ? అతని అంతస్తెక్కడ? అయితే తానెందుకు బాదినట్లు? తనకు తెలియకుండానే బాదాడు. అయినా దెబ్బ ఐతే అతనికి తగిలింది. 'చచ్చాను' అని అరచి పడిపోయాడు పాపం! ఆ మాట తలుసుకునేసరికి తన గుండెమీద ఎవరో కొరడాతో కొట్టినట్లనిపించి 'అమ్మ' అన్నారు ఆయనకు తెలియకుండానే. బాధపడ్డారు. పాణిదగ్గరకు వెళ్ళి తప్పయిందని అంగీకరిద్దామనుకున్నారు. దొరతనం అడ్డువచ్చింది. ఏవేవో ఆలోచనలు వచ్చి ఆయన మనస్సును చీల్చసాగాయి. సాధారణంగా ఈ పరిస్థితిలో ఆయన సంగీతం వినేవారు.

కాని ఈ రోజు?

"మధుపానం!"

× × ×

వనజ పాణిని తీసుకుని అతని గదిలోకి వెళ్ళింది. "నాకోసం దెబ్బలు తిన్నవులే" అని వెక్కెక్కి ఏడ్చింది. తన దెబ్బలు మరచి, ఆవిడ కన్నీరు తుడిచి "వనజా! చెల్లెవికదూ! ఈ మాత్రం త్యాగం చెయ్యొద్దా అన్న అయినవాడు" అన్నాడు జీరవోయిన గొంతుతో.

వనజ "మా అన్నయ్యా" అని భుజంమీద వాలిపోయింది. ఆమె తన జన్మలో ఎరుగని ఆనందం అనుభవించింది. తన బాధలు పంచుకునేవాడు దొరికాడు. అతని బాధ చూస్తే తన గుండె తరుక్కుపోయింది. తాను కోరిందే అది. తనకో పెన్నిధి దొరికింది.

పాణి శారీరకం అయిన బాధ క్షణం మరిచాడు. వెంటనే గుండె భగ్గున మండింది. చిన్నతనంలో తల్లితండ్రులచేతగూడ దెబ్బలు తినలేదు తాను. ఏమిటీ దొర పొగరు? తానేమన్నాడని అతణ్ణి? వనజను అన వసరంగా గొడ్డును బాదినట్లు బాదుతూంటే అడ్డుపోయాడు. అందుకు తనపై ఇన్ని దెబ్బలా? బహుశా రామారెడ్డి కొట్టాలని కొట్టలేదేమో? అయితేమాత్రం కళ్ళులేవూ? ఎవరిని ఎందుకు కొడుతున్నదీ చూడొద్దూ? ఛీ. దుర్మార్గుడు. వీడి ఇంట్లో ఉండరాదని నిశ్చయించుకున్నాడు. తరువాత విషయం ఆలోచించలేక పోయాడు.

"దొర చదువుకున్నోర్ని ఎప్పుడు కొట్టలే." తనకు తెలియకుండానే అనేసింది వనజ.

"వనజా! ఈ దెబ్బలు శరీరానికి కాదు-గుండెకు తగిలాయి! శరీరానికి తగిలిన గాయం మానిపోతుంది. ఇది మానే గాయం కాదు. నీకోసం దెబ్బలు తిన్నాననే ఆనందంలో ఆ గాయంమీద పొర ఏర్పడింది. 'అహం' ఆ పొరను కాల్చేసింది. గుండె గాయం మండిపోతూంది. ఇక ఈ గడీలో ఉండలేను" అని చివ్వున లేచి ఫిడేలు చేతపట్టుకొని, కండువా వేసుకొని బయలుదేరాడు, గడీలో ప్రవేశించినట్లే.

'అన్నయ్యా! నేను ...' అడ్డు తగిలింది వనజ.

"వనజా! నేనెక్కడున్నా నీవు నాకు చెల్లెలువే. అన్నాచెల్లెళ్ళ సంబంధం శారీరకం అయింది కాదు. వారిద్దరూ ఒకచోట ఉండాల్సిన అవసరమూ లేదు. నా పరిస్థితి బాగుపడితే నిన్నీ చెరనుండి విడిపిస్తాను"

అని వనజను తప్పుకొని సాగిపోయాడు.

వనజ చూస్తూ ఉండిపోయింది.

జల జలా కన్నీరు రాల్చింది.

ఫిడేలు పట్టుకొని రామారెడ్డిగారి గదికివెళ్ళాడు పాణి. గడీలో ప్రవేశించిన్నాటి పాణి కనిపించాడతనికి. నాటి దృశ్యం అతని మనోఫలకంమీద మెరిసింది. అతని సంగీతం, తీసిన ఫోటోలు, చెప్పిన కథలూ ఒక్కసారి తళుక్కుమన్నాయి కళ్ళముందు.

"దొరవారూ! మీరు నాకు ఆశ్రయం ఇచ్చినందుకు కృతజ్ఞుణ్ని. మీకు బాధ కలిగించి గడీలో ఉండతలంచలేదు. వెళ్తున్నాను, శలవు." నమస్కరించాడు పాణి. గొంతు జీరవోయింది.

"పంతులూ!" గొంతు పూడిపోయింది. కష్టంగా మాట పెకిలించుకొని "నువ్వీ గడీలో ఒకనివైనవు. నాకెందుకో నువ్వంటే గుంజాతది. నీ మీద చెయ్యి చేసుకోలేదు. వనజ కష్ణమొచ్చినవు. ఆ కోపంల చూడలేదు" అన్నారు. అంతస్తునుంచి దిగి, అహాన్ని చంపుకొని అతికష్టంగా ఆమాటలంటున్నారు రెడ్డిగారని గ్రహించాడు పాణి. "గోష, పర్దకూడ తీసేసి మా కుటుంబంల ఒక్కణ్ని చేసిన నిన్ను. చదువుకున్నోనివి, సంగీత పండితునివి నిన్ను గడీల ఉంచుకోవాల్ననే ఉన్నది" అన్నారు.

మంజరి స్థితి తలపుకు వచ్చింది.

"అన్నయ్యా నేను?" అనిన వనజ గొంతు వినిపించినట్లయింది.

"తాయారు మాట నెగ్గుతది" అన్నారు రెడ్డిగారు ఆఖరి అస్త్రంగా.

"సరే ఉంటా" అని వెనక్కు తిరిగి, గదిలో ప్రవేశిస్తే వనజ మంచంమీద పడి వెక్కెక్కి ఏడుస్తూంది.

"వనజా! వచ్చేశాను. ఉండిపోతా" అన్నాడు.

"మా అన్నయ్య మంచివాడు" అంది లేచి కూచుని కళ్ళుతుడుచుకుంటూ.

## 17

స్నానంచేసి పిట్టగోడ పట్టుకొని నుంచున్నాడు మేడమీద పాణి. పాలు, ఫలహారం తెచ్చిపెట్టిన వనజ సహితం పక్కనే నుంచుంది ఏదో చెప్పాలని. హ హ-హ హ- అని నవ్వుతూ గేట్లో ప్రవేశించిందొక పిచ్చిది. పసిడిచాయ, ముడుతలు పడిన శరీరం, డొక్కోపోయిన చెంపలూ, చింపిరి తలా, ముడి విడిపోయిన రవికతో 'అంత దగా, అంత దగా, అన్నం పెడ్తారా, అందరూ పోతారా?' అని వికటంగా నవ్వేసింది. తరవాత నేలను చూస్తూ రెండు చేతుల్తోనూ నెత్తి గోక్కుంది. మరొకసారి అలాగే అరిచింది. అలాగే నవ్వేసింది. గడీలోంచి ఎంకటి పరిగెత్తుకొని వచ్చి, 'బువ్వ తెస్త కూకో' అని పట్టుకొని కూర్చోబెట్టి వెళ్ళిపోయాడు. ఆమె వెంటవచ్చిన కుక్కకూడా ఆమె పక్కనే కూర్చుంది. కలవారింటి ఆడపడుచులా ఉంది. పిచ్చిదై ఎందుకు అడుక్కొని తింటూందో అర్థం కాలేదు పాణికి. పక్కకు చూస్తే వనజ కనిపించింది.

'ఎవరీ పిచ్చిది?' ఆశ్చర్యంగా అడిగాడు పాణి.

'కరణం మంగమ్మ.' నిర్లిప్తంగా జవాబు చెప్పింది.

ఎంకటి విస్తట్లో అన్నమూ, కూరలూ, పిండివంటలూ తెచ్చి ఆవిడ ముందుంచాడు. పిచ్చిది అన్నంమీదపడి తింటూంటే, ఆవిడ వెంటనే వచ్చిన కుక్క సహితం ఒకపక్కన తినసాగింది. గబగబా అన్నం తిని, చేతులు చీరకు తుడ్చుకొని వికటంగా మరొకసారి నవ్వి సాగిపోయింది. గేటుదాకా వెళ్ళి 'అంత దగా, అన్నం పెడ్తరా, అందరు పోతారా?' అనుకుంటూ దాటిపోయింది. చూపుకు అందినంత

దూరం చూచాడు పాణి. గదిలోకి వెళ్ళడానికి వెనక్కు తిరుగుతూ అడిగాడు:

"కరణం మంగమ్మంటే?"

"మన కరణం పెండ్లం!"

"వెంకట్రావుగారి భార్యా?"

"అవు!"

"పిచ్చిదెందుకైంది?"

'గదంత శాన పెద్ద కతలే, తింటుండు, చెప్త' అంది. ఇద్దరూ గదిలో ప్రవేశించారు. పాణి ఫలహారం చేస్తున్నంతసేపు కథ చెప్పింది వనజ.

కరణం తండ్రి యతీంద్రరావుగారు గౌరవ కుటుంబపు ఆడపడుచు అయిన మంగమ్మనిచ్చి పెండ్లి చేశారు వెంకట్రావుకు. పెండ్లిండ్లు సాధారణంగా బాల్యంలో జరిగేవి. పిల్లా, పిల్లవాడు డేగాటకు[249] సరిపోయిన వయసులో ఉండాలనుకునేవారు వధూవరుల తల్లిదండ్రులు. మంగమ్మ సుందరి. సాధు స్వభావురాలు. వెంకట్రావు మీసకట్టు రాకముందే పోకిరి తిరుగుళ్ళు ప్రారంభించాడు. ఎప్పుడూ బోగందాని ఇంట్లోనే కనిపించేవాడు. అంతే కాదు-గోడలు దూకి తన్నులు కూడా తిన్నాడు కొన్నిసార్లు. మంగమ్మ ఆలస్యంగా రజస్వలైంది. ఆవిడ సుకుమారమైన శరీరంగలదేకాక, ఆవిడ హృదయం సహితం కుసుమ సుకుమారమైంది. ఆచారం ప్రకారం శోభనం ఏర్పాటు చేశారు. మంగమ్మకు మొగుణ్ణిచూస్తే మొదట నుంచే వణుకు, శోభనపు గదిలో ప్రవేశించిన వెంకట్రావును చూచి బెదిరిపోయింది మంగమ్మ. కరణం బాగా తాగాడు. కళ్ళు ఎర్రవారినాయి. అందమైన మంగమ్మ అతణ్ణి అంధుణ్ణి చేసింది. ఆమెను కౌగలించుకొన్నాడు. పాడు సారాయి వాసన. విడిపించుకోవటానికి ప్రయత్నించింది. విఫలురాలయి కేకలు వేసింది. కాని, ఆమెను రక్షించడానికి వచ్చినవారు కనిపించలేదు. 'అరుస్తన్నవులే' అని వెంకట్రావు ఆమెను మరీ గట్టిగా కౌగిలించుకున్నాడు. ఆడది అంటే ఆటవస్తువు అని అతని అనుభవం. ఆడదానికి హృదయం ఉంటుందని అతనికి తెలియదు. అసలు ఆడది జంగమం అని కూడా తెలీదేమో!

తెల్లవారింది. మంగమ్మ రాలిపోయిన పూవులా వాడిపోయింది. ఆమెను చూచి అంతా ఆశ్చర్యపడ్డారు. కొందరు వెంకట్రావునూ, కొందరు మంగమ్మనూ దూషించారు. వెంకట్రావును చూచి సింహాన్ని చూచిన లేడిలా వణికిపోయింది మంగమ్మ.

మూడు రాత్రులు గడిచినాయి.

పూర్తిగా పాలిపోయింది మంగమ్మ.

తలిదండ్రులకేకాక అందరికీ అది విపరీతం అనిపించింది. అంతా ఆచారాలకు లొంగాల్సి వచ్చింది. వెంకట్రావు ఇంట్లో సహితం మూడు రాత్రులు గడిచాయి.

మంగమ్మ బాగా నీరసించిపోయింది. తలిదండ్రుల గుండెలు "డక్కు"మన్నాయి. మంగమ్మ తల్లిగారింటికి వెళ్ళింది. మందులూ, మాకులూ ఇప్పించడమే కాక, మంత్రాలూ, తంత్రాలూ కూడా చేయించారు. మంగమ్మ కొద్దిగా కోలుకుంది. అత్తవారింటికి పంపుతానంటే హడలిపోయింది. అయినా అత్తవారింట్లో వదలివెళ్ళాడు తండ్రి. నరకంలో కాపురం పెట్టినట్టుంది మంగమ్మకు. తప్పుకొని ఎక్కడెక్కడో పడుకునేది. అయినా, వెతికి పట్టుకునేవాడు వెంకట్రావు. పశువులా ప్రవర్తించేవాడు. ఇటు యతీంద్రరావుగారికీ, అటు మంగమ్మ తల్లిదండ్రులకూ గుండెమీద కుంపటిలా తయారైంది వ్యవహారం.

ఒకరాత్రి కాళ్ళు పట్టుకొని ఏడ్చింది మంగమ్మ.

అటు మంగమ్మ తల్లిదండ్రులకూ గుండెమీద కుంపటిలా తయారైంది వ్యవహారం.

ఒకరాత్రి కాళ్ళు పట్టుకొని ఏడ్చింది మంగమ్మ.

తన్ని వెళ్ళిపోయాడు ఇంట్లోంచి వెంకట్రావు.

యతీంద్రరావుగారు మంగమ్మను పుట్టింటికి పంపించారు.

వెంకట్రావుగారి జీతగాడు వీరిగాడు పెండ్లిచేసుకొని పెండ్లాంతోకూడా వచ్చాడు స్వామికి దండం పెట్టడానికి. వీరిగాని పెండ్లాం పుల్లిని చూచి కన్ను కుట్టింది కరణానికి. "చక్కని చుక్కను కట్టుకున్నావురా" అన్నాడు. గౌండ్ల పుల్లి తలవంచుకుంది. నాటినుంచే దానివెంట పడ్డాడు. వారిద్దరి మనసులూ కలిశాయి. వీరిగాడు లేనప్పుడల్లా గుడిసెకు వెళ్ళి వస్తుండేవాడు కరణం. గర్భవతి అయింది పుల్లి. కరణం వస్తున్నాడని కనిపెట్టాడు వీరిగాడు. పుల్లిని చావబాదాడు. కరణం కొలువు చాలించుకున్నాడు.

తెల్లారి గౌండ్ల పుల్లి కరణం ఇంటికి వచ్చేసింది. వీరిగాడేమైనాడో తెలియలేదు ఊరివాళ్ళకు. నక్కలు బొందతోడి శవాన్ని తింటుంటే చూశాడొకడు. ఊరంతా చాటించాడు. పుల్లి కరణం ఇంటికి రావడాన్ని బట్టి కరణమే వీరిగాణ్ణి చంపాడని గ్రహించినప్పటికీ మాట్లాడే ధైర్యం లేకపోయింది ఎవ్వరికీ.

మంగమ్మకు జ్ఞానం వచ్చింతర్వాత తలిదండ్రు లుండమన్నా తల్లిగారింట్లో ఉండనన్నది. "వాడి కంటపడితే చస్తావు-వద్దు" అన్నాడు తండ్రి. అయినా వినలేదు. మొండిపట్టు పట్టింది. కోపం వచ్చింది తండ్రికి. ఒంటిగానే పంపించాడు అత్తవారింటికి.

చీకటి పడింతర్వాత చేరింది బండి వెంకట్రావుగారింటికి. బండిదిగి లోపలికి ప్రవేశిస్తే కరణం కౌగిలిలో ఉన్న పుల్లి కనిపించిందావిడకు. అది చూచి కెవ్వున కేకపెట్టి పడిపోయింది మంగమ్మ. కరణం వచ్చి బాదాడు. దెబ్బలుతింటూనే "హ, హ, హ, హ" అని నవుతూ పుల్లిమీద పడ్డది మంగమ్మ. పిచ్చికుక్కలా రక్కింది, కొరికింది, గీరింది. అంత బలహీనురాలిని సహితం బలవంతులైన ఇద్దరు ఎదిరించలేకపోయారు. ఎలాగోలాగు ఇద్దరూ మంగమ్మను లాక్కుపోయి బయటవేసి తలుపు వేశారు.

"అంత దగా అంత దగా" అంటూ ఊరిమీదపడింది. నాటినుంచి కరణం ఇల్లు తొక్కలేదు. తండ్రివచ్చి తీసికెళ్తానంటే గిచ్చుతుంది, కొరుకుతుంది. బలవంతంగా తీసికెళ్ళాడొకసారి. పారివచ్చింది అక్కణ్ణుంచి.

నాటినుంచి ఊరిమీద పడి తిరుగుతూంది. ఇష్టం వచ్చిన ఇంటికి వెళ్ళి "అన్నం పెడ్తారా, అందరూ పోతారా?" అంటుంది. ఎవరింటికి ఏవేళ వెళ్ళినా అన్నం పెడతారు. కరణం కనిపిస్తే దూరంగా నుంచొని చూస్తుంది.

కొన్నాళ్ళనుంచీ ఈ కుక్కసైతం ఆవిడ వెంటనే ఉంటూంది. అది ఎక్కడినుంచి వచ్చిందో ఎవరికీ తెలియదు.

తాయారు గౌండ్ల పుల్లి కూతురు. తండ్రి వీరిగాడో, వెంకట్రావో ఎవరికీ తెలియదు.

## 18

**మం**జరికి స్పృహ వచ్చినమాట వాస్తవమేకాని, మనిషి పూర్తిగా మారిపోయింది. అమాంతంగా పది సంవత్సరాలు పైన పడినట్లయిపోయింది. పాణి వనజకు అడ్డువచ్చి దెబ్బలు తినడాన్ని తల్చుకున్నప్పుడల్లా ఆమె గుండెల్లో బల్లాలు గుచ్చుకున్నట్లవుతూంది. అలా అయినప్పుడల్లా సత్తువ జారిపోయినట్లు అవుతూంది. పాణి వనజను ప్రేమించాడా?

మర్రి చెట్టు
జోరున వాన
తాను, పాణి . . .

అదేమిటి? అలా ఎందుకు పల్కరించాడు తనను? విజయదశమినాడు తన కళ్ళల్లోకి అలా ఎందుకు చూచాడు? అవును-అతడు ప్రేమించాడు. అయితే, వనజకు అడ్డుపడి దెబ్బ లెందుకు తిన్నాడు? అవును. ఎందుకు తిన్నాడు? ఎందుకు తిన్నాడు? అది తల్చుకుంటే ఏదో పిచ్చి పిచ్చిగా ఉంటూంది. జుట్టు పీక్కోవాలనీ, తల మంచానికి కొట్టుకోవాలనీ అనిపిస్తోంది.

ఆడది దెబ్బలు పడ్తుంటే ఆదుకొన్నాడు. తప్పా? అవును, తప్పేం? అబ్బ! ఎంత మెత్తని గుండె గలవాడు? ఒక ఆడదానికోసం అది అతనికేమౌతుంది అడ్డు తగిలి దెబ్బల్తిన్నాడే? ఎంత మంచివాడు! అల్లాంటివాణ్ణి ప్రేమిస్తోంది తాను. ఆమె గర్వంతో పొంగిపోతూంది.

వెంటనే పాణిని లేవదీసి చెయ్యి పట్టుకొని తీసుకొని వెడుతున్న వనజ కనిపిస్తే గుండు గుండెలోంచి దూసుకొని పోయినట్లనిపించేది.

మళ్ళీ కోపం, దుఃఖం, చిరాకు, వనజ . . . . వనజ . . . వనజ. . . పళ్ళు పటపటా కొరికింది. వనజ పీక నులిమేస్తె? వనజను తరిమేస్తే? పాణి సరసన నుంచొని వనజను ఏడిపిస్తే ఎంత బావుండును! వనజను మసి చేయాలి. ఎందుకూ - పాణి నడిగేస్తే? పాణి ప్రేమిస్తున్నానంటే మాత్రం! ఎలా? తన తండ్రి, తల్లి, బంగళా, దాసదాసీలు, సౌఖ్యం ఇవన్నీ అవసరమా! ఇవన్నీ ఉన్నాయిగా ఇప్పుడు? మరి సౌఖ్యం ఏది? ఆనందం ఏది? మరి అవెక్కడ ఉన్నాయి? పాణి దగ్గర, పాణి . . . తండ్రి . . . పాణి . . . తండ్రి. తండ్రి ఒప్పుకుంటాడా?

అడుగుల చప్పుడు విని మళ్ళీ ఈ లోకంలోకి వచ్చింది మంజరి. వైద్యుణ్ణి తీసుకొని తండ్రి ప్రవేశించాడు. మంజరి స్థితి చూస్తే వైద్యునికే భయమైంది. నాడి చూచాడు. జబ్బేమీ కనిపించలేదు. నీరసంగా ఉంది. నీరసం రోజు రోజుకూ పెరుగుతూంది. తన మందులు పనిచేయడంలేదు. అతనికేమీ అర్థం కాలేదు జబ్బు.

"నిద్రొస్తున్నదా?" అడిగాడు వైద్యుడు.

తల ఊపింది వస్తున్నదన్నట్లు.

"ఆకలి అవుతున్నదా?"

తల ఊపింది అవుతున్నదన్నట్లు.

"కాళ్ళు, చేతులు గుంజుతాయా?"

తల అడ్డంగా ఊపింది.

కళ్ళు చూచాడు. నాలుక చూచాడు. అయినా, ఏమీ అర్థంకాలేదు. సానమీద కుప్పె అరగదీసి, గిన్నెలోకి కలిపి తాగించాడు. కష్టంగా మింగింది. చేదు!

వైద్యునితోపాటు రెడ్డిగారూ నడిచారు కొంత దూరం. మౌనంగా నుంచున్నారిద్దరూ. "దొరవారూ! ఈ రోగం నాకేమీ అంతు చిక్కటం లేదు" అని వైద్యుడనేసరికి రెడ్డిగారి గుండె జల్లుమంది. శాల్మలీకంద కందాళ ప్రసన్న వెంకట వరదాచార్యులవారి వైద్యం ఆ చుట్టుపట్ల ప్రఖ్యాతం అయింది. ఆయన నాడి చూచి సర్వం చెప్పగలడనీ, ఆయనిది అమృతహస్తమనీ ప్రఖ్యాతి. పెద్ద పెద్ద సన్నిహిత వ్యాధులూ, పక్షవాతాలూ కుదిరించాడాయన. అల్లాంటివాడు తనకు వ్యాధి అర్థంకాలేదంటే- అదీ వైద్యుడు గుండె

జల్లుమనడంలో అబ్బురం లేదు.

"రోగమేమీ కనిపించటంలేదు. నీరసం రోజురోజుకు పెరుగుతున్నది. మహామహా ఔషధాలు కూడా బూడిదలో పోసినట్లు అవుతున్నవి. గాలిదోషం ఏమన్న ఉన్నదేమోనని అనుమానంగున్నది. వ్యాధి వచ్చిన గడియకూడా దుష్టగడియ. బ్రాహ్మడిచేత శనిజపం చేయించండి. గాలి దోషానికి చికిత్స చేయించాలె" అని చెప్పి వెళ్ళిపోయాడు వైద్యుడు.

రెడ్డిగారి హృదయంలో సంక్షోభం చెలరేగింది. తనకున్నది ఒక్కగానొక్క కూతురు. సంపదకు అధికారానికి కొదువలేదు. ఆమెకోసం తన సంపద యావత్తూ దానం చేయడానికీ, ఆమెకోసం బిచ్చం ఎత్తమన్నా ఎత్తడానికీ తయారుతారు. ఎంత సంపద ఉండి ఏం ప్రయోజనం - తన మంజరి మంచం పట్టి ఉంటే? మంజరి గంతులువేస్తూ తన ముందుంటే తన కేమీ అక్కర్లేదనుకున్నారు. ఇంకేవేవో ఆలోచనలు వచ్చాయి. బైండ్లవాణ్ణి పిలిపించాలి. అప్పటికీ తగ్గకుంటే బస్తీకి తీసికెళ్ళాలి అని నిశ్చయించుకున్నారు. మనఃక్షోభం కలిగినప్పుడల్లా పాణి దగ్గరికి వెళ్ళడం ఆయన అలవాటు. అయితే, ఇప్పుడాయన సంగీతం వినే స్థితిలో లేరు. తన క్షోభ తెలియపర్చుకోడానికి పాణి గదికి వెళ్ళారు.

"ఏమైంది?" కలవరపాటుతో అడిగాడు.

జరిగిందంతా చెప్పారు రెడ్డిగారు.

"దొరవారూ! నిష్ఠురం అయినా నిజం చెప్పనా?" అన్నాడు పాణి.

ఇలాంటిమాటే ఇదివరకేదో చెప్పాడు పాణి అనే విషయం గుర్తుకు తెచ్చుకుంటే పీరిగాడు, చింతకాయలూ గుర్తుకు వచ్చాయి. నాడు పారిపోయిన పీరిగాడు మళ్ళీ కనిపించనేలేదు. వాని కారణంగా చింతలకు కాపుంచాల్సి వచ్చింది. ఎక్కడున్నా పట్టుకొనిరమ్మని మనుషుల్ని పంపించారు. ఇంకా దొరకనే లేదు. ఎన్నాళ్ళు తప్పుకొని తిరుగుతాడు? ఇంతలో మంజరి గుర్తుకు వచ్చింది. "చెప్పు" అన్నారు.

"ఈ దయ్యాలూ, భూతాలూ వట్టి భ్రమ. మూర్ఖం. వాటివల్ల ప్రయోజనం ఏమీ లేదు. వైద్యుడు శరీరం బాగానే ఉందంటున్నాడు. అంటే మంజరి మనసు బాగాలేదని అర్థం. ఏదో చిరాగ్గా ఉన్నట్టుంది. మనసులో ఏముందో తెలుసుకునే వైద్యుడు ఇంతవరకు పుట్టలేదు. మనసుకు శాంతి లభిస్తే బహుశః వ్యాధి తగ్గు రూపం పట్టవచ్చు. చిరాకుగా ఉన్న మనసుకు శాంతినీ, ఉల్లాసాన్ని ఇవ్వడంలో సంగీతాన్ని మించింది లేదు. ఒక పాట వినిపించి చూతాం. సంగీతంవల్ల కోలుకుంటుందా సరేసరి, లేదా బస్తీకి తీసికెళ్ళడం వైద్యం చేయించడమే మంచిది."

పాణి చెప్పిందాన్లో ఆయనకి అభ్యంతరం ఏమీ కనిపించలేదు. బాధపడినపుడల్లా సంగీతం ఆయనకి ఎంతో ఆనందాన్నీ, ఉల్లాసాన్నీ ఇచ్చింది. పాట వినిపించి దాని ప్రభావం చూడ్డంలో తప్పు లేదనుకున్నారు.

"సరే, అట్లనే కానియ్యి" అన్నారు రెడ్డిగారు.

ఇద్దరూ గదిలో ప్రవేశించారు. మంజరి కళ్ళు మూసుకుని ఉంది. ఎక్కడుందో ఆమె మనసు మరి! ఎవరు గదిలోకి వచ్చిందీ గమనించలేదు.

పాణి వీణకు శ్రుతి పెడ్తుంటే హృదయవీణకు శ్రుతి పెడ్తున్నట్లు అనిపించింది. కళ్ళు తెరిచింది.

"గ్ం గ్ం గ్ం"

"ప॥ నా జీవాధారా! నా నోము ఫలమా! ॥నా జీవా॥

అ॥ రాజీవలోచనా! రాజరాజ శిరోమణి ॥నా జీవా॥

చ॥ నా చూపు ప్రకాశమా!

నా నాసికా పరిమళమా!

నా జపవర్ణరూపమా!

నాదు పూజాసుమమా

త్యాగరాజనుత"

గొంతెత్తి పాణి పాడుతూంటే ఆనందంతో ఏకాగ్రంగా వినసాగింది. పాట హృదయానికి ఉల్లాసం కలిగిస్తూంది. పాణి తనవైపుచూచినప్పుడల్లా ఆ చూపుల్ని పరీక్షించసాగింది. అవి స్వచ్ఛంగా ఉన్నాయి. శరచ్చంద్రికల్లా ఉన్నాయి. ఆ చూపుల్లో ఆమెకు వలపు చినుకులు కనిపించాయి.

పాణి తనవాడేని నిశ్చయించుకుంది. దాంతో శరీరంలో సత్తువ చేరుతున్నట్లు అనిపించింది.

తనకోసం ఎంత చక్కగా పాడుతున్నాడు!

వీణ ఆగిపోతే గుండె ఆగినంత పనైంది. మబ్బుల్లోంచి మట్టిలో పడినట్లయింది. లేచి కూర్చుంది.

రెడ్డిగారి ఆశ మొలకెత్తింది.

"ఇంకొక్క పాట" అన్నది మంజరి.

పాణి అలసిపోయి ఉన్నాడని గమనించిన రెడ్డిగారు "పంతులూ! ఇంకొక్కపాట పాడు" అన్నారు యాచిస్తున్నట్టు. ఆ దీనత్వం చూచి చిరునవ్వు నవ్వుకున్నాడు పాణి. ఆ ధ్వనిలో అధికారంగానీ, దర్పంగానీ లేదు. అది యాచన. ఎవరిని? పాణిని. ఎవరు? గ్రామ ప్రభువు!

ప॥ చక్కని రాజమార్గమే యుండగ

సందుల దూరనేలా ఓ మనసా ॥చక్కని॥

అ॥ చక్కని పాలుమీగడ యుండగ

ఛీయు[250] గంగాహర మేలా

చ॥ కంటికి సుందర కరమగు రూపమే

ముక్కంటి నోట చెలగే నామమే

త్యాగరాజింటనే బాగ నెలకొన్న ఆదిదైవమే

ఇటువంటి శ్రీ సాకేతరాముని భక్తియనే ॥చక్కని॥

ఈసారి రెడ్డిగారు కూడా తన్మయంగా విన్నారు. పాట ముగించి "మళ్ళీ రేపు పాడ్తా" అన్నాడు పాణి, మరొక పాట పాడమన్నా పాడలేననే ధ్వనిని వ్యక్తపరుస్తూ.

"ఇప్పుడెట్లున్నది?" అడిగారు రెడ్డిగారు పాణిని.

వీణ పక్కకు పెట్టాడు పాణి.

"నాకేమైంది?" మంజరి అడిగింది.

సత్తువ వచ్చేసింది.

'పాలు తాగుతావు?'

'తాగుత!'

పాలు తెప్పించడానికి వెళ్ళారు రెడ్డిగారు.

'ఎందుకు మంజరీ! అలా అయినావు?' అడిగాడు పాణి.

'నీకోసం,' తల వంచుకొని అన్నది. పెదవులమీది చిరునవ్వు దాచుకున్నా దాగలేదు.

ఏదో అనబోయాడు. రెడ్డిగారు ప్రవేశించారు. పాలగ్లాసు తీసుకొని వనజ ప్రవేశించింది. వనజను చూచి ఒళ్ళు మండింది మంజరికి. చేతులు వణికాయి.

వనజ పాలగ్లాసు అందించింది.

మంజరి అందుకుంది.

చేయి జారింది.

'ఘణ్' మని పాలగ్లాసు క్రింద పడిపోయింది. తెల్లని పాలు నేల మీద పర్చుకున్నాయి.

క్షణం క్రిందికి చూచి పైకి చూచింది మంజరి. వనజ అక్కడే నుంచుంది మౌనంగా. మంజరి కళ్ళు రక్తం కక్కాయి. "గలాసు ఇడ్చిపెడ్తవులె" అని లాగి చెంపమీద కొట్టింది వనజను.

వనజ జలజలా కన్నీరు రాల్చింది.

చెంప పట్టుకొని దూరం జరిగి నుంచుంది.

ఎన్నాళ్ళనుంచో ఆ పని చేయాలనుకుంటుంది మంజరి. పాల నెపంతో చేయగలిగింది. పక్కకు చూస్తే మళ్ళీ వనజ కనిపించింది. దయ్యం కనిపించినట్లయింది. "ఫో" అని గద్దించింది.

పాణి గుండె చెరువైంది. చిత్రంగా తోచిందంతా. వనజ చెంప 'చెళ్ళు' మంటే తన చెంప 'చెళ్ళు' మన్నట్లనిపించింది. వనజను 'ఫో' అంటే తన్ను 'ఫో' అన్నట్లు అనిపించింది. రక్తం ముఖంలోకి ఎగబ్రాకి దిగిపోయింది. చివాలున లేచి వెళ్ళిపోయాడు.

గదిలోకి వెళ్ళిపోయాడు.

కూతురు ప్రవర్తన విచిత్రంగా తోచింది రెడ్డిగారికి. దగ్గర కూచుని తల నిమురుతూ "గలాస నీ చేతిలోంచి జారిపడె. వనజ నట్లెందుకు కొట్టినవు, పాపం?" అని అడిగారు.

తండ్రి సైతం వనజ పక్షం వహించాడనుకుంది.

వెంటనే కళ్ళల్లో నీళ్ళు నిండాయి

జలజలా కన్నీరు రాలింది.

"నాయ్నా!" అని బావురుమంది తండ్రిమీదపడి.

వనజను చూస్తే మంజరి ఎందుకు మండిపోతూందో గ్రహించాడు పాణి. వనజకూ తనకూగల సంబంధం చెపుతే బాగుపడుతుందనుకున్నాడు. ఆ విషయం ఏకాంతంగా చెప్పడానికి అవకాశం కోసం ఎదురుచూడసాగాడు.

## 19

గడీముందున్న వేపచెట్టు కొమ్మమీదికి రోజూ ఒక వడ్లపిట్ట వచ్చి తొలుస్తూంది. పిట్ట వేపకొమ్మను తొలిచేప్పుడు ఫోటో తీయాలని రోజూ ప్రయత్నిస్తున్నాడు పాణి. కాని, పడ్డం లేదు. ఒకరోజు ఆకులు అడ్డం వస్తాయి. సరిగ్గా పోజు కుదిరేసరికి పిట్ట ఎగిరిపోతూంది. దాంతో సతమతం అవుతున్నాడు. ఈ రోజు ఎలాగైనా ఫోటో తీయాలనే పట్టుదలతో నుంచున్నాడు పాణి మేడమీద.

"దొరకండ్ల పడ్తె చంపుతడు, నీ కాల్మొక్త ఇడువురి" అన్న ఏడ్పు వినిపిస్తే క్రిందికి చూచాడు పాణి. మదార్‌సాబ్, మరొకడు ఒకణ్ణి రెక్కపట్టుకొని లాక్కొస్తున్నారు. విడిపించుకోవడానికి గింజుకుంటూ ప్రయత్నిస్తున్నాడు వాడు. ఇద్దరూ రెండు చేతులు పట్టుకొని ఎత్తారు. అతడు వ్రేలాడాడు. అలాగే ఎత్తి గేట్లోంచి లోపలికి తీసుకొని వచ్చారు.

పాణి ఫోటో తీశాడు.

"దొరా! పీరిగాణ్ణి పట్టుకొచ్చినం. బిచ్చమెత్తుకు తిరుగుతాండు ఊరూరు" అని కేకవేశాడు మదార్సాబ్.

బెత్తం పట్టుకొని ఆకలిగొన్న సింహంలా లంఘించారు రెడ్డిగారు. పట్టుకొనివచ్చినవాళ్ళు పీరిగాణ్ణి వదిలి దూరం జరిగారు. "లంజకొడక, చింతకాయలెత్తుక పోతవులె" అని వీపుమీద కర్రతో లాగికొట్టారు రెడ్డిగారు.

"చస్తి దొరా! బుద్ధి గడ్డితిన్నది, పిల్లలుగలోణ్ణి, చంపకుర్ని, నీ కాల్మొక్త బాంచను" అని కాళ్ళమీద పడ్డాడు పీరిగాడు. వాడు వంగడంతో కర్ర వీపుమీద కాక నేలమీదపడింది. "గాడ్డికొడక, కాళ్ళమీద పడ్తవులే" అని కర్రతో లాగి బాదారు వీపుమీద.

"అమ్మో, చస్తిని" అని వీపు తుడుచుకుంటూ లేచి ఉరుకు పుచ్చుకొన్నాడు పీరిగాడు గేటుదాటి.

"నిలబడి చూస్తాన్రేమిరా! గుంజ్కారాండి గాడ్దికొడుకును . . . . ఇయ్యాళ్ళ తోళ్ళోలుస్త, దొరంటే ఏమనుకున్నడో, చింతకాయ లెత్కపోతాడు, చింతకాయలు" అని అరిచారు రామారెడ్డి దొరవారు.

మదార్సాబ్, మరొకడు పరిగెత్తి లాక్కొచ్చారు వాణ్ని.

"పిల్లలుగలోణ్ణి. చంపకురి నీ బాంచను" అని కాళ్ళుపట్టుకున్నా వినకుండా, "ఇగాడికి పరార్తైతావురా[251]" అని, "గేటు బంద్ చెయ్యిరి. . . . తడఖా చూపిస్త" అని ఆజ్ఞాపిస్తే గేటు మూసేశాడు మదార్సాబు. పీరిగాడొచ్చి కాళ్లమీదపడి 'దొరా, చంపకండి. నీ కాల్మొక్త, పిల్లలగలోడ్ని, బాంచను' అని వలవలా ఏడ్చాడు. రెడ్డిగారు కాలితో ఒక్కతన్ను తన్ని, కర్రతో బాదారు. 'అయ్యో చస్తిని. అయ్యో చస్తిని' అని పరిగెత్తాడు వాడు. వెంబడించి బాదారు దొరవారు. 'వామ్మోచస్తిని-వాయ్యోచస్తిని' అని వాడు పరుగెడుతుంటే వెంబడించి బాదసాగారు రెడ్డిగారు. పరుగెత్తుతుంటే పౌరుషం ఎక్కువై వెంబడించి మరీ బాదుతున్నారు. పీరిగాడు పడిపోయాడు. లాగి దెబ్బలు కొట్టారు రెడ్డిగారు. వీపుమీద తగలాల్సిన దెబ్బ కణతమీద తగిలింది. కళ్ళెత్తి నోటితో ఊపిరి పీల్చుకున్నాడు పీరిగాడు. గమనించకుండా బాదేస్తున్నారు రెడ్డిగారు గొడ్డును బాదినట్టు.

పీరిగాడు మూడుసార్లు నోటితో శ్వాస పీల్చుకున్నాడు.

తల వ్రేలాడిపోయింది. ప్రాణం ఎగిరిపోయింది.

కర్రలా పడివున్న కళేబరాన్ని చూచి లిప్తపాటు రెడ్డిగారి గుండె ఆగిపోయింది. మరుక్షణంలో రాక్షసుడైపోయారు. కాలితో శవాన్ని తనిన 'పాతిపెట్టుర్ని తోట్ల' అని వెనక్కుతిరిగి చకచకా నడుస్తూ మెట్లెక్కి వెళ్ళిపోయారు రెడ్డిగారు.

సూర్యుడు అస్తమించాడు. చీకట్లు వ్యాపించాయి.

పరిగెత్తినట్లు నడిచిపోయి మంచంమీద పడిపోయారు రెడ్డిగారు. ఆయాసం ఎక్కువైంది. రొప్పు వచ్చింది. గుండె అతివేగంగా కొట్టుకోసాగింది. ఒళ్ళంతా చెమటలు పట్టింది. ఆయనకి తెలియకుండానే కళ్ళవెంట జల జలా నీరు కారసాగింది. ఎంత తుడుచుకున్నా తగ్గలేదు. కళ్ళముందు ఏదో తెర ఏర్పడినట్లయింది ఏదో అయోమయం. అంధకారం ఆయనకి, అంతకుముందు జరిగింది గుర్తుకురావడంకానీ, తక్షణం తర్వాత కాలం ఉందనే విషయం తెలియడంకానీ లేదు.

క్రమంగా ఆయాసం తగ్గింది. కాని, ఆరాటం హెచ్చింది. శరీరం నిప్పుల్లో పెట్టినట్లవుతూంది. ఎవరో విసిరి మంటను పెంచుతున్నట్లనిపిస్తూంది. కళ్ళనీరు తగ్గింది. కాని, కళ్ళల్లో నిప్పులున్నట్లు మండిపోతూంది.

ఎవరో విసిరి మంటను పెంచుతున్నట్లనిపిస్తూంది. కళ్ళనీరు తగ్గింది. కాని, కళ్ళల్లో నిప్పులున్నట్లు మండిపోతూంది.

'దొర! చంపకుండ్రి, పిల్లలుగలోణ్ని.' పీరిగాని మాటలు పదే పదే వినిపించసాగాయి. చెవుల్లో నూరు కంచు గంటలు మ్రోగుతున్నట్లనిపిస్తూంది.

పీరిగాడు కళ్ళలో ఆడాడు. ఎంత బ్రతిమలాడాడు వాడు. వాణ్ని చంపాలనుకోలేదు తాను. నాలుగు బాది బుద్ధి చెప్పాలనుకున్నాడు. కాని దెబ్బ ఆయువు పట్టున తగిలింది. చల్లబడ్డాడు. తానైతే చంపాలని చంపలేదు. కాని, పోలీసులు చేతులకు బేడీలు వేస్తున్నట్లనిపించింది. గుండె జల్లుమంది. న్యాయస్థానం, విచారణ . . . తరువాత తరువాత తరువాత ఉరికంబం, ఉరికంబం, ఉరికంబం, ఉరికంబం! ఉలిక్కిపడ్డారు. మెడ చూసుకున్నారు.

వాడేంచేశాడు పాపం! చింతకాయలు కోసుకొనిపోయాడు, చింతకాయలు! 'చింతకాయలు అతి చిన్న విషయం. వాటికోసం మీరేవేవో చిక్కులలో ఇరుక్కోవద్దని నా మనవి' అన్న పాణి మాటలు గుర్తుకు వచ్చాయి. ఎంత దూరదృష్టితో చెప్పాడు! అతని మాటలు వింటే ఎంత బావుండేది! ఇప్పుడొక నిండు ప్రాణం తీశాడు తాను.

ఉరికంబం. తాను ఉరికంబాన్ని ఎక్కుతాడు. మంజరి, ఇందిర ఏమౌతారు? తాను లేకుంటే ఈ ఊరి జనం చీల్చుకొని తినేస్తారు వారిని. వారి గతి ఏం కావాలి? వీల్లేదు - తాను చావడానికి వీల్లేదు. బతకాలి. తనకోసం కాదు, మంజరికోసం బ్రతకాలి. ఇందిరమ్మకోసం బ్రతకాలి-బ్రతకాలి. కాని, ఎలా?

ఈ చావే పోలీసులకు తెలియకుంటే? అవును, మంచి ఉపాయం. కాని, ఎలా? పటేల్ నిజామొద్దీన్‌తో చెప్పాలి. రిపోర్టు కాకుండా చూడాలి-కాని వాడు తన మాట వింటాడా? వాడు కరణం మనిషి. కరణం తన మాట వింటాడా? ఒప్పుకుంటాడా? డబ్బు డబ్బు డబ్బు. ఎంత? వేయి, రెండువేలు, మూడువేలు, నాల్గువేలు. ఎంతైతే ఏం? ప్రాణం కంటే ఎక్కువా?

తను నేరంచేసి తప్పుకోవాలని చూస్తున్నాడు. పీరిగాడు చేసిన నేరం ఏమిటి? - ఏమిటి? ఎందుకు చంపాడు తాను? అవును - ఎందుకు చంపినట్లు? మెదడును ఎవరో గోళ్ళతో పట్టుకొని చీలుస్తున్నట్లనిపించింది.

ఎందుకు తానింత బాధపడాలి? వాడికి ఆయుష్షు మూడింది. చచ్చాడు. తనకు తప్పుకోడానికి డబ్బిచ్చాడు భగవంతుడు. అవును. తప్పుకోవాలి. భగవంతుడు రక్షిస్తాడా? ఏమో! అనేక మొక్కులు మొక్కారు.

గడీకి ఏదో మూడింది. అటు మంజరి అలా పడి ఉంది. ఇటు తానిలా అయిపోయాడు. తాను కరణాన్ని బ్రతిమలాడాలి. అధికారంనుంచీ దర్పంనుంచీ తొలగాలి. అయినా, లొంగుతాడా కరణం? ప్రయత్నించాలి. అతడు కోరిందల్లా ఇవ్వాలి.

చూస్తే దీపాలు వెలుగుతున్నాయి గదిలో. అది గమనించనే లేదు తాను. దీపాలు కంట్లో మండుతున్నట్లనిపించింది. కండ్లు మూసుకున్నారు. ఎంకటిని పిలిచి కరణాన్ని పిలుమని చెప్పారు. ఎంకటి తిరిగివచ్చి కరణం రేపు వస్తానన్నాడని చెప్పాడు. కరణం నెత్తి కెక్కుతున్నాడని గ్రహించారు రెడ్డిగారు. అవసరం ఏర్పడినప్పుడు వసుదేవుడంతటివాడు గాడిద కాళ్ళుపట్టుకున్నాట్ట. తానొక లెక్కా? పని పడింది తనకు. పిలిపిస్తే కరణం ఎందుకు వస్తాడు? తానే వెళ్ళాలనుకున్నారు. ఉదయం అంతా చూస్తుండగా వెళ్ళిందానికంటే ఈ రాత్రే వెళ్ళడం మంచిదనుకున్నారు. వంకీకి ఉన్న కర్రనందుకొని బైల్దేరారు. గడీని

కాపలా కాస్తున్న యమభటుల్లాంటి పదిమంది రెడ్డిగారిని చూచి సలాములు చేశారు. రెడ్డిగారు గేటుదాటితే ఇద్దరు వారివెంట వెళ్ళారు.

కరణంగారు చుట్ట కాలుస్తూ బయటికి వచ్చి అన్నాడు : "ఓహో దొరవారా? దారితప్పి వచ్చిన్రే! అయినా, దొరలు ఊరికెందుకు వస్తరుగని రాండ్రి కూచోండ్రి."

ఇద్దరూ బల్లమీద కూర్చున్నారు.

ఎలా ప్రారంభించాలో తోచలేదు రెడ్డిగారికి. తాను ముందెందుకడగాలి? అని వూరుకున్నాడు కరణం. కొన్ని క్షణాలు మౌనమే రాజ్యం చేసింది.

'చింతకాయల చోరి ఇన్నరు కద!' రెడ్డిగారు ప్రారంభించారు.

'ఆ. మీరు చెప్పిన్రా గని. ఊళ్ళ చెప్పుకుంటూంటే ఇన్న.'

మాటలోని వెటకారాన్నీ, కారిన్యాన్ని గ్రహించారు రెడ్డిగారు. కాని, ఏంచేస్తారు? పని తనది.

'పేరిగాడు తప్పించుకు తిరుగుతాండిన్నొద్దుల్నుంచి'

'దొర్కి పట్టుకొచ్చి చావగొట్టిన్రట.' పూర్తిచేశాడు కరణం. ఆ ప్రవర్తన వింతగా ఏమీ తోచలేదు రెడ్డిగారికి.

'చంపాల్నని కొట్టిన్రనుకున్రా, దెబ్బ ఆయుపట్టు . . .

'ఆవు. ఖతల్ ముకద్దమే[252].'

'చాకలాణ్ణి చంపినందుకు నాకు పాసీ[253] ఏత్తరనుకో. మందెంతా నెత్తికెక్కుతరొ జర ఆలోచించురి. ప్రభుత్వము చేస్తున్నమా? ఇంకేమన్ననా? నేను జేలు పోయిననక ఊళ్ళోళ్ళు నీ మాటింటరా? చేతులుంటారా? నువ్వు ఊళ్ళ ఉండలేస్తవా? ఈ మందున్నరే గట్ల దబాయించి పెట్టినన్ని దినాలే చేతులుంటరు. లేకుంటే నిన్ను నన్ను నవిలి మింగుతరు. నువ్వు గౌండ్లోన్ని ఖతల్ చేయించి తోట్ల పాతిపెడ్తే నేనేమన్న మాట్లాడిననా?'

'నేనెక్కడి గౌండ్లోన్ని చంపిన . .?' తత్తరపాటుతో అడిగాడు కరణం.

'అవు. చంపలేగని. ఇద్దరు లంబాడోల్లను చంపిస్తె నేనేమన్న అడ్డమొచ్చిన్నా. ఇగ చూడు ప్రభుత్వం అంటే నువ్వు, నేను. ఇద్దరం ఆపస్లో[254] అడ్డం తగలొద్దు.'

'మరి నేనేమడ్డ మొస్తాన్నా మీకు?'

"ఖతల్[255]" సంగతి పోలీస్కు ఇత్తలా[256] చెయ్యకుండాలె.'

'నిజామొద్దీన్కు చెప్పురి. నన్నేం చెయ్యమంటరు?'

'పెద్ద మనిషని నీతాని కెందుకొచ్చినట్లు? నువ్వేదంటే అదిస్త.'

'ఏమిస్తరు?' ఈ మాట కోసరమే ఎదిరి చూస్తున్నాడా అన్నట్లు అడిగాడు.

"నాతానున్న దేమన్న అడుగు ఇస్త!"

వాయిద[257] "తప్పరు గద!"

"ఎప్పుడన్న వాయిద తప్పిన్నా?"

"నిజంగనా?"

"నిజంగ!"

"నాకు పైకమొద్దు. జమీనొద్దు[258] ఇంకేమన్న అడుగుత ఇస్తరా?"

"ఇస్తనన్న గద. ఎన్నిసార్లనమంటవ్?"

"జాయిదారు, పట్వారిగిరీ ఆయనకి ఇస్త."

రెడ్డిగారికి ఏమీ తోచలేదు. పాణి ఇదివరకొకసారి తాయారును ధిక్కరించాడు. తాను వనజ నిచ్చి పెండ్లి చేద్దామనుకున్నారు. పంతులుకు వనజంటే ఇష్టంకూడా, అట్లాంటప్పుడు తాయారును పెళ్ళి చేసుకోవడానికి ఒప్పుకుంటాడా?

"ఇంకేమన్న అడగరాదు?"

"మంజర్ని పంతులుకిచ్చి చేస్తరా?"

పిడుగు పడ్డది రెడ్డిగారి నెత్తిన! మరో సమయం అవుతే కరణం పీక నులిమి చంపేవాడే. కాని కోపాన్ని దిగమ్రింగాడు.

"పంతులాడ? చిందొర్సానాడ? పంతులింటాడా అని!"

"ఇనిపించాలె, ముంగల అందరు అట్లనే అంటరు. మూడు ముళ్ళు పడ్తె మూలకు పడుంటరు!"

"ఇంకే మొద్దంటవులే?"

"ఊహు!"

"పంతుల్నడిగి చెప్త" అని చకచకా నడిచిపోయారు రెడ్డి. కరణం వికటపు నవ్వు గుండెలో ముళ్ళపొద మొలిపించింది.

రెప్పవాల్తే ఉక్కిరిబిక్కిరై నోటితో గాలి పీల్చుకుంటున్న పీరిగాడు కనిపించాడు. వాని శవం కళ్ళల్లో ఆడసాగింది. కళ్ళు తెరిస్తే ఏ మూల నుంచో పీరిగాడు కఱ్ఱ పట్టుకొని వచ్చి బాదుతాడనిపిస్తాంది. కళ్ళు మూసుకుంటే ఆ దృశ్యం, కళ్ళు తెరిస్తే ఈ దృశ్యం, మరొక దృశ్యం పోలీసులు. సంకెళ్ళు, న్యాయస్థానం, ఉరికంబం - అవి తల్చుకుంటే ఒళ్ళు జలదరించింది. తప్పుకునే ఉపాయం? తన చావు బ్రతుకులు కరణం చేతుల్లో ఉన్నాయా? ఇన్నేళ్ళు అప్రతిహతంగా ప్రభుత్వం సాగించిన తాను, కరణంముందు చేతులు చాచి అడుగుతే షర్తులు పెడ్తాడా? పాణి వింటాడో? తాయారంటే అతనికి ఇష్టంలేదు. పిచ్చివాడు, పిల్లనుచూచి కాకుంటే ఆస్తిని చూచి పెళ్ళాడగూడదూ? పెళ్ళి తరువాత అది ఇష్టం కాకుంటే వందమంది వస్తారు! తాను ఎందరితో సుఖించలేదు? వనజ పాపం! వనజ తల్లి!! కొత్త పెళ్ళికూతుర్ని పట్టుకున్నాడు. ఇంకెంతో మంది ఆయన కళ్ళలో ఆడారు.

తాను పొలం నుంచి వస్తున్నాడా సాయంకాలం. నీళ్ళ బిందెలు నెత్తిన పెట్టుకొని ఇండ్లకు వెళ్తున్న ఆడవారు "దొరవారు, దొరవారు" అని తప్పుకున్నారు. కాని కుమ్మరి మల్లి కుండ నెత్తిన పెట్టుకొని తన ముందు నుంచి వయ్యారంగా సాగిపోతూంది. ముందునుంచి వస్తున్న వాడెవడో "దొర, దొర" అనేసరికి బెదిరి పక్కకు తప్పుకుంది. వెనక ఇంటి చూరులోంచి పొడుచుకొని వచ్చిన వాసం గుచ్చుకొని కుండ పగిలిపోయింది. ఒంటినిండా స్నానం చేసినట్లు నీళ్ళు పడ్డాయి. తడి బట్టల్లోంచి పొంగిన అవయవాలు స్పష్టంగా కనిపించాయి. తానలాగే నుంచుండిపోయాడు. క్షణం సిగ్గుతో కుంచించుకుపోయి, చేతులు కప్పుకొని తల వంచుకొంది మల్లి. దగ్గ దగ్గి సాగివచ్చాడు తాను. ఆ దగ్గులోని అంతర్యం తెలుసు మదార్‌సాబ్‌కు. రాత్రి మల్లి వచ్చింది గడీకి - కుమ్మరి మల్లి.

ఎన్నో దృశ్యాలు ఆయన ముందు మసలాయి. ఒక్కొక్కటీ తల్చుకుంటుంటే గుండెను రంపం పెట్టి కోసినట్లనిపించింది. తానెన్ని పాపాలు చేశాడు? అవన్నీ ఊరికనే పోతాయా? ఛ - ఏమి ప్రభుత్వం! ఏం దొరతనం?

ఉరిత్రాడు ఆయన ముందు వ్రేలాడింది. కేక పెడదామనుకున్నారు. గొంతు పెకలలేదు. ఎవరో

గొంతును పట్టి నొక్కుతున్నట్లు అనిపించింది. ఉరి(తాడు ఎలా తప్పాలి? సారంగపాణి. అతడు తనమాట వింటాడా? ఎందుకు వినాలి? ఎందుకు వినడూ? తాను అతనికి చేసిన మేలేమి? బెత్తంతో బాదాడు. సంగీతం వినిపించి తనను ఆనందపర్చాడు. మంజరిని బ్రతికించాడు. ప్రతిఫలంగా తాయారునా కట్టడం? ప్రతిఫలంగా కాదు, తనకు ప్రాణభిక్ష పెట్టమని వేడుకుంటాడు. వినడా? వినడా? ఎందుకు వినడూ? వింటాడు. వినకుంటే ఎక్కడ బ్రతుకుతాడు? అసలు బ్రతుకుతాడా?

ఆలోచనలలోనే కోడి కూసింది. కోడికూత కోసరమే ఎదురు చూస్తున్నారు రెడ్డిగారు. చీకటిలోనే బయలుదేరారు పాణి గదికి. పాణి ఇంకా నిద్ర లేవలేదు. తలుపు తట్టారు రెడ్డిగారు. తలుపు తెరిచి చూస్తే రెడ్డిగారు! క్షణం చకితుడై చూచి నమస్కరించాడు పాణి. ప్రతినమస్కారం చేసి లోపలికి వచ్చి కూర్చున్నారు రెడ్డిగారు.

"పంతులూ..... నీతో ఒక మద్దతు[259] కావాలి."

"నాతోనా? మీలాంటి వారికి నేనేం సహాయం చేయగలనండీ?"

"చేయలేస్తె చేస్తవా?"

"ఇన్నాళ్ళనుంచీ సుఖంగా మీ పంచన ఉంటున్నాను. చేతనయినప్పుడు సహాయం చేయకుంటే కృతఘ్నుడ్ని అవుతాను కదండీ!"

"కృతఘ్నుని మాంసం కుక్కలు తినవని సామెత ఉన్నది ఎరికేనా?"

"తెలుసండీ!"

"అయితే తప్పక చేస్తనంటవా?"

"చేస్తానండీ. "విశ్వాసం లేదాండి నామీద. చేస్తానన్నాగా చెప్పండి."

"అచ్చా ఇను. పీరిగాణ్ణి చంపాల్నని కొట్టలేదు. అయుప్పట్టున తగిలి వచ్చిండు."

కొట్టాలని కొట్టలేదంటాడు? తాను చూస్తుండగానే నిండు ప్రాణాన్ని పొట్టన పెట్టుకున్నాడు. ఎన్నాళ్ళనుంచి అంటున్నాడు పీరిగాడు దొరికితే చావగొడతానని! ఇప్పుడేమో ఈ మాటలంటున్నాడు అనుకున్నాడు పాణి.

'చాకలి నా కొడుకు చావు నా ప్రాణం మీది కొచ్చెటట్లున్నది.'

ప్రాణం - చాకలిది చౌకైంది, దొరది ప్రియమైందీ ఉంటుందా?

"నిజామొద్దీన్ ఖతల్ అయిందని పోలీసులకు ఇత్తలా ఇస్తే నన్ను గిరిఫ్తార్[260] చేస్తరు. ముకద్దను[261] అయితది, ఉరి పడ్తది. నిజామొద్దీను తఖల్ను గురించి పోలీసులకు ఇత్తలా చేయకుంటే ముకద్దమ నడ్వదు. నిజామొద్దీను కరణం చేతులున్నడు. కరణం కాడికిపోతే ఒక్క కోర్కె కోరిండు, నీ చేతులున్నది అది తీరస్తవా?'

"చెప్పండి."

"కరణానికి శాన జమీనున్నది. ఊళ్ళ పట్వారి గిరి ఉన్నది. నువ్వు తాయార్ను పెండ్లిచేస్కోవాలే. అయన్ని నీకొస్తయి."

గుండె ఆగినంత పనయింది పాణికి. రెడ్డిగారు సయితం జవాబు కోసం నిరీక్షించసాగారు. పాణికి ఇదంతా ఒక నాటకంగా కనిపించింది. తానీ ఊరికి వచ్చినప్పట్నుంచి-ఇందును గురించి వల పన్నుతున్నాడు కరణం. ఇప్పుడీ రీతిగా తనను ఇరికించాలని చూస్తున్నాడనుకొన్నాడు. అందుకే ఆస్తి అనే ఎరవేస్తున్నాడు అనుకున్నాడు.

పన్నుతున్నాడు కరణం. ఇప్పుడీ రీతిగా తనను ఇరికించాలని చూస్తున్నాడనుకొన్నాడు. అందుకే ఆస్తి అనే ఎరవేస్తున్నాడు అనుకున్నాడు.

"దొరవారూ! పెళ్ళి జీవితానికి సంబంధించినది. ప్రేమలేంది, ప్రేమించనిది పెళ్ళి సాధ్యపడదు. ప్రేమ శరీరానికి సంబంధించినది కాదు. అది మానసికం అయింది. మనసులు కలవంది పెళ్ళి సాధ్యపడదు. ప్రేమకూ రూపానికీ సంబంధం లేదు. ఒక్కొక్కరి దగ్గర ఒక్కొక్క రకమయిన ఆకర్షణ ఉంటుంది. అందమైన భార్యల్ని వదిలి అనాకారులైన వారి వెంటపడి తమ సర్వస్వం అర్పించే వారుంటారు. వారిలో వారికేదో ఆకర్షణ కనిపిస్తుంది. అలాగే మానవేతరములయిన సాహిత్యాదుల్ని ప్రేమించి జీవితాలను వాటికొరకై అర్పించినవారున్నారు. వారలా ఎందుకు చేస్తున్నారో వారి మనసుకు మాత్రమే తెలుస్తుంది. మరొకరికి తెలియదు. ప్రేమ వైయక్తికమైంది. సంఘంతోనూ, రాజకీయాలతోనూ దానికి అట్టే సంబంధం లేదు. ఎవరు ఎవరిని ఆకర్షిస్తారో చెప్పలేం, మనకు ఎంత అధికారం ఉన్నప్పటికీ సూర్యుడు లేనప్పుడు తామరలను వికసింపజేయలేం. చకోరం వెన్నెలకోసం నిరీక్షిస్తూ ఉంటుంది కాని అన్యం భక్షించదు. ప్రేమకోసం రాజ్యాలను త్యజించినవారున్నారు.

"నాకు తాయారులో ఏరకమైన ఆకర్షణా కనిపించడం లేదు. ఆమెలో వెర్రి కామం ఉంది. అసలామె పుటకే పాపఫలం. అలాంటిదాన్ని నేనెలా ప్రేమించేది? ఎలా పెండ్లి చేసుకొనేది? ఇక ఆస్తి విషయం. విషం తింటే లక్షరూపాయలిస్తామంటే తింటామా? అలాగే నాకు ఆస్తి అవసరం లేదు. కావలసింది ప్రశాంతమూ, ఆనందమయమూ అయిన జీవితం. అది నాకు తాయారు వలన లభించదు. కాబట్టి క్షమించాలి. నేనామెను పెళ్ళాడలేను" అన్నాడు పాణి.

'పంతులూ! తాయారు కోసం కాదు, నా ప్రాణం కాపాడటానికి పెండ్లిచేసుకో. ఇందనుక నేనెవరినీ ఏదీ అడగలే. నిన్ను చేతులు చాచి అడుగుతున్న, కాదనకు' అని చేతులు పట్టుకొని' ఇవి చేతులు కావు, కాళ్ళనుకో' అన్నాడు.

పాణికి అసహ్యం అనిపించింది. ఒకసారి కరణం సరిగ్గా ఇలాగే బ్రతిమాలాడు. అప్పుడతడున్న పరిస్థితిలో ఇప్పుడితడున్నాడు. అప్పుడు చేతులు పట్టుకున్న కరణమే ఇప్పుడు తనను మొదలంటూ నాశనం చెయ్యటానికి చూస్తున్నాడు. ఇప్పుడు రెడ్డిగారి వంతు వచ్చింది అనుకున్నాడు పాణి.

'ఈ పెళ్ళికాక నా ప్రాణం ఇమ్మన్నా ఇస్తాను' అన్నాడు పాణి కాస్త కరుకుగానే.

"నీ ప్రాణం చిల్లిగవ్వకు కొరగాదు. నే నేం చేసుకోను?"

"నాకు ఉన్నది అదొక్కటే."

"అయితే తాయార్ను చేసుకోవు?"

"అవును. చేసుకోను."

"ఆలోచించి అంటున్నావా?" గట్టిగా అడిగారు రెడ్డిగారు.

"అవును."

"అయితే ఎళ్ళు నా ఇంట్లనుంచి." గర్జించారు రెడ్డిగారు. ముఖం ఎర్రబారింది. వణికిపోయారు.

"మంచిది" అని కండువా వేసుకొని ఫిడేలు పెట్టె తీసుకొని "ఇన్నాళ్ళూ మీరు నాకు ఆశ్రయం ఇచ్చారు. కృతజ్ఞుణ్ణి. ఇప్పుడు మీరు వెళ్ళమంటున్నారు. వెళుతున్నాను. కాని, మంజరి......"

మాట పూర్తికాకముందే చెంప చెళ్ళుమంది. 'మొనగాడు నీతులు చెప్పుతాండు' అని చక చక మెట్లు దిగి వెళ్ళిపోయారు రెడ్డిగారు.

చెంప చెళ్ళుమనేవరకు కళ్ళనీళ్ళు దుమికాయి పాణికి. చేత్తో చెంపచూసుకున్నాడు. పొంగింది. గది గడపదాటి బంగళాలోనికి దిగి మెట్లవైపు చూశాడు, ఎవరైనా కనిపిస్తారేమోనని. ఎవరూ కనిపించలేదు. బయటి మెట్లు దిగి వెళ్ళిపోయాడు. గేటు దగ్గరికి వెళితే లోనికి ప్రవేశిస్తున్న ఎంకటి కనిపించాడు. ఏదో అడుగుదామనుకున్నాడు పాణిని. కాని అతనిలోని దు:ఖం చూచి అడగలేదు.

పాణి గేటు దాటాడు. ఒక్కసారి వెనక్కి తిరిగి చూచాడు తాను. ఇన్నాళ్ళనుంచీ ఉన్న గది కనిపించింది. జీవితానికి సంబంధించిన అనేక దృశ్యాలూ, వృత్తాంతాలూ గుర్తుకువచ్చాయి. అతను ఒక నిట్టూర్పు విడిచి సాగిపోయాడు. అతడు నేరుగా నారయ్య ఇంటికి వెళ్ళాడు. పాణిని చూచి నారయ్య చకితుడై నిలిచిపోయాడు. " ఏం పంతులూ? ఇయ్యాలప్పుడు ఇట్లవచ్చినవు?" అనడిగాడు.

"సీత ఉందా?" అంటూ అతని మాటకై ఎదురుచూడకుండానే అతణ్ణి తప్పుకొని లోనికి ప్రవేశించి "సీతా!" అని పిలిచాడు పాణి.

నారయ్యకేమీ అర్థంగాక వెనక్కు మళ్ళి పాణి దగ్గరకు చేరి 'ఏం పంతులూ, ఏమైంది?' అని అడిగాడు. ఈలోగా సీతా, సీత తల్లీ వచ్చారు.

పాణి జరిగినదంతా సంక్షిప్తంగా చెప్పేశాడు.

అటూ ఇటూ చూచి చెవులో చెపుతున్నంత మెల్లగా 'కరణం శాన బద్మాషు[262] నా తాన మళ్ళ మూడు నూర్లు కాజేసిండు. అడుగుతే జమీను లంబాడోల్ల పేరనే ఉన్నది, నన్నేం చేయమంటవు అన్నడు. లంబాడోళ్ళ తోటి జగడం పెట్టుకుంటే ఎక్కడ దొర్కపట్టుక చంపుతరో అని జమీను కూడా ఇడిచిన, అన్నాడు నారయ్య.

పాణి కోపం పొంగింది. దిగమింగాడు. "ఇంత పాపం ఊరికేనే పోతుందా?" అన్నాడు నిట్టూర్చి. తరువాత "సీతా! నువ్వు నన్ను మామా అని పిలిచావు. ఇప్పుడు నీ మామయ్య వెళ్ళిపోతున్నాడమ్మా! నువ్వు అత్తవారింట్లో వున్నా, తల్లిగారింట్లో వున్నా సంగీతం మరవకు. ఈ మామను మరిచిపోకు. కోడలుకు ఇవ్వడానికి నా దగ్గర ఏమీలేదు తల్లీ! నా సర్వస్వం ఇదిగో, ఈ ఫిడేలే" అని ఫిడేలుపెట్టెమూత తీసి అందులో ఉన్న ఫోటోలు జేబులో పెట్టుకొని "తల్లీ! నీ మామ తరపున బహుమతి" అని సీత కందించాడు. కళ్ళు చెమ్మగిల్లాయి.

"మామయ్యా! వెళ్ళిపోతున్నావా?" అన్నది సీత. గొంతు జీరవోయింది. విధి లేనట్లుగా ఫిడేలు అందుకుంది.

"అక్కయ్యా, వస్తానమ్మా! ఈ తమ్ముణ్ణి మరిచిపోకేం" అన్నాడు పాణి.

నారయ్య భార్య అశ్రువులు రాల్చింది.

"నారయ్యగారూ! వస్తాను. నే నేదయినా పొరపాట్లు గానీ, తప్పులు గాని చేస్తే క్షమించండి" అన్నాడు పాణి. టపాటపా కన్నీరు రాలింది. వెనక్కు తిరిగి సాగిపోతున్నాడు.

"అంతా కర్మ నాయనా!" అన్నది గుమ్మందాకా సాగనంపడానికి వచ్చిన సీత తల్లి. పాణి మలుపు తిరగేవరకూ చూచారు ముగ్గురూ.

"ఎంత మంచివాడు!" అనే మాట ముగ్గురూ సుమారు ఒకేసారి అనుకుంటూ లోపలికి వెళ్ళిపోయారు.

పాణి కరణం ఇంటికి వెళ్ళాడు. " ఏమో ఇంత పొద్దున వచ్చినవూ" కరణం విజయగర్వం వ్యక్తపరుస్తూ అడిగాడు.

'తాయారు లేచిందా?'

లోపలికి వెళ్ళి చూచాడు. మేల్కొనే మంచం మీద పడుకొని ఉంది తాయారు. పాణిని చూచి లేచి కూర్చుంటూ " రా పంతులూ" అంది చిరునవ్వు నవ్వుతూ. ఆ నవ్వులో ఎన్నో గంభీరార్థాలున్నాయి. అవి ఆమెకూ తెలుసు, పాణికీ తెలుసు.

పాణి తాయారు పక్కనే కూర్చున్నాడు మంచంమీద.

"తాయారూ! నీవు నన్ను ప్రేమించావు. అందుకు కృతజ్ఞుణ్ణి. ఐతే ఎందుకో చెప్పలేను కాని, నువ్వంటే నాకు ప్రేమ కలగటం లేదు. నీ ఆస్తినంతా ఇస్తానన్నావు. అంతకంటే త్యాగం ఏం కావాలి? కాని నాకు ఆస్తితో పనిలేదు. నిన్ను కపటంగా ప్రేమించలేను. ముందు పెళ్ళాడి తర్వాత నీజీవితం నా జీవితం రెండూ దుఃఖమయాలు చేయటం నా కిష్టం లేదు. నీ మాట నెగ్గింది." అని జరిగినదంతా సంక్షిప్తంగా చెప్పాడు. "తాయారూ! భార్యగా నిన్ను ప్రేమించలేను. కాని మరొక విధంగా ప్రేమించగలను. ఈ ఊళ్ళోనే నన్నొకరు అన్నను చేసుకున్నారు. ఒకరు మామను చేసుకున్నారు. నేను నిన్ను చెల్లెల్ని చేసుకుంటున్నాను. చెల్లీ! యీ అన్నను మరిచిపోకు. ఈ అన్న ఎలా వచ్చాడో అలా వెళ్ళిపోతున్నాడు. ఇక్కడకు రాకముందు నేను నీకు తెలియదు కాని, నేను వెళ్ళిపోయిన తరువాత నన్ను మరిచిపోకు. నీకు బహుమతిగా ఇవ్వడానికి కూడా దగ్గరేమీ లేదు" అని జేబులోంచి కొన్ని ఫోటోలు తీసి "ఇదిగో, ఇవి నీ ఫోటోలు. ఎక్కడున్నా నీ క్షేమం కోరుతూంటాను. వస్తా" అని లేచి నుంచున్నాడు.

"ఇదే ఆఖరు మాటంటావా?"

"అవును తాయారూ! క్షమించు వెళ్ళివస్తా" అని అడుగు ముందుకు వేస్తే కరణం కనిపించాడు. అతని కళ్ళు చెమ్మగిల్లి ఉన్నాయి.

"పంతులూ! నువ్వు చెప్పిందంత ఇన్న. నువ్వు కలికాలంలో ఉండాల్సినోడివి కావు. దొరెళ్ళకొట్తే వూరొదిలి పోవాల్నా? నువ్వు తాయార్ను పెండ్లి చేసుకోకుంటే మానె మా ఇంట్లనే ఉండు" అన్నాడు కరణం.

'కృతజ్ఞతలు. ఉండలేనండీ' అని దూసుకొని వెళ్ళిపోయాడు పాణి కన్నీరు తుడుచుకుంటూ.

'ఎంత మంచోడు!' అన్నమాట తమకు తెలియకుండానే తండ్రీ కూతురు నోట వెలువడింది.

ఇద్దరూ ఒక్కొక్క ఫోటో చూడసాగారు.

దొర బెత్తం ఎత్తి ఉన్నాడు, పీరిగాడు ఉక్కిరిబిక్కిరయి నోటితో గాలి పీలుస్తున్నాడు.

'చిక్కిండు దొర' అని కేక వేశాడు కరణం.

× × × ×

మామూలుగా ఫలహారపు పళ్ళెం తీసుకెళ్ళింది వనజ పాణి గదికి. పాణి కనిపించలేదు. చొక్కా కనిపించలేదు. చెప్పులు కనిపించలేదు. కమేరా వ్రేలాడుతూంది. స్నానానికి వెళ్ళాడేమో అనుకుంది. చూస్తే ఫిడేలు పెట్టె కనిపించలేదు. గుండె జల్లుమంది. స్నానాల గదికి పరిగెత్తింది. అక్కడా లేదు. తిరిగి వస్తూంటే కనిపించాడు ఎంకటి.

'పంతులు కనిపించాడా?' ఆదుర్దాగా అడిగింది.

"పోయిండు గద!"

"యాడికి?"

"పొద్దున్నే పోయిండు ఫిడేలు పట్టుకొని."

గుండె ఆగినంత పనయింది వనజకు. లిప్తపాటు కళ్ళు చీకట్లు కమ్మాయి. అవయవాలు స్పందనం మానేశాయి.

'వనజమ్మా!' అనే పిలుపు వినిగాని తానింకా జీవించే ఉన్నానని తెల్సుకోలేదు. ఎంకటి చెవులో చెప్పాడు జరిగిందంతా, "దొర చెప్పిండు"అన్నాడు.

"ఆ!" అని మంజరి దగ్గరకు పరిగెత్తింది. మంచం మీద పడి ఉన్న మంజరి కాళ్ళమీదపడి భోరుమని ఏడ్చింది. "అన్న యెల్లి పోయిండు. అన్నయ్యను పిలిపించు" అని ఏడ్చింది.

మంజరికి ఏమీ అర్థం కాలేదు. లేచి కూర్చుంది. "అన్న యెవరు? యాడికి పోయిండు?"

"పంతులెల్లిపోయిండు. పంతుల్ను పిలిపించు."

మంజరి గుండెలో ఫిరంగి పేలింది,

"పంతుల్నీ కన్నెట్ల? ఎప్పుడు పోయిండు-యాడికి పోయిండు? ఎందుకు పోయిండు?" శరవేగంతో అడిగేసింది మంజరి.

"అన్నెట్లనో అటెన్క చెప్పుత. ఎందుకుపోయిండో నా కెరికలే, యెల్లిపోయిండు మల్ల రాకుండ."

అప్పుడుకాని అర్థం కాలేదు మంజరికి.

'మల్లరాకుండా పోయిండా!' మంజరి కళ్ళలోంచి నీళ్ళు దుమికాయి. 'నడుప్ నాయనకాడికి' అని పరిగెత్తింది లేడిలా.

నీరసం ఎక్కడ పోయిందో!

'ఏమమ్మ గిటెందు కొచ్చినవు?' మంచం మీదినుంచి లేస్తూ అడిగాడు రెడ్డిగారు.

"పంతుల్నెల్ల గొట్టినవా?"

"అవు."

"ఎందుకు?"

"అదంత నీకెందుకు?"

"అయితే నేన్చస్త." గట్టిగా అన్నది.

'అదేంది?' కరకుగా అడిగారు.

'పాటలేంది బతకలేను. నాకు చావు దగ్గిరపడ్డది' అని ఏడ్చేసింది మంజరి పెద్దగా.

రెడ్డిగారు మండిపోయారు.

మంజరి మంచంమీద పడిపోయింది స్పృహతప్పి.

రెడ్డిగారు చల్లబడ్డారు. వాస్తవంగా మంజరి మళ్ళీ మనిషి అయిందంటే పాణి పాటవల్లనే. వెళ్ళగొట్టేప్పుడు కోపంలో అది గుర్తుకు రాలేదు. నిజంగా మంజరి చనిపోతుందేమో! పాణిని వెళ్ళగొట్టి తప్పుడువని చేశాననుకున్నారు. నిజంగా ఎంత మంచివాడు! మరెవర్నైనా పాట పాడేవాణ్ణి పిలిపిద్దామనుకున్నారు మంజరిని రక్షించడానికి. కాని, ఆ చుట్టపట్లలో ఎవరూ లేరు. ఉన్నా పాణిలా పాడగలరా? అతని పాట గుండెల్ను కరిగిస్తుంది. సంగీతం రాళ్ళను కరిగిస్తుందని చెప్పాడు.

"పంతులర్రల యీ తస్వీరు దొరికింది" అని పరిగెత్తుకొచ్చి రొప్పుతూనే అందించాడు ఎంకటి.

చచ్చిపడి ఉన్న పీరిగాణ్ణి కాల్తో రెడ్డిగారు తంతున్న ఫోటో అది.

అది చూచి కళ్ళు చీకట్లు కమ్మాయి. ఒళ్ళు తూలింది. చెమటలు పట్టాయి. చేతిలో పటంతో తూలిపోతూ కాళ్ళు అదిమిపట్టి నుంచున్నారు.

పాణి వెళ్ళిపోయాడు. తన గుట్లన్నీ పట్టుకొనిపోయాడు. తనకు ఉరిశిక్ష వేయిస్తాడేమో! అతనికి లోకమంతా తెలుసు. పోలీసులకు చెపితే? తనకు ఉరిశిక్ష....ఉరి...ఉరి....

"ఎంకటీ!" అది పిలుపు కాదు, గర్జన.

'మదార్సాబ్‌ను పిలువు."

"మంచిద్దొరా!"

క్షణంలో మదార్సాబ్ వచ్చేశాడు. "పంతులు పరారయ్యిండు. పంతుల్ను పోనియ్యొద్దు, పట్కరావాలే. నాల్గేపుల మనుషుల్ను తరుము, రానని తక్రార్[263] చేసిండనుకో....." అని కళ్ళతో చూచారు. 'ఎరికైందా?' అన్నారు.

"అచ్ఛా సాబ్!"

"జల్ది కావాలే."

" జీ హుజూర్" అని వెళ్ళిపోయాడు మదార్సాబు.

అప్పుడుగాని మంజరి గుర్తుకు రాలేదు రెడ్డిగారికి. మంజరిదగ్గరికి వెళితే కలికం వేస్తున్నాడు వైద్యుడు. మంజరికి స్పృహవస్తే పక్కనే కూర్చొని తలనిమురుతూ "తల్లీ! పంతులుకోసం మనుషుల్ను పంపిన. యాడున్న పట్టుకరమ్మన్న, పంతులొస్తడు. పాట పాడ్తడు" అన్నారు రెడ్డిగారు.

మంజరి గుండెలో ఆశాలత చిగురించింది. కళ్ళలో ఆశ కనిపించింది. లేచి వెళ్ళి తనగదిలో పడుకుంది. వనజ తన కథనంతా పూసగుచ్చినట్లు చెప్పింది మంజరికి. అనుకోకుండానే మంజరి కళ్ళవెంట కన్నీరు జారింది.

"వనజా! నిన్ను తెల్సుకోలేదు. నువ్వు పాణిని ప్రేమిస్తున్న వనుకున్న. నాకు అడ్డం వస్తున్న వనుకున్న. ఆ కోపంతోనే చెంపమీద కొట్టిన. పంతులు ఎంత మంచోడు!" అన్నది.

దాసి సరళ వచ్చింది. పాణి వెళ్ళిపోవడానికి గల కారణం, దొర వెళ్ళకొట్టడం వగైరా కథంతా చెప్పింది.

అది విని దుఃఖం పొర్లి వచ్చింది మంజరికి. " నేనెంత పాపిష్టిదాన్ని?" అని ఏడ్చేసింది.

రెడ్డిగారు రావడం చూచి వనజ, సరళ లేచి నుంచున్నారు. రెడ్డిగారు మంచం మీద కూర్చొని "ఏడ్వకు తల్లీ, మళ్ళీ మూర్ఛవస్తది" అన్నారు తల నిమురుతూ. కొంతసేపు అలా కూచుని అవీ ఇవీ చెప్పి ఓదార్చారు. ఆ తరువాత వెళ్ళిపోయారు.

మరొక దాసీది వచ్చి పాణి నారయ్య ఇంటికి వెళ్ళిన వృత్తాంతమూ, కరణం ఇంటికి వెళ్ళడమూ, కరణం ఉండమన్నా ఉండకుండా వెళ్ళిపోవడమూ వగైరానుగూర్చి పాణి మంచితనాన్ని తెలియజేసేటట్లు చిలువల పలువలు కల్పించి చెప్పింది. అది వింటూనే మంజరి హృదయం దుఃఖంతో నిండసాగింది. చివరకు హృదయం నిండి కళ్ళద్వారా ప్రవహించింది. పెద్దగా ఏడ్చి స్పృహ తప్పి పడిపోయింది.

రెడ్డిగారు గదిలోకివెళ్ళి ఆలోచిస్తున్నారు. మంజరి జబ్బేమిటి? వైద్యునికే తెలియడంలేదు. పాణిదగ్గర ఏమైనా మంత్రం ఉందా? ఏమో, మంత్రాలు కూడా వచ్చునేమో అతనికి! మంజరి విలపించేది నిజంగా పాణి పాట కోసరమేనా? పాణి కోసం కాదు కదా? పాణి కోసరమా? ఏమో? మాయలమారి యేమైనా చేశాడేమో? ఛ......తన మంజరి అలాంటిది కాదు. కాదు. నిజమే. పాణి మంత్రం పారిందేమో! విరుగుడు చేయిస్తే? విరుగుడు....

పీరిగాని హత్య! అవును. అది ముఖ్యం. గోరుచుట్టుమీద రోకటి పోటులా అయింది. ఏం చేయాలి? ఏం చేయాలి? మెదడు చీల్చుకొని ఆలోచించసాగారు. కరణం రిపోర్టు చేశాడేమో! చేస్తే పోలీసు బలం వస్తుంది. బేడీలు పడ్తాయి. డబ్బు- డబ్బు తింటాడా అమీను? డబ్బుతిని మోసం చేస్తే తానేం చేయగలడు?

ఎలా? ఎలా?? పీరిగాని పెండ్లాం పీరి....అవును.......అదే మంచిది. అదే తన భర్త బ్రతికి ఉన్నాడంటే పోలీసేం చేస్తుంది? ఊళ్ళోంచి సాక్ష్యం రాకుండా చూడాలి. డబ్బు చిమ్మాలి. తాను మంచివాడు అనిపించుకోవాలి.

గుళ్ళో సంతర్పణలు.

ఇంకా-

పేదలకు బట్టలు దానం చేయాలి.

ఇంకా-

పీరికి భూమి ఇవ్వాలి.

ఎంకటిని పిలిచి పీరిని పిలిపించాడు. దుఃఖం మూర్తీభవించిందా అన్నట్లుంది ఆమె. వచ్చి కాళ్ళమీద పడి ఏడ్చింది -"దొరా, పోరలు దిక్కులేనోండ్లయిర్రు ' అని. రెడ్డిగారు కన్నీరు రాల్చారు. జనం అది చూచి ఆశ్చర్యపోయారు. వారెన్నడూ రెడ్డిగారి కన్నీరు చూడలేదు.

"పీరి! ఇదిగో పీరిగాడు చచ్చిండు. అందరం పొయేటోల్లమే. ఇయ్యాల వాడు. రేపు నేను. దుఃఖపడకు, పిల్లల్ను తీసుకొచ్చి గడిల్నె ఉండు. పీరిగాని దినవారాలు బాగచేయించు. ఎంత పైకం కావాల్నో తీస్కపో" అని ఓదార్చాడు.

"దొరా! నీ బాంచదాన్ని, దరమదొరలు, దేవుడిట్ల రాసిండు మొకాన, మీరేం చేస్తరుండి" అని ఏడుస్తూనే అన్నది.

ఏడుస్తూనే వెళ్ళిపోయింది.

సాయంకాలానికి తిరిగి వచ్చాడు మదార్సాబ్. దొరవారి గదిలోకి వెళ్ళి చంకలో దాచితెచ్చిన కత్తి చూపించాడు రెడ్డిగారికి. అది రక్తరంజితమై వుంది.

ఆ రక్తం రెడ్డిగారి కళ్ళలో చేరింది.

"రా నన్నడులే."

"అవు దొర."

"హు. సరేగాని చీమకు తెల్వొద్దు పో" అని డబ్బు ఇచ్చి పంపేశారు.

పంతులు - పంతుల్ను కూడా చంపించాడా తాను? పంతులేం చేశాడు తనకు? పంతులు కీడు చేశాడు? స్తంభాన్ని ఆనుకొని నుంచున్న పాణి....పాట పాడుతున్న పాణి....ఫోటోలు తీస్తున్న పాణి - బెత్తపు దెబ్బలు తిన్న పాణి......చెంపదెబ్బతిని వెళ్ళిపోతున్న పాణి.

ఎంత దృఢనిశ్చయంగలవాడు. ఆస్తి, కరణీకం ఇస్తానన్నా పెళ్ళికి అంగీకరించలేదు. తరువాత తను వెళ్ళగొడ్తానని ప్రతినబూనిన తాయారు దగ్గరికి సైతం వెళ్ళాడు. కరణం ఉండమన్నా ఉండకుండా వెళ్ళి పోయాడు. తనను ఇరికించ దల్చుకుంటే కరణం అండ ఇవ్వకపోయాడా? కాదు. అతడలా అనుకోలేదు. అనవసరంగా చంపించాడా? అవును అవును నిండు ప్రాణం. అదీ విద్వాంసుడు! తనకు మేలు చేసిన వాడు! తానెంత క్రూరుడు? ఎందుకలా చేశాడు? తన రక్షకు, తన కోసం ఎందరి ప్రాణాలు తీస్తాడు?

పీరిగాడు! " దొర చంపకుండ్రి పిల్లల్గలోణ్ణి" పీరిగాని మాటలు పదే పదే వినరాసాగేయి. పీరిగాడు కర్రపట్టుకొని తనమీదికి వస్తున్నాడు. ఇంకొకడు - ఇంకొకడు అదెవరు? పాణి బాకు పట్టుకొని వస్తున్నాడు! ఒకవైపు పీరిగాడు, మరొకవైపు పాణి, ఇద్దరు. మనుషులా? కాదు దయ్యాలు దయ్యాలు! ఓ అని కేకవేతామని నోరుతెరిచారు. మాటరాలేదు. ధ్వని బయటపడలేదు. ఎవరో గొంతు నులుముతున్నారు. మెడపట్టుకొని

చూచుకున్నారు. రెండు చేతులు తాకాయి వేలికి. తన రెండు చేతుల్తో వాటిని తొలగించడానికి ప్రయత్నించారు. ఊపిరిపోతూంది. గాలి అడ్డంలేదు. అతి ప్రయత్నం మీద చేతులు తొలగించారు. కత్తి గొంతులో గుచ్చవచ్చాడెవరో. ఆ అని జరిగారు. కత్తి ముఖాన గుచ్చుకుంది. ముఖాన రక్తం- రక్తం- రక్తం.

కెవ్వుమని కేకపెట్టారు.

గడీ మొత్తం గదికి చేరింది. గదిలో దీపాలు కదలిక లేకుండా వెలుగుతున్నాయి. రెడ్డిగారు మంచంలో పడి తనుస్తున్నారు. ఇందిరమ్మ మంచంమీద కూచుని భుజం మీద చెయ్యి వేసింది. రొప్పుతున్నారు రెడ్డిగారు. ఏదో మాట్లాడాలనుకుంటున్నారు.మాట రావడం లేదు. మాట పెకలించటానికి ప్రయత్నిస్తూ నొసట చెయ్యి పెట్టుకున్నారు. ఇందిరమ్మ నొసట చెయ్యి పెట్టి చూచింది.

కొంతసేపటికి ఆయాసం తగ్గింది. "దొరసానీ, నొసలు తుడువు నెత్తురున్నది" అన్నారు. "నెత్తుర్లేదేమిలేదు" అన్నది ఇందిరమ్మ. "అట్లంటవు" అని నొసలు చేత్తో రాచి చూచుకున్నారు. "ఇదిగో నెత్తురు లేదంటవు" అని చెయ్యి చూపించారు.

ఇందిరమ్మకు రక్తం కనిపించలేదు.

రెడ్డిగారికి కనిపించడం మానలేదు.

వైద్యుడు ఊళ్ళోలేడు.

గదిలోనుంచి ఎవరూ కదల్లేదు.

ఆ రాత్రి ఎవరూ నిద్రపోలేదు.

తెల్లవారి అయ్యవారు వచ్చారు, నాడి చూచారు.

"అన్నగారూ! మొఖాన నెత్తురున్నాది" అని చేత్తో తుడుచుకున్నారు రెడ్డిగారు.

'లేదు గద! ఉన్నదనిపిస్తున్నదా?"

"అన్నగారూ! మొఖాన నెత్తురున్నట్లనిపిస్తుంది. ఎంత తుడిచినా పోదు, ఎవరూ కనపడటం లేదంటరు. ఒంట్ల నెత్తురంత ఒడిసి పోతున్నట్లనిపిస్తుంది. గొంతు పిసికినట్లనిపిస్తది. మాట కూడ పెకలదొక్కొక్కపాలి. పూర[264] కమోరైపోయిన[265] ఒక రాత్రిల. జర మంచి మందియ్యండ్రి."

లక్షణాలేమీ అర్థం కాలేదు అయ్యవారికి. "పైత్యం గున్నది" అని ఆనందభైరవి, పైత్యాంతకం సానమీద రంగరించి తేనె కలిపి నాకించాడు.

"అన్నగారూ! మంజరికెట్లున్నది?"

"నిన్న మంచిగనె ఉండె. ఇవాళ్ళ మళ్ళీ మామూలుగానే ఉన్నది. ఇన్నాళ్ళనుంచి చెప్పగూడదని ఊరుకున్నగాని చిందొర్సానికి రోగమేం లేదు. మనోవ్యాధి పట్టుకున్నది. మనసును బాగుపర్చే మందులు నా దగ్గర లేవు. బస్తీకి తీసుకపోవటం మంచిది."

"ఎవరు తీస్కపోతరు? నేనిట్లయిన. నాకు జర తగ్గితే తీస్కపోత. తగ్గుతదా?" అని కళ్ళల్లోకి చూచారు రెడ్డిగారు.

"తగ్గుతుంది. కాని ఆలస్యం అవుతుంది. మందులకంటే ఎక్కువ దైవచింతనం అవుసరం. విష్ణుసహస్రనామం, ఆదిత్య హృదయం పారాయణం చేయించాలె."

"సరే చూడురి ఎవర్నన్న. చూస్తున్నరుగద. నేనిట్ల పడిపోయిన్నా సంతర్పణ పెట్టించాల్ననుకుంటున్న ఏమంటరు?"

"మంచిది. అన్నదానాన్ని మించిన దానం లేదు. పారాయణానికి అర్చకునికి చెప్పుత."

"ఎట్లనైన చేయిరి. మీ చేతుల్నే ఉన్న. ఊరంతా అన్నాలు పెట్టిస్త అబ్బబ్బ! గొంతుల పొడిచినట్లయింది" అని విలవిల్లాడారు.

చూస్తూ ఉండిపోయాడు వైద్యుడు. ఏమీ చేయలేకపోయాడు.

కొంతసేపు కూర్చొని వెళ్ళిపోయాడు వైద్యుడు - 'చేసిన పాపం ఊరికే పోతుందా?' అని గునుసుకుంటూ.

× × ×

రెడ్డిగారు పెద్దగా డోకుతున్న ధ్వని వినిపిస్తే మంజరి తప్ప గడీ యావత్తూ రెడ్డిగారి గదిలో చేరింది. చూస్తే రక్తం కక్కేసారు రెడ్డిగారు. మరొకసారి 'ఒక్' అని వాంతి చేసుకున్నారు రెడ్డిగారు. ఇందిరమ్మ కణతలు పట్టుకుంది. దోసెడు రక్తం పడింది. డీలాపడి మంచంలో పడిపోయారు రెడ్డిగారు. ఇందిరమ్మ కళ్ళల్లోంచి జలజలా కన్నీరు రాలింది. కూతురట్లా, భర్త ఇట్లా, పంతుల్ని కొట్టడం, వెళ్ళగొట్టడంవల్లనే ఇదంతా జరుగుతూంది అనుకుంది. దేవునివంటివాణ్ణి బాధపెడ్తే దైవం ఇలా అందర్నీ యమయాతనలపాలు చేస్తున్నాడనుకుంది. రెడ్డిగారికి వెచ్చగా కప్పి పడుకోబెట్టి అయ్యవారికోసం ఎదురుచూడసాగింది.

దాసీది ఆ గదిని శుభ్రం చేసింది.

ఊరంతా తెలిసిపోయింది. అయినా ఒక్కరూ రాలేదు చూడ్డానికి.

అయ్యవారు ఆదుర్దాగా వచ్చారు. నాడి పరీక్షించారు. డొక్క చూచారు. గొంతు చూచారు. నుదుటిమీద పట్టీ వేసి, మందు త్రాగించి బైటికి వచ్చి దొరసానిని పిలిచారు.

"ఇద్దరి రోగాలూ నా చెయ్యిదాటి పోయినాయి! బస్తీకి తీసుకవెళ్ళండి. ఆలస్యం మంచిది కాదు. బండి మీద ప్రయాణం చెయ్యరాదు. మేనాలు ఏర్పాటు చేయించండి" అని చెప్పి వెళ్ళిపోయినారు.

ఇందిరమ్మ ప్రాణాలు పైపైనే పోయినాయి.

అయినా స్థైర్యం తెచ్చుకుంది. పెద్దగుమాస్తా పిచ్చయ్యను పిలిపించి మేనాలు ఏర్పాటు చేయించమని చెప్పింది.

పిచ్చయ్య చాల ప్రయత్నించాడు. అయినా మేనా మొయ్యడానికి చాకళ్ళు రాలేదు. డబ్బిస్తామన్నాడు. గింజలిస్తామన్నాడు. కరణం అండ చూచుకొని ఎక్కొట్టారు వారు.

నిన్నటిదాకా కుక్కల్లా పడివున్నవారు నేడు సింహాలై కూర్చున్నారు.

పరిస్థితంతా ఇందిరమ్మకు వివరించి చెప్పి "ఇగ ఊళ్ళో ఉండటం మంచిది కాదు. కచ్చడాలు తయారు చేయించిన, బైల్దేరండి, రాత్రికీడుంటే జర పెమాదమే" అన్నాడు.

ఇందిరమ్మ కంతా అయోమయంగా తోచింది. ఏదో పిచ్చి పిచ్చిగా అనిపించింది. నీరు కారిపోయింది. ప్రభుత్వమే ఇంతేమో ననుకుంది.

ఒక బండ్లో వనజ, మంజరి, మరొక బండ్లో రామారెడ్డిగారు, ఇందిరమ్మ, ఇంకొక బండిలో సామాను, మరొక బండిలో దాసీలూ, పిచ్చయ్యా ఉన్నారు.

బండ్లు బైల్దేరుతుంటే గడీవేపు తేరిపార చూచి "దొరసాని! మళ్ళ ఈ గడీ చూస్తనా?" అన్నారు రామారెడ్డిగారు. గొంతు బొంగురు పోయింది. కన్నీరు కనుకొలుకుల్లో నిలిచింది.

ఇందిరమ్మ కూడా దిగజారిపోయింది. కానీ అయ్యగారు చెప్పిండు బాగైతదని అని ధైర్యం చెప్పింది భర్తకు.

"ఏమో" అన్నారు రెడ్డిగారు నిరాశగా.

నాలుగుబండ్లు సాగిపోతున్నా(యి, నిర్మానుష్యమైన వీదుల్లోంచి. అరమూసిన తలుపుల్లోంచి చూస్తున్న ఆడవారు -

"ఇంత పాపం ఊర్కె పోతాది" అని తలుపులేసుకున్నారు.

## 20

తెల్లవారగానే తిరుచిన్నాల ధ్వని వినిపించింది గ్రామానికి. డవాలు వేసుకొని ఊర్ధ్వపుండ్రాదులు ధరించిన బంట్రోతు అరుగుమీద కూచుని పండ్లు తోముకుంటున్న కరణం వెంకట్రావుగారికి నమస్కరించి, "శ్రీమదాచార్య ఉభయ వేదాంత ప్రవర్తక శ్రీమత్తిరుమల నల్లాన్ చక్రవర్తుల వీర వెంకట లక్ష్మీనరసింహాచార్యుల అయ్యవార్లగార్లు వేంచేసి యున్నారు. వారికి స్వాగతపు టేర్పాట్లు చేయవలసినది" అని అప్పగించాడు. తరచుగా చదివేది కాబట్టే కంఠతః వచ్చేసింది.

ఆ మాట వినగానే కరణంగారు చేతిలోని పుల్ల పారేసి చెప్పులు విడిచి తిరుచిన్నాల ధ్వని వచ్చినవైపు తిరిగి రెండు చేతులూ జోడించి నమస్కరించి "క్షణంల అన్ని ఇంతజాములు చేయిస్తనని అయ్యగారికి విన్నవించు" అని బంట్రోతును పంపి 'ఒరే పుల్లిగా! గురువులో రొచ్చిన్రురా, చప్పుళాళ్ళను పట్కరా" అని ఆదేశించి వాణ్ణి పంపి లోనికి వెళ్ళి "తాయారు! గురువులొరొచ్చిన్రు. వంటిల్లు అలికించి ముగ్గులు పెట్టించు. వంటింటి ముంగలి వాసాలకు మంచాలు అడ్డం పెట్టి షత్రంజీలు[266] కప్పించి చాటు చేయించు. బాయికాడ ఎంగిలి మంగలం లేకుండా చూడాలె. వంటకు బియ్యం పప్పు పెట్టిచ్చు. ఇంట్ల పెరుగున్నదా? లేకుంటే గొల్ల మల్లికాడ నుంచి తెప్పించు. జీతగాండ్లను ఇంటెనక బాయికాడ్కి పోవద్దను. ఇంటి ముంగలి బాయినీళ్ళు చేదుకొనమను. బాయికాడి బర్రెను ముంగల కట్టేపిచ్చు. నాకేమో పూళ్ళ ఎవహారాలు, దొరకూడా లేడు. ఎరికేనా? అందరి గురువులోలె ఏడాదికేడాది కొచ్చేటోరు కారు మన గురువులు. పదేండ్ల కియ్యాలొచ్చిన్రు, మంచిగ అర్సుకోవాలే[267] అని చెప్పి, 'ఒరే, అరే, మల్లిగా! బంకుల్ల ఊడ్చి షత్రంజీ పరుచు. పిచ్చితో చెప్పి తాంబాళం , కంచు చెంబు తెల్లగ తోమించు. గద్దెపీటాడున్నదో దులిపి తీస్కపోవాలె. చప్పుళ్ళాండ్లు వచ్చె టార్కల్ల గియ్యన్ని తయారు గుండాలె. అయ్యగారొచ్చి ఊరి బయటున్నరు" అని గుక్కతిరక్కుండా పురమాయించి వాకిట్లోకొచ్చే వరకు మేళగాండ్లను పిలవడానికి వెళ్ళిన వాడొచ్చి -

"బాజాలోండ్లు[268] వస్తమన్నరుర్రి" అని చెప్పాడు.

"ఇంకెప్పుడూ చస్తరురా! జల్ది[269] రమ్మను. ఆ చాకలోండ్లను పిల్చినావు పల్లకి పట్కారమ్మని?"

"యాడ పిల్చున్నుండి? నాకు చెప్పినారు(ని, కాల్మొక్త."

"మొద్దు ముండ కొడుకులు. చెప్పేడి దేందిరా? గురువులొరొచ్చిన్రంటే పల్లకి రావల్నని ఎరికలే. ఉరుకు. ఈడున్నట్టు పట్కరావలె. ఆలస్యం చేస్తే చంపుతునన్నడు కరణం దొర అని చెప్పు మాస్కారోళ్లేడ చచ్చిన్రురా?" అన్నాడు.

'వస్తాను దొరా' అని వాడు పరిగెత్తాడు.

'మాస్కారోండ్ల మొచ్చినం దొరా' అని దండాలు పెట్టారు నలుగురు.

'యాడ చచ్చిన్రురా! దొర ఊళ్ళ కెళ్ళిపోయిందో లేడో మస్తెక్కిందిరా మీకు. ఉరికి ఊళ్ళోళ్ళకు చెప్పిరా(ని అయ్యగా రొచ్చిన్రని.'

ఆ మాట విని నలుగురూ బయలుదేరారు.

"నలుగురు అటే చస్తా(ర. ఒక్కణ్ణే చావమను, ఈరింక రానేలేదు. ఊడ్చి, చాన్పి చల్లలేదు. లంజ, ఇంతపొద్దెక్కింది. ఇంకా మొగని సిగ్గా శరమా అలికీ[270] కులపోల్లకు.'

ఇంకొకడు పరిగెత్తాడు.

'సన్నాయోళ్ళకు జర మస్తెక్కినట్లున్నది. జల్ది పట్టుకరాపో' అని ఇంకోణ్ణి పంపాడు. ఈరి వచ్చి ఊడుస్తుంటే" లోపలికన్న పొమ్మన వేమే. కంట్ల దుమ్ము పోస్తావ్నవు' అని ముక్కుదగ్గర గుడ్డపెట్టుకొని లోనికి వెళ్ళిపోయాడు కరణం.

బంకుల్లో జంపకానా వేసి, దిండ్లు పెట్టి అంతా సిద్ధంగా ఉంది. లోపలికి వెళ్ళి చూస్తే పెంకుటిల్లు అలికి సిద్ధంగా ఉంది. తన పురమాయింపు ననుసరించి అన్ని సిద్ధంగా ఉన్నాయి. బయట సన్నాయి మేళం వినిపిస్తే కండువా తీసుకొని బయల్దేరుతూ 'తాయారూ! నువ్వస్తవా?' అని అడిగాడు. తాయారు కాలు చూచుకుంది. నడవలేదనే విషయం గుర్తుకు తెచ్చుకొని "కచ్చడంలోరా" అని చెప్పి "కచ్చడం తయ్యారు చెయ్యిరా" అని ఒకనికి పురామాయించాడు.

వీధిలో సన్నాయి మ్రోగుతుంది. జనం చాలమంది కూడారు. ముందు మేళాలు, వెనుక కంచుచెంబుతో నీళ్ళు పళ్ళెం పట్టుకొని ఈరి, ఆవిడ వెనుక కరణమూ, అతని వెనుక జనమూ, జనం వెనక కచ్చడపు బండిలో తాయారూ బయలుదేరారు.

గురువులవారి బండి దగ్గరికివచ్చి ఆగిపోయారూ మేళాలవాళ్ళు. పూర్ణకుంభం ముందుంచుకొని బండి దగ్గరికి వెళ్ళాడు కరణం. ఆచార్లు వారికి చేయి అందించి బండి దింపాడు.

పచ్చని పుష్టిగల దేహం, నున్నని తలా, ద్వాదశోర్ధ్వ పుండ్రాలూ చక్కగా ఉన్నారు స్వామి.

కరణం వారిని గద్దెమీద వేంచేపు చేయించారు. రెండు కాళ్ళుపట్టుకొని సాష్టాంగ దండ ప్రమాణం చేశారు. తాయారు దండం పెట్టడానికి ముందుకువచ్చి 'కుందనమునంటి' గురువుగారి రూపం చూచి క్షణం చలించింది. కాళ్ళు పట్టుకొని మోకరిల్లి ప్రణామ మాచరించింది. 'శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు' అని దీవించారు ఆచార్యులవారు-తలమీద చేయి ఉంచి. తరువాత అంతా దండాలు పెట్టారు. అందర్నీ దీవించారు స్వామి. గురువుగారి పాదాలు పళ్ళెంలో పెట్టి తాయారు నీరుపోస్తుంటే పాద ప్రక్షాళనం చేశాడు కరణం. ఆ నీళ్ళు ముందు తన నెత్తినా, తరువాత తాయారు నెత్తినా, ఆ తరువాత అందరి నెత్తులపైనా చల్లాడు. తిరుచిన్నాలు మోగాయి. గురువుగారు పల్లకీ ఎక్కారు. కరణం సైతంగా పల్లకీ మోశారు జనం.

తాయారు మనసులో గురువుగారి విగ్రహం వెలిసింది. ఆమె కచ్చడంలో వెనుక వచ్చింది.

ఆవిడ మనసు పల్లకీలో ప్రయాణం చేసింది.

మేళాలతో గురువుగారిని కరణం ఇంటికి తీసికెళ్ళారు. బంకుల్లో ఏర్పాటు చేయబడిన ఆసనంమీద గురువుగారిని ఆసీనుల్ని చేసి వారి ముందు విసనకర్రతో విసురుతూ కరణం కూర్చున్నాడు. వచ్చిన జనం కూడా యధాస్థానాలలో కూర్చున్నారు. తల్పుపు పక్కన చిరుచాప పర్చుకొని తాయారు కూర్చుంది. సన్నిధి స్వామి వంట ఏర్పాటు చేస్తున్నారు.

గురువులవారు శ్రీ సూక్తి వివరించారు:

"భక్త జనులారా! మనకున్న ఈ జీవితమును, ఆస్తియు, విజ్ఞానమును భగవంతుడు ప్రసాదించినవి. కావున వానిని భగవత్ప్రీతి కొరకే వినియోగించవలెను. భగవంతుడనగా అఘటన ఘటనా సమర్థుడు. సకల చరాచర ప్రపంచమునకు ప్రభువు, భక్తి జనరంజకుడును అయిన శ్రీమన్నారాయణమూర్తి: ఆయన నెట్లు ప్రసన్నుని చేయవలెననిన భాగవతులను ప్రసన్నుల చేయుటవలన, కుమారుని ఆనందమును జూచి సంతసించు తండ్రివలే తనవారైన భాగవతుల ప్రసన్నతను జూచి, శ్రీమన్నారాయణుడు ప్రసన్నుండగును. శ్రీ మహావిష్ణువే అట్లు చేసి చూపినారు.

"సాక్షాత్ శ్రీమన్నారాయణుని అవతారమైన శ్రీరామచంద్ర మూర్తిని అరణ్యముల కేగవలసినదని

కైక ఆజ్ఞాపించగా ప్రసన్నుడై అరణ్యముల కేగుటకు సిద్ధపడినారు. ఏలకో తెలియునా? అరణ్యములందు వసించి కందమూలాదులు భక్షించి, భగవన్నామ స్మరణమునే జీవయాత్ర సాగించు మహర్షులైన భాగవతోత్తముల సేవించుటకు. కావున భాగవతోత్తములను సేవించవలెను. వారు ప్రత్యక్షదైవము.

"వారి నెట్లు సేవించవలెననిన - శాస్త్రములు చదువ నవసరములేదు. శాస్త్రరీత్యా వారిని సేవించవలసిన పనిలేదు. వారిని భక్తితో సేవించవలెను. నది పొంగి ప్రవహించినప్పుడు ఏటిగట్లను సహితము లెక్కచేయక పారినట్లుగా భక్తి ఉల్బణమున, భక్తులు శాస్త్రములను పాటించబనిలేదు. అది ఎట్లనః

"లక్ష్మణప్పెరుమాళ్ళు సామాన్యులుకాఎ. వారిది ఆదిశేషావతారము. వారికి అన్ని ధర్మములు తెలియును. అన్నమాట జవదాట రాదను నీతి నాయన ఎరుంగనివారుకారు. అట్లెరింగినవారయ్యు చక్రవర్తితిరుమగనాల్ ఆజ్ఞన పాటించక వారిననుసరించి అరణ్యముల కేగి తమ ఆచార్యులకు కైంకర్యము చేసినారు. ఏ విధమున కైంకర్యము చేసినరనిన?

భవాంస్తు సహవై దేహ్యా గిరిసానుషురమ్యసే
అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చతే॥

'మీరు సీతా పిరాట్టినిగూడి కొండ నెత్తములపై విహరించునపుడు మేలికతో నున్నప్పుడును, నిద్రించియున్నప్పుడును మిమ్ము గూర్చి చేయవలసిన సకల కార్యములను నిర్వర్తింతును' అనుచున్నారు. అట్లే వారు ముందు నడచుచు మార్గము చూపించుటాదిగా కందమూలములు తెచ్చుటవరకు సకల కార్యములు నిర్వర్తించినారు.

'అట్టి భాగవతసేవకు కులగోత్రములతో నిమిత్తములేదు. శబరి అర్పించిన ఎంగిలి పండ్లను స్వామి ఆరగించినారు. విదురుడు భక్తితో పెట్టిన పదార్థములను ఆరగించినాడు శ్రీకృష్ణపరమాత్ముడు. కాన భాగవతసేవ చేసిన ఆత్మ పరిశుద్ధమైన పరమపదము లభించును.'

~~ఈ~~ సూక్తి తరువాత జనులంతా వెళ్ళిపోయారు. గురువులవారిని స్నానానికి లెమ్మన్నాడు కరణం.

'వెంకట్రావు! అమ్మాయికి సమాశ్రయణం అయినట్లు లేదు. చేయించరాదూ?' అన్నారు.

"ముహుర్తం చూడండి స్వామీ" అన్నాడు కరణం.

"సాయంకాలం చెపుతా."

అని చిన్న పంచె తీసుకొని స్నానానికి వెళ్ళిపోయారు గురువులవారు. స్నానంచేసి వచ్చి తుంగచాపమీద కూర్చున్నారు. తిరువణి పెట్టె తెరిచి తిరువణి చేతులో అరగదీస్తుంటే తాయారువచ్చి ముందు కూర్చుంది. తిరుమన్కాపు చేసుకున్నారనేగాని గురువుగారి మనసంతా తాయారుమీదనే ఉంది, కళ్ళు మూసుకొని ధ్యానం చేసింది తాయారునే.

తర్వాత శ్రీపాద తీర్థం పుచ్చుకొని "తాయారూ! దండం సమర్పించు" అన్నారు. ఆమె దండం పెట్టింది. తీర్థం ఉంచుతూ "తాయారూ! నీవు పూర్వజన్మలో గంధర్వాంగనవు కాకుంటే ఇంత అందమూ, ఇంత ఆకర్షణా ఉంటాయా?" అన్నారు.

"స్వామీ! సేవచేయటాన్కి కులం మతంతో పని లేదంటిరి. పతితను ఉద్ధరించిన వారున్నారా స్వామీ?"

"ఆహా! లేకేం? స్వాములు దోషభోగ్యులు. దోషం ఉన్న వస్తువును పరిగ్రహించి పవిత్రం చేయటమే ఆచార్యుల పని. ఇనుమును బంగారం చేయడం కష్టం కాని, బంగారానికి చేయవలసిందేమి? శ్రీరంగం అనే దివ్యక్షేత్రంలో తిరుప్పాణ్యాళ్వార్. . ."

"అట్లనయితే నన్ను స్వీకరిస్తరా స్వామీ?"

"తాయారు! నువ్వు దేవదేవివి."

## 21

"వనజా!"

మద్రాసు సెంట్రల్ స్టేషనులో అప్పుడే రైలు దిగిన వారికి ఆ పిలుపు ఆశ్చర్యం కలిగించింది. అంతా ఒక్కసారి పిలుపు వచ్చినవైపు చూచారు కాని, పరిచిత స్వరూపం ఏదీ కనిపించలేదు. ఫుల్ సూట్లో ఉన్న ఒక వ్యక్తి వారివైపు గబగబా వచ్చి "అంతా వచ్చేశారే?" అన్నాడు.

"పంతులు!" అన్నది వనజ అమాంతంగా కోల్పోయిన ధనం దొరికినట్లు.

"పంతులు!" నీరసంగా కూర్చున్న మంజరి యెగిరి గంతేసింది.

"పంతులు!" మునిగిపోయేవానికి పూచికపుల్ల దొరికినట్లు అంది ఇందిరమ్మ.

"పం . . . తు . . . లు!" సిగ్గుతో కుంచించుకుపోతూ అన్నారు రెడ్డిగారు. పాణి జీవించి ఉన్నందుకు కలిగిన సంతోషం ముఖాన వ్యక్తమైంది.

"దూరం కెల్లి గుర్తుపట్టలే." వనజ అన్నది.

"వేషం మారిందిగా! ఏమిటిదంతా ఇలా వచ్చేశారు? అరే, మంజరి ఎంత మారిపోయింది గుర్తయినా పట్టకుండా!"

ఇందిరమ్మ కన్నీరు రాల్చుతూ జరిగిందంతా సంక్షిప్తంగా తెలియజేసి, "దేవునోలే కన్పడ్డవు చెన్నపట్నంలో" అన్నది.

పాణి రామారెడ్డిగారి దగ్గరికి వెళ్ళి నమస్కరించాడు. తాను చేసిన పాపాలకు పాణి మళ్ళీ తనను కనీసం పలుకరిస్తాడనుకోలేదు. తన రాక్షసత్వం తల్చుకున్నారు. పాణిలోని మానవత్వంతో పోల్చుకున్నారు. కళ్ళు చెమ్మగిల్లాయి. కన్నీరు చెవులదాకా ప్రవహించింది. ప్రతినమస్కారం చేసి జీరవోయిన గొంతుతో "పంతులూ! నా తప్పులు క్ష . . . మిం . . . చు . . ." అని చేతులు జోడించారు.

"అలా అనకండి" అని జేబు రుమాలుతో కన్నీరు తుడిచి, "మీ గడీనుంచి వెళ్ళిరావడంవల్ల చాల మేలు కలిగింది. ఇక్కడికి రాగానే జితేన్‌గారు నన్ను బాగా ప్రోత్సహించారు. అప్పుడే ఒక సినిమా కోసం పాట కూడా రికార్డయింది. ఆయన ఇక్కడే ఉన్నారు. ఢిల్లీకి వెళ్తుంటే సాగనంపడానికి వస్తె మీరు కనిపించారు. ఆయన్ను తీసుకొని వచ్చి పరిచయం చేస్తా" అని వెళ్ళిపోయాడు.

పాణి ఎంత మంచివాడు! తాను చేసిందంతా మరచి ఆత్మీయునిలా పలుకరించాడు. అతడు చెప్పినట్లు వింటే యింతవరకు వచ్చేదే కాదు. కాదేమో? ఎన్ని ఉపకారాలు చేశాడతను తనకు! తాను అతన్ని హత్య చేయించదల్చాడు. చేశానని అన్నాడు మదార్‌సాబ్. ఎంత క్షోభించాడు తాను. బ్రతికి ఉండి తన బాధ ఎంత తీర్చాడు? పీరిగాడు ఇలాగే బ్రతికి వస్తే తన మనసుకు శాంతి కలిగేది! పాణికి తానేం ఉపకారం చేయగలడు? పాణిని చూచి, రోగం దులిపి లేడిలా గంతువేసిన మంజరి కనిపించింది. మంజరి నిచ్చి పెళ్ళిచేస్తే? వనజ నిచ్చి పెళ్ళిచేస్తా నన్నాడే! దాసీదాంతో కులికిన వానికా తన కూతురు నిచ్చేది? అదికాక కులం తెలియదు. గోత్రం తెలియదు, ఎలా మంజరి నిచ్చి పెళ్ళి చేయగలడు? పాణిని తన కులంవారు రెడ్డి ప్రభువుగా గుర్తిస్తారా? మంజరిని పాటలవాని భార్యను చేయడమా? అని ఆలోచిస్తూండగానే జితేన్‌ను తీసుకొని వచ్చేశాడు పాణి. ముందు వనజను పరిచయం చేశాడు పాణి. వనజ తల వంచుకుంది.

"వనజా! నమస్కరించు'.'

రెండు చేతులూ జోడించి నమస్కరించింది.

"వనజ మీ చెల్లెలు కదూ?" అని అడిగాడు జితేన్.

రెడ్డిగారికి ఏమీ అర్థంగాక తేరిపార చూశారు.

"వనజా! నువ్వు దేవతవని చెపుతుంటాడమ్మా మీ అన్నయ్య. అదృష్టవంతురాలవమ్మా! మంచి అన్నయ్యను సంపాదించావు. పాణి మనిషి కాదమ్మా, దేవుడు. రాతిబొమ్మల్ని మనుషుల్ని చేస్తాడమ్మా!" అన్నాడు జితేన్.

మంజరిని పరిచయం చేశాడు పాణి.

"నువ్వు చాల అదృష్టవంతురాలవమ్మా! పాణి నిన్ను తల్చుకోని గడియ లేదనుకో."

మంజరి హృదయం పురివిప్పి నాట్యం చేసింది.

'పాణి మామూలు మనిషి కాడమ్మా! సంగీతంలో ఆయన తుంబురుడు. నారదుడు. సంవత్సరం తిరిగేవరకల్లా లక్షలు సంపాదిస్తాడు. లక్ష లెందుకమ్మా - ఆయన స్పర్శామాత్రంలో మనుషులు దేవతలై పోతారు.'

మంజరి ముఖం సిగ్గుతో ఎర్రవారింది.

తలవంచుకొని పాణి కళ్ళల్లోకి చూచింది గర్వంతో.

చూపులు కలిశాయని వేరే చెప్పనక్కరలేదు.

ఇందిరమ్మను పరిచయం చేసి, రెడ్డిగారిని పరిచయం చేశాడు పాణి.

'తెలుగు మంచిగ మాట్లాడ్తాన్నవు - పేరేమో . . .' అడిగారు రెడ్డిగారు.

"నేను తెలుగువాణ్నేనండి, మాది కోనసీమ. నా పేరు జితేంద్రరావు. ఈ అరవదేశంలో తెలుగు పేరుంటే పచ్చి మంచినీళ్ళు పుట్టవు. అందుకోసం బెంగాలీ పేరులా ఉండాలని 'జితేన్' అని పెట్టుకున్నాను."

"శాన మంచోనోలే ఉన్నవు నాయనా!"

'ఈ సారంగపాణిగారి గాలి తగుల్తే అంతా మంచివాళ్ళయిపోతారండి. సరేగాని, మద్రాసులో ఎక్కడ ఉండటానికి నిశ్చయించుకొన్నారు?'

"నాకీ పట్నం కొత్త. హైదరాబాద్ పోతనంటే చెన్నపట్నం పోతేనే రోగం బాగైతదన్నడు డాక్టరు. అది కూడా మా మంచికే జరిగింది. ఎప్పుడేమైతదో చెప్పలేము కదా! సారంగపాణిగారు కనపడ్డరు. చాలు. ఎక్కణ్ణన్న హోటల్ల దిగుతం.'

"అలా ఎందుకంటారు? పాణిలాంటివారున్నాక మద్రాసంతా మీదేననుకోండి. మాంబళంలో మా ఇల్లుంది - లంకంతది. ప్రస్తుతం ఎవరూ లేరందులో. పాణిగారు అందులోనే ఉంటున్నారు. మీ ఇష్టం వచ్చినంతకాలం ఉండండి. నౌకర్లున్నారు. కారుంది. డ్రైవరుతో చెపుతాను. వాడుకోండి" అని పాణివైపు చూచి, "మీ రెడ్డిగార్ని ఎలా చూసుకుంటావో?" అని "ట్రైను బైల్దేరింది, వస్తా" అని అందరికీ నమస్కరించి పరిగెత్తాడు జితేన్. పాణికూడా పరిగెత్తాడు.

అంతా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

'పట్నంలంత బద్మాషు లుంటరంటరు, ఎంత మంచోళ్ళున్నరూ!' అన్నది ఇందిరమ్మ.

"అంతటా అన్ని తరహాలోళ్ళుంటరు" అన్నారు రామారెడ్డిగారు.

అంతా 'అనందనిలయం' చేరారు.

రెడ్డిగార్ని జనరల్ హాస్పిటల్లో చేర్పించారు.

'గొంతు కేన్సర్' అని చెప్పాడు డాక్టరు.

## 22

సమాశ్రయణానికి సకల ఏర్పాట్లూ జరిగాయి. చుట్టుపట్ల గ్రామాల్నుంచి వైష్ణవులు చాలామంది

వేంచేశారు. అలుకు, ముగ్గు, పందిళ్ళు, తోరణాలు ఏర్పాటైనాయి. వీధిలో సన్నాయి మ్రోగింది. ఇంట్లో అగ్నిహోత్రం వెలిసింది. అగ్నిహోత్రంచుట్టూ వైష్ణవులు కూచుని ఉండగా స్వామివారు విచ్చేసి పీటమీద కూర్చున్నారు. వారి కెదురుగా పీటమీద తాయారు కూర్చుంది. తప్తశంఖచక్రాల్ను ఇరు భుజాలమీదా అంటించారు స్వాములవారు. తరువాత కొత్త కండువా కప్పుకొని తమ పాదాలు పట్టుకోమన్నారు తాయార్ను. ఆవిడ అలా చేయగా తమ మీద కప్పుకున్న కండువా ఆవిడమీద కప్పి తిరుమన్త్రోపదేశం చేయడంతో తాయారు వైష్ణవి అయిపోయింది.

తిరునామారాధన, తీర్థ ప్రసాదములు అయింతర్వాత సాపాట్లు జరిగాయి. ఆ తర్వాత జరిగింది చందన గోష్ఠి

వైష్ణవులంతా వరుసలుగా కూర్చున్నారు. తాయారు పెద్ద వెండిగిన్నెలో చందనం తీసింది. అది పట్టుకొని వెంకట్రావు గోష్ఠికి వచ్చాడు. చందనపు గిన్నె కింద పెట్టి, నడుముకు కండువా చుట్టుకొని ఊదుకడ్డీలు వెలిగించాడు. గిన్నె తీసుకొని ముందు గురువులవారి దగ్గరకు వెళ్ళి గిన్నె కిందపెట్టి, ముందు అతనికి చందనం రాసి, వంటికీ, చేతులకూ చందనం పులిమి పూలమాల మెళ్ళోవేశాడు. తరువాత తాంబూలమూ, సంభావనా సమర్పించి సాష్టాంగ ప్రణామ మాచరించాడు కరణం.

ఒక వైష్ణవుడు తిరునామం ప్రారంభించగా, ఇద్దరు ముగ్గురు కలిసి గొంతెత్తి తిరునామం పాడారు:

"భాగవతార్చన కన్నను మిక్కిలి భాగ్యము లేదమ్మా
ఆగమ సార పదాన్వతంసు అదే గతియనిరమ్మా
శ్రీమహా భాగతార్చనకన్నను మిక్కిలి భాగ్యము లేదమ్మా
అతులిత చరమోపాయపరుల కిదే ఆత్మోజ్జీవనమూ
అతమతి దుర్విషయామి సమాగమ మృతసంజీవనమూ
సతత తదీయారాధన పరులచే సార్థక జీవనమూ
॥శ్రీ మహా॥
రాగముతో శ్రీభాగవతుల పరభాగ్యత కొనియాడీ
భీతగతా శరణాగతులకు మీరే గతియని వేడీ
త్యాగములైహిక భోగములంచు వియోగమునకు నోడీ
బాగుగ నపురోభాగుల దైవ వియోగములతో గూడీ
॥శ్రీ మహా॥

అలా అందరికీ చందనం సమర్పించాడు వెంకట్రావు. భాగవత బృందానికి సాష్టాంగ దండ ప్రణామ మాచరించాడు. ఒక స్వామి కరణాన్ని కూర్చుండబెట్టి చందనం ఉంచాడు. తాయారువచ్చి భాగవతోత్తములకు మంగళహారతి పట్టగా ఒక స్వామి 'అంగనలార, భాగవతోత్తములకు మంగళమనరమ్మా' అని మంగళహారతి పాడాడు. అంతటితో కార్యక్రమం ముగిసింది.

దీపాలు గూళ్ళలో పెట్టేవరకు ఇల్లంతా ఖాళీ అయింది. పెళ్ళి తరువాత ఇల్లువలె బావురుమంది. భోజనాలై అంతా పడుకున్నారు.

ఒక రాత్రి మెలకువ వచ్చింది కరణంకి. పశువులకు మేత చూడ్డానికి బయలుదేరాడు. పక్కగదిలోని దృశ్యంచూచి 'దగా అంతా దగా' అని కేకవేశాడు. తండ్రినిచూచి తాయారు పక్కకు తప్పుకొని నుంచుంది.

గురువుగారు తెల్లబోయారు. హ హ హ హ-దగా, అంతా దగా, మోసం, అని గురువుగారి మీదకి లఘించాడు కరణం రక్కాడు, కొట్టాడు. ఆచార్యులవారూ, తాయారు కలిసి కరణాన్ని చావబాది లాక్కుపోయి వీధిలో పారేశారు. దభేలుమని తలుపువేసి గడియ వేసుకున్నారు నవదంపతులు.

కరణం లేచి, "హ హ హ హ- దగా, అంతా దగా" అని గంతులు వేయసాగాడు.

"హ హ హ హ-దగా, అంత దగా" అని కేకలువేస్తూ అక్కడికి వచ్చి గంతులు వేయసాగింది మంగమ్మ.

"హ హ హ హ హ - దగా, అంత దగా" అని భార్యభర్త లిరువురూ చెట్టపట్టాలు పట్టుకొని ఎగిరారు.

వెన్నెల విరిసింది.

## 23

ఊరినుంచి ఉత్తరం వస్తే చించి చదివి బిత్తరపోయింది. ఉత్తరం పట్టుకొని బంగళా మీదికి పరిగెత్తింది. ప్రవేశిస్తూనే -

"కరణాన్ని ముక్కలు ముక్కలు నరికేశిన్రట బొంద్రాయికాడ లంబాడోల్లు" అని చెప్పేసింది మంజరి.

'నిజమా? . . . .' అమాంతంగా లేచికూర్చొని అడిగాడు పాణి.

ఉత్తరం అందించింది మంజరి.

"పాపం కరణం!" అన్నాడు పాణి.

"చేసిన పాపం ఊరికనే పోతాది?" మంజరి అన్నది.

'తాయారు ఎంత రాక్షసి!' అనుకున్నా రిద్దరూ.

అప్పుడుగాని అర్థంకాలేదు, తల్లికా వార్త ఇంకా అందించలేదని. 'అమ్మకు చెప్తొస్త' అని ఉత్తరం పట్టుకొని మెట్లు దిగుతూంటే, అప్పుడే ఇంట్లో అడుగుపెడ్తున్న ఇంద్రారెడ్డి, ఆయన సతీమణి కన్పించారు.

వారు కనిపించగానే చిన్నపిల్లయిపోయింది మంజరి. "అమ్మా, మామయ్యొచ్చిండు, అత్తమ్మొచ్చింది" అని కేకవేసి గబగబా మెట్లుదిగి అత్తపాదాలంటి నమస్కరించింది. ఆమె మంజరిని లేవనెత్తి కౌగలించుకుంది. వనజా, ఇందిరమ్మా వచ్చేశారు. మంజరి తల దువ్వుతూ, 'వదినా'! చంద్రశేఖరుడుంటే దీని మొగుడు కావలసినోడు చూడు, ఆ జుట్టు-ఆ కండ్లు అట్లనే ఉన్నయి' అన్నాది.

'యాడ పోయిండు చిందొరా, దొర్సానీ?' అని అడిగింది వనజ. వారు నుంచున్నారనే విషయం కూడా గ్రహించక.

'కృష్ణ స్నానాలకు బెజవాడ పోయినం. ఒడ్డున పిల్లవాణ్ణి కూర్చుండ బెట్టి ఏట్ల మునిగినం. స్నానాలు చేసి వచ్చి చూస్తిమికద, పిల్లగాడు లేడు. దాసీదాన్ని కొట్టినం, తిట్టినం. బెజవాడంత వెతికించిన దొరకలే.'

"అట్లా కాద్దొర్సానీ! పంతులుకు చిందొర్సాని పోలికలున్నాయా అని."

అప్పుడు గుర్తుకు వచ్చాయి పోలికలు ఇందిరమ్మకు. "అవునే, పోలికలున్నాయి" అన్నది.

"పంతులెవ్వరు?" ఇంద్రారెడ్డి దంపతులు ఒక్కసారి అడిగారు. వారి కంఠ ధ్వనిలో గంపెడాశ గోచరించింది.

"సరేగాని దొరసానీ, ఇంకేమన్న గుర్తులున్నాయా చిందొరకు?" వనజ అడిగింది.

'కుడిబుజాన పెద్ద పుట్టుమచ్చున్నదే.'

"అయితే, అన్నయ్య చిందొరే!" అని పరిగెత్తింది వనజ.

మంజరి తబ్బిబ్బైంది.

వనజ పాణిని క్రిందికి లాక్కొచ్చింది రొప్పుతూనే. పాణి పుట్టుమచ్చ చూపించింది.

'నాయానా, చంద్రశేఖరం!' అని కౌగలించుకుంది తల్లి.

అందరి కళ్ళూ చెమ్మగిల్లాయి.

పాణికేమీ అర్థం కాలేదు.

తల్లి అంతా చెప్పింది. 'అమ్మా! . . .' అని కౌగలించుకున్నాడు తల్లిని చంద్రశేఖరరెడ్డి.

తండ్రినీ కౌగలించుకున్నాడు.

× × ×

రామారెడ్డిగారి స్థితి అర్ధరాత్రికి విషమించింది. గొంతు ఆరిపోతూంది. ఏదో అడ్డు తగిలినట్లుంది. మాట పెకలదు. లైటున్నా అంధకారం. ఫ్యాను తిరుగుతున్నా నిప్పుల్లో పెట్టినట్లుంది. వనజ మంచం పక్కన పడుకుందని తెలుసు. పిలవాలంటే మాటరాదు. అంధకారం. గడీలో శవాల కుప్పలు. శవాలు లేచాయి. వికటంగా నవ్వుతున్నాయి. నగ్న స్త్రీలు గావుకేకలు పెడుతున్నారు. అంతా తన మీదికే వస్తున్నారు. అడిగో . . . అడిగో . . . పీరిగాడు. నల్లని కొండ. రాక్షసుడు - వస్తున్నాడు తన మీదికే.

కెవ్వున కేక వేయాలనిపించింది. గుండె దడదడలాడింది. రక్తం ఆవిరై పోతూంది. శక్తంతా జారిపోతుంది. లేచి పరిగెత్తాలనిపిస్తూంది. కదలలేడు, మెదలలేడు. గుండెలో చీకట్లు కమ్ముకుంటున్నాయి.

ఎందుకలా బాదుతున్నారు తనను? కర్రలతో, గునపాలతో, గొడ్డళ్ళతో, రోకళ్ళతో ఎందుకు మోదుతున్నారు? అబ్బ! రక్తం ... రక్తం . . . రక్తం .. . . రక్తపుటేరు-అందులోనే తాను తేలుతున్నాడు.

వగర్పు, ఆరాటం, భయం, తపన, ఆతురత, యాతన!

చీకట్లు చెదిరిపోయాయి. ఏదో వెలుగులాంటిది కన్పించింది. గుండె తేలికపడినట్లయింది. తేలిపోతూంది. ఏవో ఆలోచనలు! ఎన్నో ఆలోచనలు. తేనెటీగల్లాగ ముసిరాయి. ఎందుకీ యాతన? ఏమిటి తాను చేసింది? గడీ.భార్య. కూతురు. గుండెనెవరో చీలుస్తున్నారు. ఏరీవారు? వారికోసం తానెంత మందిని హింసించాడు? ఎందరిని చంపాడు? ఎన్ని మానభంగాలు చేశాడు! తనకేం హక్కుంది అలా చేయడానికి?

మనుషులంతా తనలాగే పుట్టారు. తానూ వారిలానే పుట్టాడు. అయినప్పుడు ఏమిటీ వ్యత్యాసం? ఏమిటీ భేదం? ఏమిటీ అంతరం? ఎలా వచ్చాయి ఇవి?

సంపద, అధికారం-ఈ రెండే తనచేత ఎన్నో దుష్కృత్యాలు చేయించాయి. వాటి నీడలో తానెన్నో నిండు సంసారాలు కూల్చాడు. అవి మనిషి మనిషికీ నడుమ నిల్చిన అడ్డుగోడలు. వాటి వలనే మనిషి తన తోటివాణ్ణి మనిషిగా గుర్తించలేకపోతున్నాడు. ఆ గోడలు కూలాలి. వాటిని కూల్చాలి.

గొంతులో బల్లెం గుచ్చినట్టయింది. కెవ్వున కేకపెట్టాడు. వనజ ఉలిక్కిపడి లేచింది. రెడ్డిగారి చూపుల్లో మృత్యువు కనిపించింది. తనకు తెలియకుండానే "నాయ్నా!" అని రొమ్ముమీద వాలిపోయింది. రెడ్డిగారు ఆమె తల నిమిరారు. వనజ నివ్వెరబోయి తండ్రిని చూచింది. కన్నీరు కొలకుల్లో చేరి ప్రవహించింది. కళ్ళలో ఏదో చెప్పాలనే బాధ, ఆత్రుత కనిపించింది. లాభం లేదు. మృత్యుదేవత పిడికిలి మరింత బిగిసింది. ఆ పిడికిట 'చిల్లరదేవుళ్ళు' చివరి శ్వాసలు నిలిచిపోయాయి.

"నాయ్నా! నాయ్నా!' అంది వనజ. కన్నీటి తెరలనుండి రామారెడ్డి కడపటి రూపాన్ని చూసింది.

చీకటి తెరలు ఎక్కడివక్కడ నిల్చిపోతుంటే, ప్రాభాత మందారనిలాలతో కలిసి ఉషాదేవి అవతరించింది.

తమసోమా జ్యోతిర్గమయ.

× × ×

# ప్రాంతీయ పదాలకు అర్థసూచిక

1. గడీ =దొరలుండే మేడ
2. బంకు =కొలువుకూటం
3. అంగుష్ఠనిషా =వ్రేలిముద్రలు
4. బేగారం =వెట్టిపని
5. ఖిలాఫ్ =వ్యతిరేకంగా
6. ఇంతేజాము =ఏర్పాట్లు
7. శురు =ఆరంభం
8. ఖితాబు =బిరుదు
9. హుజూర్ =నైజాంనవాబు
10. సుత్లి గిట్ల =పురికొస మొదలైనవి
11. యాదమరిచిన =జ్ఞాపకం
12. సుత =కూడా
13. జర్ర =కొంచెం
14. బాంచెను =బానిసను
15. గులాపోణ్ణి =సేవకుణ్ణి
16. నీ తాన =నీ వద్ద
17. తష్తరీ =పళ్ళెం
18. అర్రల =గదిలో
19. గడీ =దొరలుండే మేడ
20. ఆడబాప =తెలంగాణాలో దొరల ఇండ్లలో వుండే సేవికలు
21. షికాయతు =ఫిర్యాదు
22. మస్కూరోళ్ళు =తలార్లు
23. హిస్సెలు =భాగాలు
24. ఎగుసం =వ్యవసాయం
25. మునాఫకు =కౌలుకు
26. మక్తగింజలు =కౌలు గింజలు
27. దొరతానికి =దొరదగ్గిరకు
28. మస్తీ =పొగరు
29. గలాయిస్తున్నావా=కరిగిస్తున్నావా
30. అప్సర్లు =ఆఫీసర్లు
31. మహబూబ్ పాషా =అప్పటి నిజాం తండ్రి
32. యాదికి =జ్ఞాపకానికి
33. ఇంతజాముల్ల =ఏర్పాట్లలో
34. మస్రూఫుండి =నిమగ్నుడైవుం‹
35. దినాం =రోజూ
36. దస్తార్ =పటకా
37. దెగ్గిల్లో =గుండిగలలో
38. మస్కూరు =తలారి
39. ఠీక్ =సరిగా
40. ఏత్‌రాజ్ =అభ్యంతరం
41. తామీల్ =అమలు
42. ఇత్తేహాదుల్ ముసల్మీన్ =మహమ్మదీయుల సంస్థ
43. ఆలా హజ్రత్ =నిజాంరాజుకున్న బిరుదు
44. సేగా =డిపార్టుమెంటు, శాఖ
45. ఖాజీ =మహమ్మదీయ పురోహితుడు
46. ఇస్లామ్ ముసల్మీన్ =ముసల్మానుల సంక్షేమం కొరకుగాను ఏర్పాటుచేసిన శాఖ
47. షుక్రియా =కృతజ్ఞత
48. మస్తీ =పొగరు
49. మదర్స =బడి
50. గానా బజానా =పాట, మేళం
51. శురూ =ఆరంభం
52. జిమ్మేదారి =బాధ్యత
53. తష్ఫియ =పరిష్కారం
54. ఫసల్ =పంట
55. కమ్జోర్ =బలహీనుడు
56. ఎత్మెనా =నమ్మకం
57. రోజ్నామ్చా =డైరీ
58. గస్తీ =గస్తీ
59. తమామ్ =అంతా
60. ఖైరియత్ =క్షేమం
61. జాన్‌వర్లు =పశువులు

62. ముసాఫిర్లు =ప్రయాణికులు
63. సునార్లు =కంసాలీలు
64. గలాయించలేదు =కరిగించలేదు
65. చోరీ =దొంగతనం
66. సర్ఖా =దోపిడి
67. పోరోక్త్ =క్రయవిక్రయాలు
68. మెహర్బానీ =అనుగ్రహం
69. మినిట్ల =నిమిషంలో
70. దునియంత =ప్రపంచమంతా
71. నసీబెట్లున్నదో =అదృష్టమెట్లున్నదో
72. ఎహత్యాత్ =జాగ్రత్తగా
73. షుబా =అనుమానం
74. తస్ఫియ =తీర్మానం
75. అర్సుకొని =కనుక్కొని
76. హుజూర్ =రాజుగారు
77. కచ్చడం =ఎద్దుబండి, సుఖప్రయాణానికి తగినది
78. చెప్పసుతలేదు =చెప్పనుకూడా లేదు
79. గాడికి యాళైతాంది =బండికి వేళ అవుతూంది
80. సూరన్న =సూర్యుడు
81. మోటార్ గాడి =మోటారుబండి
82. పరదలు =తెరలు
83. ఏంజబిరిందు, =ఎంత బాదారు,
84. నవిసిందు =జబ్బునపడ్డాడు
85. అప్సర్లు =ఆఫీసర్లు
86. బోనాలు =ఘటాలు
87. బైండ్లోడు =హరిజనుల పురోహితుడు
88. ఏటను =మేకను
89. పూర =పూర్తిగా
90. తోడెం తోడెం =కొద్దికొద్దిగా
91. బాత్ చీత్ =మాట్లాడితే
92. గైర్ =పరాయి
93. ఇజ్జతు =గౌరవం
94. ఇత్తెహాద్ =అయికమత్యం
95. ఝుగ్డా =తగాదా
96. ఒకదఫా =ఒకసారి
97. వాఖయా =సంగతి
98. గుజ రాయించింది =జరిగింది
99. పోట్టెగాడు =పిల్లవాడు
100. పైదల్ =కాలినడక
101. జఖమ్ =గాయం
102. ఖూన్ =నెత్తురు
103. బహాయించింది =కారింది
104. జమీన్ =నేల
105. పీఛాచేసిన =వెంబడించా
106. సడక్ న =రోడ్డున
107. ఖామాఖా =ఉట్టిగనే
108. మారేసాబు =కొట్టారండీ
109. గరమైందు =ఆవేశపడ్డాడు
110. గల్లా =మెడ
111. లగాయించిన =తగిలించాను
112. అస్పాస్లున్న =చుట్టుప్రక్కలున్న
113. ఫర్మానా =రాజశాసనం
114. యేమక్మా =యేప్రభుత్వశాఖ
115. హుకుం =అనుమతి
116. అగరు =ఒకవేళ
117. ఫౌరన్ =తక్షణం
118. అక్సరు =తరచు
119. మజహబీ =మత సంబంధమైన
120. బాబె హుకూమత్ =ప్రభుత్వం
121. సైకిలు కో లైట్ కహాఁహై? =సైకిలుకు లైటు ఏది?
122. దిన్ మే, లైట్ క్యాఁసాబు? =పగటిపూట లైటెందుకండి?
123. సైకిల్ కో లైట్ రహనా, దిన్ క్యా రాత్ క్యా =పగలేమిటి, రాత్రేమిటి సైకిలుకు లైటు వుండాలి.
124. బిర్న =త్వరగా
125. తస్వీర్లు =ఫోటోలు
126. పోషా =దుసులు

127. తస్వీర్లు గుంజేపెట్టె =కెమెరా
128. ఇనాం =బహుమతి
129. తిప్పలే =ఆపద
130. ఖీమత్ =వెల
131. ఎహెత్యాలుగ =జాగ్రత్తగా
132. మస్తి =పొగరు
133. ఎట్ల కొడ్త =ఎలా ఉంటాను
134. ఖాస్కర్ =ముఖ్యంగా
135. ఉమూర్ మతహబీ =మత సంబంధమైన శాఖ
136. జమీ =భూమి
137. ఫసల్ =పంట
138. తక్లీపొచ్చేంది =కష్టం
139. పరార్ =పారిపోవడం
140. హమ్లా =దాడి
141. చమ్డ =చర్మం
142. ఖందిళ్ళు =లాంతర్లు
143. లాతు =తన్నులు
144. బన్యా =కోమటి
145. ముర్గి =కోడి
146. ఖబర్ =వార్త
147. మాలూమ్కాలే =తెలియలేదా
148. మంగాకే దేవ్ =తెప్పించియివ్వు
149. హమేషా =ఎల్లప్పుడు
150. గాఁవ్మీద్కి =ఊరుమీదకు
151. బందూఖ్ =తుపాకీ
152. ఖూబ్ఖాకె =బాగా తిని
153. మూఁబంద్కర్ =నోరుమూయి
154. ఖంబాలకు =స్తంభాలకు
155. కమ్రాల =గదిలో
156. ఉఖ్డాయించుకొచ్చి =పీక్కొచ్చి
157. షుక్రియా =కృతజ్ఞత
158. డాకా =దొమ్మి
159. జానేనై =తెలియదా
160. జలాదేతేఁ =కాల్చిపారేస్తాం
161. బేగారి =వెట్టిపని
162. బేవకూఫ్ =తెలివితక్కువ గాడిద
163. నికాల్దేవ్ =తీసెయ్యి
164. పీటో =కొట్టండి
165. దావత్ =విందు
166. అరజ్ =విన్నవించు
167. కలాలోండ్లకు =గౌండ్లవాళ్ళకు
168. హడ్డీ నరమ్ చేస్తా =ఎముకలు విరగ్గొడతా
169. ఘడేలావ్ =కుండలుతే
170. హవా =గాలి
171. అచార్లు =ఊరగాయ పచ్చళ్ళు
172. రైరో =ఆగు
173. దేఖో =చూడు
174. కౌన్ హైరే వహాఁ? =ఎవడ్రా అక్కడ
175. ఔరతోఁకో పకడ్లావ్ =ఆడవాళ్ళను పట్టుకురా
176. ఖూబ్సూరత్ గున్నవే =అందంగా వున్నావే
177. కమ్రేమే ఫేంకో =గదిలో పారేయండి
178. అబ్ కహా జావోగే =ఇప్పుడెక్కడికి పోతావ్
179. బద్లా =పగ తీర్చుకోవాలి
180. ఖతల్ =చంపేస్తావ్
181. ఖతల్ ముకద్దామ్మా =ఖూనీ కేసు
182. ఉల్టా =తల్లక్రిందులు
183. అదనా =హీనులైన
184. గిరఫ్తార్ =అరెస్టు
185. హవాలాత్ల =కస్టడీలో
186. గవా =సాక్ష్యం
187. జల్దీ భూల్ గయారే =అప్పుడే మరచిపోయావురా
188. కలాల్ను =గౌండ్ల అతన్ని

189. దఫన్, చెయ్యాలే =పూడ్చి పెట్టలేదా
190. దఫాయిస్తా =పూడ్చి పెట్టిస్తా
191. రిహా =వదలి పెడతారా
192. హిఫాజత్ =రక్షణ
193. ఖత్ర =అపాయము
194. గవా =సాక్ష్యం
195. ముకద్దమ =కేసు
196. కాష్త =సేద్యం
197. ఖరార బోలా =బాగా చెప్పావు
198. లాష్ =శవం
199. హహలా =అప్పగించి
200. రఖమ్ =డబ్బు
201. బస్ నై హోతా =చాలదు
202. హజారు =వేయి
203. సాత్ సౌ =ఏడు వందలు
204. అచ్ఛ =మంచిది
205. చానిపి =కళాపి
206. తండలే =మూకలు
207. ఫౌరన్ =తక్షణమే
208. హవామేఁ గోలీ చలావ్ =గాలిలోకి పేల్చండి
209. పాని =నీళ్ళు
210. కుమార్‌కు బులాకె పానీ పిలావ్ =కుమ్మరినీ పిలిపించి నీళ్ళు తాగించండి
211. కౌన్ మారా? =ఎవరు కొట్టారు
212. బద్లా =పగ తీర్చుకోవడం
213. మారో =కొట్టండి
214. ఖుబూల్ =నేరం ఒప్పుకొనుట
215. ఆసానీగ =సులభంగా
216. ఖుబుల్లేవ్ నైతో జలాదూఁగా =ఒప్పుకోండి, లేకపోతే కాల్చేస్తా
217. రస్తకొచ్చిను =దారికొచ్చారు
218. చంబార్ కే దేవ్ కో చప్పల్ కీ పూజా =తోళ్ళవాడి దేవుడికి చెప్పులతో పూజా
219. నర్మి =మెత్తగా చెబితే
220. ఖోల్ దేవ్ =విప్పేసెయ్యండి
221. ముల్జిమీన్ =నేరస్తులు
222. హాజర్ హై =హాజరై ఉన్నారా
223. తాజీరాత్ =హైదరాబాదు రాజ్యపు శిక్షాస్మృతి
224. దఫా 224 =సెక్షను 224
225. ఖత్లే =హత్య
226. హమ్‌లా =దాడి
227. సర్ఖా =దొంగతనం
228. డకేటీ =దోపిడి
229. తహఖీఖాత్ =విచారణ
230. సజా =శిక్ష
231. అరజ్ =వినతి

232. ఖుదాకో హాజర్ నాజర్ జాన్కర్ కహతా హూఁ కి మై జోకుఛ్ భీ కహూఁగా సహి కహూఁగా సివాయే సహికే ఔర్ కుచ్ నహీ కహూఁగా = భగవంతుడు ప్రత్యక్షంగా ఉన్నట్లు భావించి నిజం చెప్పుతాను. నిజం తప్ప వేరు చెప్పను.
233. ఖసం తినం =ఒట్టు పెట్టుకోము
234. జురుమ్ ఖుబూల్ =నేరం ఒప్పుకున్నారు
235. సజాయె ఖైద్ =ఖైదు శిక్ష
236. హిరాసత్ల =కస్టడీలో నుండి
237. ఫరార్ =పరారీ
238. తాఖత్ =బలం
239. ఫరజ్ అంజామ్ చేయిటాన్కి =కర్తవ్య నిర్వహణకు

240. బేఖుసూర్‌గా =నిర్దోషిగా
241. రిహాచేస్తున్నం =వదిలివేస్తున్నాం
242. పాటక్ల =గేటులో
243. అర్రలకి =గదులకు
244. శురు =ఆరంభం
245. జార్ =వేచివుంటారు
246. సైసు =గుర్రాల పోషకుడు
247. చక్కరొచ్చింది =ఒళ్ళు తిరిగింది
248. దునియంత =ప్రపంచమంతా
249. దేగాటకు =దండాడింపు
250. ఛీయు =కల్లు
251. పరారైతావురా =పారిపోతావురా
252. ఖతల్ ముకద్దమే =ఖూనీకేసు
253. పాఁసీ =ఉరిశిక్ష
254. ఆపస్లో =ఒకరి కొకరు
255. ఖతల్ =ఖూనీ
256. ఇత్తలా =వర్తమానం చేయుట
257. వాయిద =వాగ్దానం
258. జమీనొద్దు =భూమి వద్దు
259. మద్దతు =సహాయం
260. గిరఫ్తార్ =అరెస్టు
261. ముకద్దమ =కేసు
262. బద్మాషు =దుర్మార్గుడు
263. తక్రార్ =పోట్లాడితే
264. పూర =పూర్తిగా
265. కమ్జోరై పోయిన =బలహీనుడనై పోయినాను
266. షత్రంజీలు =విలువైన వస్త్రములు
267. అర్సుకోవాలే =చూడవలె
268. బాజాలోండ్లు =మేళగాళ్ళు
269. జల్ది =త్వరగా
270. అలికి =తక్కువ

★ ★ ★